-

# మహాభిషేక లంబకము.

౧-వ తరంగము.

క. జ్యోత్స్నిస్నులఁ దాండవమున
వాతిరియపం దెవఁడు వెంచు రహిం నుతిప్రా
త్యాతత శుండా వము
వ్రాతంబుఁ నతఁడు విఘ్నరా జేలు మిమున్.

అట్లు గోవిందకూటమందు నరవాహనదత్తుఁ డుండఁగా నొకనాఁ డతనిని ఆస్థానస్థితుని ఆకాశమార్గమున వచ్చి సందర్శించి అమృతప్రభుఁ డను విద్యాధరేశ్వరుఁడు మున్ను తని నగ్ని పర్వతమునుండి రక్షించినవాఁడు తన్నుం దెలుపుకొని మ్రొక్కి చక్రవర్తివలనం బ్రీతిపూర్వకం బయినయతిథిసత్కారంబు వడసి యిట్లు విన్నవించెను.— 'మహాప్రభూ, దక్షిణదిక్కున మలయమని మహాపర్వతము గలదు. అందు ఆశ్రమంబున వామదేవుఁడని మహాముని కలఁడు. ఆయన నిన్నేమో పనిమీఁద నచటికి ఒంటరిగా రమ్మని కోరుచున్నాఁడు. పిలువ నన్నుం బంపినాఁడు. నేను పూర్వమే నిన్ను సాదౌరనుగా సంపాదించుకొనియుంటిని గదా, కాన నిపుడు వచ్చితిని. మఱి రమ్ము శీఘ్రముగా ఆ మునికడకు సిద్ధికై పోవుదము.

అంతట వల్లెయని నరవాహనదత్తుఁడు భార్యలను సేనలను అచటనే యుంచి తరలి నభోమార్గంబున నప్పుడ మలయాచలంబున కరిగి అందు వామదేవమహామునిని ముదిమిచే పాండురత్వ మొంది ఉన్నతమూర్తియై మాంసహీనంపుఁ గనుగుహాలలో మెఱయుచున్న కనుపాపమణులు గలిగి విద్యాధరేంద్రరత్నములకు కావలమై వెల్లజటాలలితుండై సాహాయ్యార్థమేతెంచిన హేమాచలంబుంబోనివానిని దర్శించి యడుగులకు నమస్కరించెను. మునియు రాజున కాతిథ్య మొసంగి యిట్లు వాక్రుచ్చెను:-"నీవు కాముఁడవు, పూర్వము దగ్ధుఁడ వయ్యును రతిమీఁదితుష్టిచే శంభునిచే సర్వవిద్యాధరులకును చక్రవర్తివిగా నిర్మింపఁబడినాఁడవు! ఈనాయాశ్రమంబున కదులోఁతయినగుహాలోపల రత్నము లున్నవి, వానిని నేను చెప్పెదను, నీవు సాధింపుము. సిద్ధరత్నునికి నీకు మందరదేవుఁడు జయ్యుఁడగును. ఇందులకే ముక్కంటియాజ్ఞచే నేను నిన్నిటకు రావించితిని.' ఇట్లు తెలిపి యాముని నరవాహనదత్తునికి రత్నసాధనవిధానము నుపదేశించెను.

ఆతే చక్రవర్తి సంతోషంబున గుహం జొచ్చెను. అందుప్పతిల్లిన నానావిఘ్నములను జయించి యాతం దరుగుచుండ ననర్గళగళగర్జనంబుసేయుచు మత్తవారణేంద్రంబు ఆతనిమీఁదికి వచ్చెను. అంత నాతండు దానిని మొగంబున పిడికిటం బొడిచి ఇరుగోఱల రెండడుగు లుంచి లగువు మెఱసి యెక్కి కూర్చుం

డెను. 'బలీ! మహాగజరత్నము చక్రవర్తికి నీకు సిద్ధించినది' అని తత్కాలంబున గుహామధ్యంబున నశరీరవాణి వినఁబడెను. అనంతరము ఆతఁడు నాగేంద్రసదృశ మయిన కత్తి నొకటిం గాంచి చక్రవర్తిత్వలక్ష్మికీల్జడంబోలె దానిని కేలం గొనియెను. 'బలీ! నీకు ఖడ్గరత్నము సిద్ధించినది' అని యప్పుడు గుహాలో అశరీరవాణి వినంబడియెను. అనంతర మాతఁడు ఆగుహాలో చంద్రికారత్నమును, కామినీరత్నమును, విధ్వంసిని యనువేరి విద్యారత్నంబును, సాధించెను. ఇబ్బంగిని కొలను గందపు ప్రాను అని ముస్నపేర్కొన్న యారెండురత్నంబులతోఁ గూడ ఏడు రత్నములను పనివేళ తోడ్పడువానిని మాహాత్మ్యశ్రీ మొసంగువానిని నరవాహనదత్తుఁడు సాధించెను. అంత నతఁడు గుహవెలువడి వాముదేవమహర్షిం గాంచి సర్వము సిద్ధించిన దని తెలిపెను. అంతట ముని ప్రీతిమెయి చక్రవర్తితో 'వత్సా, మహాచక్రవర్తిరత్నము లెల్ల నీకు సిద్ధించినవి. ఇఁక పొమ్ము, కైలాసము నుత్తరపార్శ్వమందున్న యా మందర దేవుని గెలువుము. ఇరుపజ్జలమహాచక్రవర్తిలక్ష్మిని అనుభవింపుము.' అని పలికెను.

అంత నాతనికి నమస్కరించి చక్రవర్తి అమృతప్రభు నితో నింటిదారిం దరలినవాఁడై గోవిందకూటమందు తన యత్త మహాప్రభాపురాలు ధనవతి కాచుచున్న తనవిడిదలం జేరెను. అందు తనరాశివాసంబులును మిత్త్రులును విద్యా

ధరేంద్రులును తనదారినే ఎదురుచూచుచుండి తనరాకకు కరము సంతోషంబునం దేలిరి. అంతటఁ గూర్చుండినవాఁడై చక్రవర్తి వారడుగగా వామదేవమహర్షి దర్శనంబును గుహాప్రవేశంబును రత్నసిద్ధియు వర్ణించెను. అంత దివ్యతూర్యవాదన విద్యాధరీనర్తన పానగోష్ఠీ భూయిష్ఠంబుగా మహోత్సవం బాయెను.

మఱునాఁడు క్రూరగ్రహములు శత్రుస్థానములందును సౌమ్యగ్రహంబులు కంటకస్థానంబులందును గలిగి షడ్వర్గసంపత్సంపన్నంబయి తనకు బుద్ధిప్రదంబైన శుభలగ్నంబున కృతమంగళుండయి చక్రవర్తి శంభుదత్తం బయిన యా బ్రహ్మనిర్మిత పద్మవిమానం బెక్కి మందరదేవజయార్థము ససైన్యుండై అంతఃపురంబులతో నభోమార్గంబున బయలుదేఱెను. ఇతని చుట్టును దళవాయి హరిశిఖుని యానఁబడి భక్తులు భీతులు గంధర్వరాజ విద్యాధరాధిపులు నడచిరి. జ్ఞానిని మును తల్లి ధనవతితోఁగూడ చండసింహుండును, వీరుఁడు పింగళగాంధారుఁడును, అట్లే బలాఢ్యుఁడౌ వాయుపథుఁడును, విద్యుత్పుంజుఁడును, అమితగతియు, కాలకూటపతియు, మహాదంష్ట్రునితోఁగూడ మందరుండును, రాజామిత్రుఁడు అమృతప్రభుండును, సాగరదత్తునితోఁగూడ వీరుఁడు చిత్రాంగదుండును, వీరును ఇంక గౌరిముండుని యాశ్రితు లయిన యితరవిద్యాధరేశ్వరులును ఎల్లవారును తమతమబలంబులతోడ అవిజిగీషునితోఁ

గూడ నడచిరి. ఆసమయంబున ఆకసమెల్ల నితని సేనచే చాటు పడఁగా ప్రొద్దు ఇతనితేజంబునకు తనతేజము డీల్పడినలజ్జ చేతనుంబోలె ఎటనో డాఁగిపోయెను. దేవర్షిసమవాయసంసేవితంబయిన మానససరోవరమును దాఁటి నాకస్త్రీలీలోద్యానంబయిన గండశైలంబును దాఁటి చక్రవర్తి తనకీర్తిప్రాయోయున స్ఫటికధవళంబయిన కైలాసమహీధరంబుకడ నిలిచెను.

అవట వేలుపుటేటిదరిని కూర్చుసి నరవాహనదత్తునితో మందరుండు ప్రణయబంధురంబుగా నిట్లనియె:—‘దేవా, ఇచటనే మందాకినిగట్టున నివసింపవలయును. ఈకైలాసమును ఉల్లంఘించుట శుభముకాదు. హరుని నివాసమును దీనిని పై దాఁటినయెడల తత్క్షణమె విద్యలు నశించును. దీని యుత్తర పార్శ్వమునకు త్రిశీర్షగుహాద్వారము పోవలయును. దానిని దేవమాయుఁడను రాజు కాచుచున్నాఁడు. అతఁడు కడు దీమసగాఁడు. అతని నోర్వక పోవఁదరము గాదు.’ ఇట్లు మందరుఁడు పలుకఁగా ధనవతియు నమోదింపఁగా నరవాహనదత్తుఁడు ఆదిన మచ్చుటనే నిలిచెను. దేవమాయునికి సామపూర్వకంబుగా దూతం బంపెను. ఆతఁడు మంచిమాటల సరకుగొనక ఇతని శాసనమును తిరస్కరించెను. మఱునాఁడు చక్రవర్తి తన రాజులు యుద్ధసన్నాహంబున తమతమబలంబులతో సిద్ధపడి వెంటరా నా దేవమాయునిమీఁదికి దాడివెడలెను. దానినెఱింగి దేవమాయుండును వరాహ వజ్రముష్టి ప్రభృతి బహురాజసమ

న్వితుఁడై సేనాసనాథుండై లేచి వచ్చి చక్రవర్తి నెదుర్కొ-
నెను. అంతట నిరువాగుం దలపడఁగా నావెండికొండయందు
సురసంఘాతవిమానఘటలు నింగిం గ్రమ్మ, త్రెచ్చినతలకాయ
మొత్తంపువడగండ్లజడు లడ లిడ, వీరగర్జారవంబులు పెల్లు
మీఱ, ఘోరతరం బయిన కలనివాన కాఱు ప్రవర్తిల్లెను. దేవ
మాయునిదళవాయి నగ్రయోధుని వరాహుని చండసింహుడు
కూల్చుట యబ్రము గాదు, మఱి దేవమాయునే యమాయుడు
నరవాహనదత్తుఁడు పోర మోఁదుల సోలించి కట్టి తెచ్చుట
చిత్రము. వాఁడు కట్టుఁబడఁగానే వాని మొన వజ్రముష్టి మహా
బాహు తీక్ష్ణదంష్ట్రాది మహారథులతోఁగూడ విఱిగిపాఱెను.
అంత వేల్పులు బళిబళి యన ఎల్లవారును విజయోర్జితుని చక్ర
వర్తిం గొనియాడిరి. అనంతరము ఆమహాప్రభువు కట్టుతోనే
తేఁబడి యెదుట నిల్పంబడినయాదేవమాయుని ఓదార్చి కనికరం
బున కట్లు విడిపించెను. బాహుజితుఁడు దేవమాయుఁడును వజ్ర
ముష్ట్యాదినిజానుచరులతోఁగూడం బ్రణతుఁడై చక్రవర్తి శాస
నమును శిరమున గ్రహించెను. అంతట పోరు ముగిసి
యాదినము కడవఁగా మఱునాఁడు ప్రాతఃకాలమున ఓలగంబున
చక్రవర్తి త్రిశీర్షగుహాప్రవేశేచ్ఛచేత నడుగఁగా పార్శ్వంబునం
గొలుచుచున్న దేవమాయుఁడు తచ్చరిత్రంబు నిట్లు వక్కా-
ణించెను.

దేవా, పూర్వము కైలాసంబు నుత్తరదక్షిణ పార్శ్వములు రెండును వెవ్వేఱుగా నిద్దఱుచక్రవర్తులక్రింద విద్యాధరాశ్రితంబులై యుండినవి. ఇట్లుండ ఋషభుఁ డను నాతఁడు తపంబున శివుని మెప్పించి రెండు పార్శ్వంబులకును తా నొక్కండె చక్రవర్తిగా వర మొందెను. అతఁ డొకప్పుడు ఉత్తరపార్శ్వమునకుఁ జనుటకై కైలాసమును పైగా దాఁట బోయినవాఁడై క్రిందివారుని క్రోధంబునం జేసి విద్యలు పోయి నేలంగూలెను. అంతట ఋషభుండు వెండియు ఘోరతపంబు సల్పి హరునికరుణ వడసి మునుపటివలెనే యిరుపక్షములకుం జక్రవర్తిగా వర మొంది యి ట్లని విన్నవించుకొనెను.—'దేవదేవా, మాకు కైలాసోల్లంఘన మేమో లేదాయెను, మఱి యేదారిని నే నిరుపార్శ్వంబులకును చక్రవర్తిని కాఁగలను.' అంతట పినాకపాణి ఋషభుని కుత్తరదిగ్గమనార్థము కైలాసంబు నడుగుండొలిచి గొప్పగుహాపథం బేర్పఱిచెను. అట్లు రంధ్రపడి కైలాసుఁడు దుఃఖితుఁడై పరమేశ్వరునితో నిట్లు విన్నవించుకొనియెను.—'స్వామీ, ఈనాయుత్తరభాగము మనుష్యులకగమ్య మయియుండినది. ఇపు డీగుహ చేత వారికి సయితము గమ్యమైనది. దేవా, నామర్యాద యెప్పటియట్లే భంగపడకుండునట్లుగా కావింపుము.' కైలాసుం డిట్లు మొఱ యిడుకొనఁగా మహేశ్వరుఁడు గుహలో కావలిగా దిగ్గజములను చూపువిసంపుఁబాఁపతేండ్లను, గుహ్యకులను ఉంచెను. దాని

దక్షిణద్వారమున మహామాయుఁ డను విద్యాధరేశ్వరుని ఉత్తరద్వారమున చండిక నపరాజితను కాళరాత్రిని కావలి యుంచెను. ఇట్లు గుహను రక్షించి శంకరుఁడు మహారత్న ములను సృజించి యీ వ్యవస్థ యేర్పఱిచెను.—'సిద్ధరత్నుఁ డైన చక్రవర్తి ఈయిరుపక్షములకుం జన నేర్చును. వేల్పులకును వారిభార్యలకును తద్భూతలకును ఈదారి గమ్యమగును. ఆచక్ర వర్తియనుమతి గల యుత్తరపార్శ్వంపు రాజులకును ఈదారి గమ్యమగును, తక్కొరులకుం గాదు.' ఇట్లు శంభుఁ డానతీ యఁగా ఋషభకుఁడు చక్రవర్తిపద మనుభవించుచుండి గర్వాతి రేకంబున దేవతలతో పోరుపెట్టుకొని ఇంద్రునివజ్రాయుధంపు వ్రేటున మడిసెను. ప్రభూ, ఇద యీత్రిశీర్షగుహామ్నాయము మిముబోంట్లకుఁ గాని ఒరులకు ఈగుహ చొరరానిది. కాల క్రమంబున గుహాద్వారరక్షకుఁ డగునామహామాయుని వంగ సంబున దేవమాయుఁడను నేను జన్మించితిని. 'విద్యాధరులలో వీఁడు పుట్టినాఁడు, పొర నరులకు గెలువ నలవి గాఁడు. వీని గెలుచువాఁడు ఇట చక్రవర్తి కాఁగలడు. ఆతఁడు వీనికి దొర యగును, ఆప్రభువును వీఁడు కొలువవలసినవాఁడు.' ఇట్లని నాపుట్టినతఱిని దివ్యవాణి పలికెను. అట్టినన్ను నీవు జయించి తివి, నీవు సిద్ధరత్నుఁడవు ప్రభావసంపన్నుఁడవు, కైలాసంబు నిరుపార్శ్వములకుం జక్రవర్తివి, మాదొరవు, కాన ఈత్రిశీర్ష గుహను కడచి కడమశత్రువుల జయింపుము.—

అంతట చక్రవర్తి 'మంచిది, పోవుదము, ఈదినము గుహావాకిట నుందము, తెల్లవాఱినంత సంవిధానము సంతరించుకొని గుహాంజొత్తము,' అని పలికి రాజు లందఱితోను దరలి వెంటనే త్రిశీర్ష గుహాద్వారంబున విడిసెను. సూర్యచంద్రులు లేక వెలుంగులేని లోతుగడుపుతో నాగుహా ప్రళయకాలంపుఁ బెన్జీఁకటుల పుట్టినిల్లో యనం దోఁచెను. మఱునాఁడు ఆగుహను పూజించి నరవాహనదత్తుఁడు విమానగతుఁడై తలంచినమాత్రాన వచ్చినయాసద్రత్నంబులు తోడుగా సపరివారుఁడై ప్రవేశించెను. చీఁకటులను చంద్రికారత్నముల చేతను, పాములచూపువిషంబును చందనంబుచేతను, దిగ్గజములను హస్తిరత్నముచేతను, గుహ్యకులను ఖడ్గరత్నముచేతను, ఇతరవిఘ్నముల నితరరత్నములచేతను, తొలఁగం ద్రోసి జనంబులతోఁ గూడ గుహం గడచి యుత్తరద్వారంబున వెలువడియెను. అట్లు గుహాగర్భమునుండి వెలువడి మహారాజు వెండి పుట్టువులేని జీవుల లోకాంతరంబుంబోని యా కైలాసోత్తరపార్శ్వంబుం గాంచెను. బళిబళి ! రత్నప్రభావప్రాప్తమాహాత్మ్యంబున చక్రవర్తీ, నీవు గుహం గడచితివి' అని యాసమయంబున నింటి వాక్కు వినంబడియెను.

అంతట ధనవతీదేవమాయులు ప్రభువులతో నిట్లు విన్నవించిరి:—'దేవా ఇట ద్వారమం దెప్పుడును కాళరాత్రి సన్నిహితరై యుండును. ఈమెను పూర్వము అమృతమథనావ

సరంబున అమృతహరణోద్యుక్తుల దానవేంద్రులం జెల్చుటకై
విష్ణుదేవుఁడు పుట్టించినాఁడు. యథోక్తముగా మిముబోంట్లు దక్క-
దక్కొరుఁ డెవ్వఁడును ఈగుహం గడవకుండునట్లు ఈమె నిచట
శంభుదేవుఁడు కావలి యుంచినాఁడు. నీవు చక్రవర్తివి సిద్ధ
రత్నుఁడవు దీనిం గడచితివి. కాన నిప్పు డీమెం బూజింపుము.
పూజించిన నీమె విజయ మిచ్చును.' ఇట్లు ధనవతీదేవమా
యాలు నరవాహనదత్తునితోఁ జెప్పుచుండఁగా నత్తఱి పగలు తుది
ముట్టెను. అంతం గైలాసోత్తాపాంశువులు సంధ్యారాగరంజితం
బులై వెంటనే రానున్న ఘోరనెత్తుటికల్లులాటను సూచిం
చునట్లొప్పెను. గుహాగర్భంబున తన్ను సరకుసేయనితడిపగ
చేతనో యన నాతనిబలమును చీకటిమొత్తము రెక్కొని
పొదివికొనెను. తన్నుం బూజింపమిం గలిగిన కాళరాత్రి పగ
మొలకలో యన భూత వేతాళ డాకినీ ఫేరుకంబులు వేట
లాడం దొడంగినవి. క్షణములో నాదళ మెల్ల నిమురకోయినట్లు
అంతట నిశ్చేష్టం బాయెను. నరవాహనదత్తుఁ డొక్కరుఁడు
మాత్రము ఆమోహాంబునఁ గాలేదు. అంత నాతఁ డా యి
డుమ పూజింపమికిం గినిసిన కాళరాత్రివిజృంభితం బని యూ
హించి నుడిపుష్పంబుల నిట్లు పూజింపం దొడంగెను. 'శిరశ్చ
క్రమందాకి సంచరించు నేర్పరివి, ప్రణవస్వరూపవు, నీవు ప్రాణ
శక్తివి, జంతువుల బ్రదికించుదానవు, నీకు నమస్కారము! ఎను
బోతు గొంతునెత్తుటిమోడికలోఁ దుచున్న ముమ్మొనవాలు మొన

లచే ముల్లోకముల నూఆశించిన దుర్గాదేవీ, నీకు నమస్కారము. కీల రురురుధిరంబు నించిన పుసుకం ద్రిప్పుచు నర్తించు నీవు త్రిజగద్రక్షాపాత్రంబుతోడనుంబోలె వెలుంగుదువు. కాళరాత్రి వయ్యును భవప్రియా నీవు పైకంటివెలుంగు దివ్వెతోడి కపాలంబునం జేసి చేతికపాలంబునం జేసియు సూర్యచంద్రసనాథ వుంబోలె నగపడుదువు.' ఇట్లు నుతించినను కాళరాత్రి తుష్టిం జెందకున్నంతట చక్రవర్తి తనతలయే బలిగా నామె నర్పింపఁ దొరంకొనియె. అంత నామె యాతఁడు దూసికొన్న కత్తిం గేలఁ బట్టి 'పుత్త్రా, సాహసము సేయకు. వీరునికి నీకు నేను సిద్ధించితిని, నీస్కంధావారము ఎప్పటియట్ల తెలివిం బొందును, జయ మొందుము.' అని నివారించెను. తత్క్షణమే నిదుర మేల్కాంచినకైవడి నాదళ మెల్ల ప్రకృతిం బొరసెను. అంతట భార్యలు మిత్త్రులును విద్యాధరేశ్వరులును ఎల్లవారును చక్రవర్తి ప్రభావముం బొగడిరి.

అనంతరము చక్రవర్తి ఆహారపానాద్యావశ్యక క్రియల నిర్వర్తించి యాత్రియామను శతయామంబోలెఁ గడపెను. తెల్లవాఱినంతట కాళరాత్రిం బూజించి అటనుండి తరలి అగ్ర భాగంబున తమదారి నరికట్టియున్న విద్యాధరుని ధూమశిఖుని గూర్చి నడచెను మందరదేవుని ప్రధానుఁ డయిన యాధూమ శిఖునితో నటఁ గల్గిన పోరి నే మని వర్ణింపవచ్చును. చద లెల్ల కత్తు లాయెను, నేలయెల్ల శూరులతలకాయ లాయెను, శబ్ద

మెల్ల కొట్టుకొట్టుమను పలుకు కాఱెను. అందు బలాత్కారంబున ధూమశిఖుఁడు కట్టఁబడి తేఁబడఁగా చక్రవర్తి యాతని సమ్మానించి తన శాసనము గ్రహింపఁజేసి శాంతధూమశిఖోద్రేకంబగు యగ్నిదగ్ధేంధనంబుక్రియ నున్న యాతనిపట్టణమునందు ఆదినము విడిసెను.

మఱునాఁడు చక్రవర్తి తనరాకను విని మందరదేవుఁడు తనతోఁ బోరవచ్చుచున్నాఁడని వేగులవలన నెఱింగినవాఁడై ఆయాయివిద్యాధరేశ్వరులతోఁ గూడ నాతనిమీఁదికి తాను విజయార్థము కృతనిశ్చయుఁడై నడతెంచెను. ఇంచుక నడవఁగానే మోహ్రిల మందరదేవుని దళము బహురాజగణపూర్ణంబై వ్యూహంబు తీరియుండం గని చక్రవర్తి తానును తనదండును ప్రతివ్యూహంబు రచియించి యాతని బలముమీఁదికి నడపుకొని పోయెను. అంత ప్రళయంబున నుట్టుపడాటి లేచిన కడలి వెల్లికలంబోని యయ్యిరుబలంబులకును పెనఁకువ దొరంకొనెను. చండసింహాదిమహారథులిప్రక్కను కాంచనదంష్ట్రాదిరాజులాప్రక్కను పోరం దొడఁగిరి. అంతట ముల్లోకములుం గ్రక్కదల కులాచలంబు లూటాడ సంగ్రామంబు ప్రళయకాల మారుతంబో యనం జెలరేఁగుచుండెను. అపుడు కైలాసము శూరశోణితకుంకుమలచే నొకపజ్జ నెఱ్ఱనై రెండవపజ్జ భూతిశ్వేతంబై గౌరీశుని చందంబున నందగించుచుండెను. ఖడ్గపట్టంబుల నుదయించిన పెక్కు సూర్యబింబంబుల వెలుంగులు

ఘోరంబులుగాఁగ నిక్కువంబుగా నాకలోను శూరులపాలిటికి
ప్రళయకాలంబ యాయెను. ఆయుద్ధ మెట్టిదో దీన నూహింప
వచ్చును. ఎట్లన దేవాసురయుద్ధములు సూచిన నాకవాదులు
సయితము దానిం గని యబ్బుర పోయినారు. ఇట్లు విజృంభిం
చిన యాఘోరరణంబున కాంచనదంష్ట్రుండు బెట్టిదం బయిన
గదతో చండసింహుని శిరంబున నడిచెను. ఆప్రేటునకు తన
సుతుండు చండసింహుండు పడిపోఁగా గని ధనవతి విద్యాబలం
బున ఇరుబలంబులను శపించి నిశ్చేతనంబులం గావించినది.
ఈవలన చక్రవర్తి నరవాహనదత్తుండును ఆవలన మందరదేవుం
డును మాత్రము సచేతనులుగా నిలిచిరి. అపుడు లోకసంహార
దక్ష నాధనవతిని కుపితం గాంచి వేల్పులు సయితము భయపడి
దిక్కుమొగము లైరి. అపుడు ఒంటిగానిని చక్రవర్తిని నరవా
హనదత్తుం గాంచి మందరదేవుండు కైదు వెత్తుకొని యాతని
మీఁదికిం బఱతెంచెను. నరవాహనదత్తుండును విమానము
డిగ్గి ఖడ్గరత్నంబు దూసికొని వేగంబున వాని నెదుర్కొని
యెను. మాయాబలంబున జయింప నెంచి మందరదేవుండు తన
విద్యాప్రభావంబున మదపుటేనుంగురూపు గైకొనెను. దానిం
గని నరవాహనదత్తుఁడు తన విద్యాతిశయంబు నెరపి ఘోర
రూప మయిన మహాసింహం బాయెను. తటాలున మందరదేవుఁ
డు ఏనుఁగురూపు మానఁగా నరవాహనదత్తుండు సింగంపురూప
మును విడిచెను. నిజరూపంబులనే ఇరువురకును పోరుఘోరం

బుగనేచెను. ఇరువురును నానావిచిత్రకరణులు అంగహారక్రియా యుతులు మండలాగ్రధరులునై నాట్య మాడుచున్న భంగిం జెలంగిరి అంతలో నరవాహనదత్తుఁడు కరణయుక్తిచే మందర దేవుని చేతికత్తిని సాక్షాజ్జయుంబునుం బోలె నొడిసి హరించెను. కత్తిం గోలుపోయి మందరదేవుఁడు సురియం గొని పైకొనఁగా జక్రవర్తి దానిని సయితము తటాలున హరించెను. అంతట కైదువు లేక బాహువులతోనే పోరుచున్న మందరదేవుని చక్ర వర్తి ఒడుపున మడమలం దన్ని నేలం గూల్చెను. చక్రవర్తి పగ తుని ఱొమ్మునం గాలుంచి, జుట్టుపట్టి తల నఱుక నుంకించునంత లో మందరదేవి యను పేరిట కన్య మందరదేవుని చెల్లెలు వచ్చి 'రాజా, నిన్ను తపోవనములోఁ గాంచి నాభర్తనుగా కల్పించు కొంటిని, కావున నాయన్నను నీబావమఱఁదిని చంపకుము. అని వేఁడి నివారించెను. ఇట్లాసుందరి పల్కఁగా ధీరుఁడు మహారాజు జితలజ్జితు నమ్మందరదేవుని వదలి యిట్లనియె:— 'నిన్ను నే వదలినాఁడను, విద్యాధరేశ్వరా, నీకు దీన లజ్జ వల వదు, బవరంబున శూరులకు జయపరాజయంబులు చపలంబులు గదా.' మందరదేవుఁ డిట్లుత్తరము పల్కెను:—'యుద్ధమున ఇంతిచే రక్షితుఁడ నైన నాజీవిత మేమి జీవితము! నేను అటవిలో నున్న నాతండ్రికడఁ కేఁగి తపస్సు చేసికొనియెద, నీవే యిట నుభయవేదర్ధచక్రవర్తివిగా నిర్మింపఁబడితివి. ఈవిష యమును నాకు మున్నే మాతండ్రి సూచించియుండెను.' ఇట్లు

పల్కి మానవంతుఁడు మందరదేవుఁడు తండ్రికడకు తపోవనమున కేఁగెను.

అపుడు మింటనుండి వేల్పులు 'బళి బళి! మహాచక్రవర్తీ శత్రువుల నెల్లర గెలిచితివి. సామ్రాజ్య మలవరించుకొంటివి' అని కొనియాడిరి. మందరదేవుఁడు పోఁగానే ధనవతి తనతనయునికి చండసింహునికి ఇరుసేనలకును వెండి చైతన్యం బొసంగినది. అంతట నిదుర మేల్కాంచినట్లు లేచి శత్రువు పరాజితుఁడాయె నని యొఱింగి యందఱును సచివప్రభృతులు నరవాహనదత్తు నభినందించిరి. కాంచనదంష్ట్రుఁడు అశోకకుఁడు రక్తాక్షుఁడు కాలజిహ్వుఁడును లోనుగాఁగల రాజులు మందరదేవుని పక్షమువారు నరవాహనదత్తునిశాసనము నందుకొనిరి. కాంచనదంష్ట్రుం గన్నంతనే మున్ను తా నాతనివలనం దిన్నగదవ్రేటు జ్ఞప్తియై చండసింహుఁడు కోపంబున కత్తిం బిడికిటం బట్టి ఱిలిపింపసాగెను. 'వత్సా, పోరయిపోయినది; పోర నిను గెలువఁగలవాఁ డెవఁడు కలఁడు? నే నపుడు ఉభయబలక్షయమును తప్పించుటకై యుక్తిచేసి మాయపన్నితిని.' అని పలికి ధనవతి తన కుమారుని కోపమును శాంతపఱిచి తనసిద్ధిచేత నరవాహనదత్తచక్రవర్తిసమేతముగా సకల బలమును సంతోషపెట్టెను. ఇవ్విధమున తనము త్రివర్గమున కపాయము లేక తనకు జితనతపలాయితవైరివీరం బగు సంగ్రామవ్యతికరంబువలన శర్వాచలోత్తరపార్శ్వరాజ్యము లభింపఁగా నరవాహనదత్తుఁడు పరమా

నందభరితుం డై విజయదుందుభులు మ్రోఁగుచుండ విద్యాధర
సుందరుల యాటపాటలు మించుచుండ ప్రియాసచివసంగతుండై
రాజేంద్రబృందసమన్వితుం డై వైరుల ప్రతాపంబుం బోలె
మధువుం ద్రావుచు నాదినము కడపెను.

## 2-వ తరంగము.

ఆమఱునాఁడు చక్రవర్తి నరవాహనదత్తుఁడు కైలాసం
పుఁజఱియనుండి రాణులతో తరలి, కాంచనదంష్ట్రుఁడు ముందు
నడచుచు దారి చూప, మందరదేవుని రాజధాని విమలపురము
నకుం బోయెను. పొడవైన బంగారు ప్రాకారంపుఁ జెంపునం జేసి
కైలాసంబును గౌరవింప వచ్చిన మేరువో యన నున్న యప్పు
రంబుం గని అతిగంభీరంబున నచ్యుత శ్రీరాజమానంబును అనం
తరత్ననిలయంబునై నిస్తోయసాగరంబు పగిది నున్న యద్దా
నం జొచ్చి యాస్థానంబున విద్యాధరరాజపరివృతుఁడై చక్ర
వర్తి కూర్చుండెను. అంత నాతనికడకు అంతిపురి ముదుసళ్లు
వచ్చి 'దేవా, మందరదేవుఁడు నీకు నోడి యడవి కేఁగుటం
జేసి యాతని దేవేరులు అగ్నిప్రవేశము సేయ నున్నారు. పని
పైన దొరకే యొఱుఁ.' అని విన్నవించిరి. అంతట చక్రవర్తి
ఆరాణివాసములను మరణమునుండి వారించి వారికి నివాసాదు
లొసంగి దేవేంద్రునుం బోలె కాపాడెను. అట్లు చేఁతచేత నాచక్ర

వర్తి మహావిద్యాధరాధీశవర్గము నెల్ల ప్రేముడిసంకెల వైచెను.
కృతజ్ఞుండై యమితగతికి మున్నే యుద్దేశించియున్న ప్రకారము
మందరదేవుని రాజ్యమునకు ప్రభువుఁగా పట్టాభిషేక మొనర్చెను.
తనయందు భక్తుఁడై జనవాఁటని మాయమితగతికి మందర
దేవునిపక్షపురాజుల నిచ్చివెసెను. ఏడుదినంబులు అచ్చట మహా
ర్ధిణామండితంబు లయిన యుద్యానంబులయందు క్రొత్తపెండ్లి
కూఁతురగు కైలాసోత్తరపార్శ్వలక్ష్మికవుంగిటం గడపెను.

ఇట్లు నరవాహనదత్తుఁడు ఉభయవేదార్ధ చక్రవర్తిత్వమును
బొందియు, తనివిం జెందక అధికేచ్ఛుఁడై మంత్రులు వల దని
వారించినను వినక ఆవిశ్చిన్నమన్న యలంఘనీయ మేరుభూము
లను దేవతాశ్రయంబులను జయింపఁ గోరి పోవ సమకట్టెను.
కడుంబెరిగినవారై వెలుంగుచు తేజస్విలు దావానలంబులు
వోలె విశేషముం బొందక యూరకుండరు. అంత నారదుండు
నరవాహనదత్తునికడకు కేతెంచి యాతని కిట్లు బోధించెను.—
'రాజా, నీతిజ్ఞునికి నీకేమి యుట్టియస్థానోద్యమము కలిగినది?
గర్వాతిరేకంబున నసాధ్యమందుం బ్రవర్తిల్లువాఁడు కైలాసముం
బెకలింపం గడంగిన దశాస్యునికైవడి పరాభవము నొందును.
మేరువు సూర్యచంద్రులకేని దాఁటరాదు గదా. నీకు శం
భుఁడు విద్యాధరేంద్రత నొసఁగెఁ గాని సురేంద్రత నొసంగలేదు
గదా. విద్యాధరులభూమి హిమవంతము, దానిని నీవు జయింపనే
జయించితివి దేవభూమి యగు మేరువునను నీ కేమిపని? కావున

ఈ చెడుపట్టుదల మానుము. మఱి మందరదేవునితండ్రి యకంపన నామధేయుఁడు అడవిలో తపంబు సేయుచున్నాఁడు గదా, పోయి యాతని దర్శింపుము. నీకు మే లగును.' నారదమహాముని యిట్లు పలుకఁగా నరవాహనదత్తుఁ డంగీకరించెను. అంత నాతని వీడ్కొని ముని నిజేచ్ఛం జనియెను.

## మందరదేవి.

చక్రవర్తియు కార్యజ్ఞుఁడై నారదునిచే నివారితుఁడై దేవమాయవలన విన్న ఋషభుని నాశమును స్మరించుకొని ఆ యుద్యమము వదలినవాఁడై రాజర్షిని అకంపనుం గనువాఁడై పద్మాసనోపవిష్టులై యోగనిష్ఠులైన బ్రహ్మర్షులచేఁ బరివృతమై బ్రహ్మలోకంబుం బురణించుచున్న యాతని తపోవనమునకుం జనియెను. అందు మహావృక్షంబుంబోలె వృద్ధుఁ డారాజును జటావల్కలధారి నకంపనుని మునిజనాశ్రితుని దర్శించి సమీపించి యనుగుల కెరఁగెను రాజర్షియు నాతని నాతిథ్యంబున సత్కరించి ఇట్లు వొడ్పరించెను.—' రాజా, నీ వీయాశ్రమంబునకు వచ్చుట మంచిపని, ఉల్లంఘించి పోయి యుండువేని నిన్నుమహర్షులు శపించియుందురు.' ఇట్లా రాజర్షి చక్రవర్తితోఁ బలుకుచున్న యవసరంబున నచటనే తపోవనంబున ముని వ్రత మవలంబించియున్న మందరదేవుఁడు చెల్లెలు మందారవతితోఁగూడ తండ్రికడకేతెంచెను. ఆతని నరవాహనదత్తుఁడు కంఠాలింగనంబు సేసి గౌరవించెను జితశాంతు లగు పగతుర

యందు ధీరులను నెయ్యమే శోభిల్లును. అట్లు అన్నతోఁగూడ వచ్చినమందరదేవిం గాంచి అకంపనరాజర్షి చక్రవర్తితో నిట్లనియెః—'రాజా ఈకన్య నాకొమారిత, పేరు మందరదేవి, చక్రవర్తికి దేవి యగు నని దివ్యవాణి చెప్పియున్నది కావున నిక్కుమారిని నీకు నే నిచ్చితిని, పెండ్లికమ్ము' రాజర్షి యిట్లు పలుకఁగా కూఁతు రిట్లు వాక్రుచ్చెనుః—"ఇట నా చెలులు వరకన్యకలు నలువురు కలరు, కాంచనదంష్ట్రునికొమారిత కనకవతి యొకతె, కాళజిహ్వునికూఁతురు కలావతి రెండవది, మూఁడవది దీర్ఘదంష్ట్రునికూఁతురు శ్రుత యనుపేరిది, నాలవది పోత్రరాజు నాత్మజ యంబరప్రభ, వీరు విద్యాధరేంద్రకన్యలు. వీరితో నే నేనవదానను. మే మేపురమును ద్రిమ్మరుచు మున్ను తపోవనంబున నార్యపుత్త్రు నీతనిం గని బాళిగొని ఒండొరులతో నిట్లు సమయము కావించితిమి. 'ఈ మనము మన మెల్ల నొక్కమ్మకినే భర్తం జేసికొనవలయును, మనలో నెవ్వతె యేని యీతని వేఱుగా వివాహ మగునేని దానిని గూర్చి కడమవారము తత్క్షణము ప్రాణత్యాగము చేయవలసినది.' అని. కావున ఆసఖులతోఁగాక వేఱుగా నాకు వివాహము యుక్తముగాదు. మము బోంట్లు సత్యము నెట్లుల్లంఘింతుము." ఇట్లా ప్రోఢ పలుకఁగా ఆమెతండ్రి యకంపనుఁడు ఆకన్యలతండ్రులగు విద్యాధరేంద్రుల నల్వురను రావించి వృత్తాంతము తెలిపెను. వారును ధన్యుల మైతి మని సంతసించి తత్క్షణంబ తమకూఁతుల నచటికి రావిం

చిరి. అంత సుందరదేవిం దొట్టి యాయేవురను విద్యాధరకన్యకలను క్రమంబుగా నరవాహనదత్తుఁడు వివాహమాడెను. వారితోఁగూడ పెక్కుదినము లచ్చటను విభవోత్తరంబుగా నుత్సవ మనుభవించుచు మూఁడుసంజలయందును ఋషుల దర్శించి మ్రొక్కుచుం గడపెను.

అంత నకంపనుఁ డాతనితో 'రాజా, మహాభిషేకము కొఱకు ఇపుడు ఋషభాద్రికి పొమ్ము' అని హెచ్చరింపఁగా దేవమాయుండను 'దేవా, నీవక్కడ చేయవలయును, ఋషభకాది పూర్వచక్రవర్తు లెల్ల నటనే యభిషేక మొందిరి.' అని విన్నవించెను ఆమాట విని సమీపంబుననున్న మందరాద్రి నే యభిషేకము మే లని హరిశిఖుఁడు పలుకఁగా, ఆకాశము నుండి యిట్లు వాక్కు వినంబడియెను:-'పూర్వచక్రవర్తు లెల్ల మహాభిషేకము ను ఋషభపర్వతమందే కావించికొనిరి, నీవును అందులకై యటకే పొమ్ము, ఏలన నది సిద్ధపదము సుమా!' దివ్యవాణి యిట్లు పలుకఁగా విని నరవాహన దత్తుఁడు అకంపనాదిమహర్షులకు నమస్కరించి మంచిదినంబున నటనుండి తరలి యమితగతిప్రముఖ నిఖిల విద్యాధరేశసమన్వితుఁడై యాత్రిశీర్షగుహా యుత్తరద్వారంబు చేరి, అట కాళరాత్రిని పూజించి యాద్వారంబునం జొచ్చి దక్షిణ ద్వారంబున వెలువడెను. అనంతరము సేనలతోఁగూడ దేవమాయుని వేఁడికోలు మన్నించి యాతనియింట నాఁడు విశ్రమించెను.

అటనుండి ఆకైలాసంబున సన్నిహితుని హరుని స్మరిం చినవాఁడై చర్మింపఁగోరి గోముఖుని దోడ్కొని వెడలెను. శంకరునియాశ్రమము చేరి కామధేనువును వృషభమునుం గాంచి నమస్కరించి ద్వారగతుని నందిని దటిసి ప్రదక్షిణము గావించెను. తుష్టుండై నంది దారి యీయఁగా ప్రవేశించి దేవీసహితుని వృషభధ్వజుని కాంచెను. గౌరినెమ్మోము కాంతికి నోడుటంబోలె నిటునటుం జెదరుచున్న చూడాచంద్రనికిరణో త్కరంబులచే దూరమునుండియే ఆహ్లాదం బొసంగుచు, స్వకా ర్యములందు దత్తస్వాతంత్ర్యములయ్యును లోలంబులయ్యు వశగతంబుల యైయున్న యక్షుంబుఃతో నక్షుంబులతోనుం బోలె ప్రియతో నర్థిం గ్రీడించుచున్న శంకరుం గాంచి నర వాహనదత్తుఁడు ఆనరదునికిని దేవికిని పాదప్రణామంబు లాచ రించి ముమ్మాఱు ప్రదక్షిణంబు గావించెను. 'నీ విచటికి వచ్చుట సరి, రావేని అపరాధి వగుదువు. ఇందున నీవిద్యలు ఎప్పటికిని భంగ మెఱుంగనివిగా నుండును. వత్సా! ఇపుడు నీవు సిద్ధ క్షేత్రమున కావృషభాచలమునకుం బొమ్ము, అచట సమయం బున మహాభిషేకముం బొందుము.' అని శంకరుఁడు ఆనతిచ్చెను. చక్రవర్తి వల్లె యని గౌరీశంకరులకు మ్రొక్కి యటనుండి దేవమాయుని యింటికి వచ్చెను. 'ఆర్యపుత్త్రా, ఎటకేఁగితివి? నీ మొగంబున సంతోష మగపడుచున్నది, ఇటఁగూడ నీకు మఱియేవురు కన్యలు దొరకినారా యేమి?' అని మదన

మంచుకాదేవి నర్మగర్భంబుగా నడుగ వాస్తవము తెల్పి సంతోషాంబుధిం దేల్చి సుఖముండెను.

### నరవాహనదత్తుని పట్టాభిషేకము

మఱునాఁడు చక్రవర్తి సర్వగంధర్వవిద్యాధరబలంబులతోఁ గూడుకొన్నవాఁడై తేజస్వియైన తనసలనను సూర్యుని వలనను ఆకాశంబును ద్విభాస్కరంబు నాఁబరఁగఁజేయుచు, అవరోధమంత్రిసమేతంబుగా విమానోత్తమంబెక్కి ఋషభాచలంబునకుం బయనంబు సాగించెను. అదివ్యభూధరంబుం జేరి తాపసులవలనంబోలె వాతధూతజటాలతంబులగు పాదపంబుల వలనం బుష్పార్ఘ్యంబులు పొందెను. అట నాదొర కాయాయి విద్యాధరాధిపతులు ప్రభావసదృశంబులగు మహాభిషేక సంభారంబులను సమకూర్చిరి. అయ్యభిషేకంబునకు నానాదిక్కులనుండు కానుకలు చేతఁబూనుకొని భక్తిభీతజితాదృతులైన విద్యాధరులెల్ల నరుదెంచిరి. ఆసమయంబున 'దేవా, నీతోఁగూడ పట్టపుదేవిగా నెవరి కభిషేకము సేయవలసినదో సెలవిమ్ము' అని చక్రవర్తిని విద్యాధరాధిపు లడిగిరి. 'నాతోఁ గూడ మదనమంచుక కభిషేకము సేయవలయును' అని నరవాహనదత్తుఁడు పలుకఁగా నావిద్యాధరులెల్ల నాలోచనపరులై మొగమొగంబులు చూచుకొన సాగిరి. అంత దివ్యవాణి యిట్లు పలికినది. 'ఓహో విద్యాధరులారా, ఈమదనమంచుక మానుషిగాదు. మీ ప్రభువు నరవాహనదత్తుఁడు కాముఁడు, ఈమె రతీదేవి,

యాతనిభార్య మదనమంచుకగా నవతరించినది. ఈమె కళింగసేన యందు మదనవేగునికి జనించినదిగాదు. ఈమె అయోనిసంభవ. కళింగసేన ప్రసవించినక్షణంబుననే దేవతలు మాయచేత ఆశిశువును పుచ్చుకొని ఆచోట నీమె నుంచినారు. కళింగసేనకడుపునం బుట్టినశిశువు ఇత్యకుఁడను వాఁడు బ్రహ్మచే మదనవేగునిపార్శ్వమం దుంపఁబడి యట నున్నాఁడు. కాన నీమదనమంచుక మగనియర్ధాసనమున కధికారిణి. పూర్వ మామెకు శంకరుఁడు ప్రీతుఁడై యట్లు వరమొసంగినాఁడు.' ఇట్లు పలికి దివ్యవాణి విరమించెను. విద్యాధరులును సంతోషించి దేవేరిని మదనమంచుకం గొనియాడిరి.

అనంతరము మంచిదినంబున పురోహితుఁడు శాంతిసోముఁడు ఏకచిత్తుఁడై యుండ, మంగళవాద్యఘోషంబులును విద్యాధరాంగనలగీతంబులును, బ్రాహ్మణులవేదఘోషంబులును దశదిక్కులం జెవుడుపఱుప, మహర్షులు నరవాహనదత్తుని సింహాసనంబునం గూర్చుండఁ జేసి యాతనితో నెడమప్రక్కను మదనమంచుకం గూర్చుండఁబెట్టి ఇరువురను నానాపుణ్యతీర్థములనుండి బంగారుగిండియలం దెచ్చినజలంబులతో నభిషేకించిరి. నరవాహనదత్తునియొడల నాజలంబులు పడుచుండ, చిత్రము, శత్రుపురుషులనంబుల గాఢముగా నంటుకొనియున్న వైరమలము కడిగివేయఁబడినది. అతనియభిషేకమునకై తెచ్చిన సముద్రజలముతోఁగూడ బంధుస్నేహంబున వచ్చినదో యన

లక్ష్మి యాజిలంబులోఁ గూడ నాతనియంగంబులనెల్ల సాపొత్తుగా నావరించెను. దేవాంగన లతనిపై వైచిన పూలచెండలపరంపర స్వయముగా పడుచు బహుస్రోత యగు గంగవోలె నాతని యొడల నొప్పాతెను అనంతర మాభాస్వతుండు ఎఱ్ఱని మైపూఁత ప్రతాపముతోఁ గైసేయంబడి ఉదయస్థుఁడై అంబుధిజలస్నాతుఁడై వెలుంగుచుండెను. మందారమాల్యంబులు చుట్టి మంచి వలువలును తొడవులుందాల్చి దివ్యకిరీటంబు పెట్టిన చక్రవర్తి సిరి శక్రశ్రీని విడంబించెను. అభిషేకం బొంది దేవిమదనమంచుకయు దివ్యాలంకారంబులు దాల్చి చక్రవర్తిపజ్జను వేల్పుతేని ప్రక్కను శచియుంబోలె తేజరిల్లెను. దుందుభిమేఘంబులు మొరయ నింగినుండి పుష్పవానలు గురియ, వేల్పుటింటి మెఱుంగులు తుఱంగలింప, చిత్రమాసుదినంబు దుర్దినం బాయెను! ఆకొండలమిన్న వీట విద్యాధరవరాంగనలుమాత్రము కాదు గాలి రేఁచిన తీవలుసయితము నృత్యములు సేసినవి. అమ్మహోత్సవంబున చారణులు మద్దెళలు వాయింపఁగా ప్రతిధ్వనిమంతంబులయినగుహాలను ఆకొండ వాయింపఁబోలును. దివ్యాసవంబులు సేవించి మత్తాగొని సోలువిద్యాధరగణంబు లానరింప నక్కొండయే పానమదంబున ఘూర్ణిల్లుచున్నట్లు తోఁచెను. ఆతని యభిషేకశోభకు ఇదియే వర్ణన, ఏమన విమానగుఁడయి యింద్రుఁడుసయితము దానింగాంచి తనయభిషేకశోభపై యభిమానము మానెను.

ఇవ్విధమ్మున తాఁ గోరినచక్రవర్త్యభిషేకముం బొంది నరవాహనదత్తుఁడు సంద్రిని సముత్సుకుండై తలంచుకొని గోముఖాదిమంత్రులతోఁ గలియఁబలికికొని వాయుపథుని బిలిచి యిట్లానతిచ్చెను:—"నరవాహనదత్తుఁడు నిన్ను కరముత్కంఠితుండై తలంచుకొనుచున్నాఁడు.' అని చెప్పి వృత్తాంతముం దెలిపి మానాయన నిటకుం దోడ్కొని రమ్ము. దేవేరులను, మంత్రులను, అట్లే చెప్పి తోడ్కొనిరమ్ము." ఆయాన శిరంబునం గొని వాయుపథుఁడు ఏడుకోటుల విద్యాధరుల వెంటఁగొని మింటిమార్గం బని నిమిసంబులో కౌశాంబి చేరెను. ఈరాకను భయాశ్చర్యంబులతోఁ పౌరులు కనుచుండ వాయుపథుండు వత్సరాజు నుదయనుని మంత్రిసమేతుని దేవీయుతునిఁ దగినట్లు ఆదరము నెరపుచు దర్శించెను. కూర్చుండి కుశల మడిగి విద్యాధరపతి యొల్లవారును తన్ను కుతుకంబునం జూచుచుండఁగా వత్సరాజుతో నిట్లు వక్కాణించెను:— 'రాజేంద్రా, నీతనయుఁడు నరవాహనదత్తుఁడు శంకరు నుపాసించి ప్రత్యక్షము చేసికొని ఆదేవునివరంబున నరదుర్జయంబుల సకలవిద్యలం బడసి దక్కినంబున మానసవేగ గౌరిముండులను పరిమార్చి ఉత్తరంబున వేగవర్ధపతిని మందరదేవు నోడించి ఉభయవేదర్థముల విద్యాధరరాజుల నెత్తిని తనశాసనము మోపి ఇరుసగములకును చక్రవర్తియై ఇపుడు ఋషభపర్వతంబున మహాభిషేకము పొంది యున్నాఁడు. మిక్కిలి కోరికతో నిన్ను దేవీసచివాదిసహితుని

తలంచుకొనుచున్నాఁడు. మిమ్ముఁ దేర నన్నుఁ బంపినాఁడు, మీరు త్వరగా రావలయును. పుణ్యవంతులు గదా వంశము నుద్ధరించు సంతానమును గందురు.' ఇట్లు వాయుపథుఁడు పలుకఁగా విని వత్సరాజు ఎంతయు నుత్కంఠితుఁడై మేఘధ్వనికి హర్షించుచున్న నెమలిదశ ననుభవించెను.

అతనిమాట నంగీకరించి అతనితో తత్క్షణమే వత్సరాజు కళింగసేనం దోడ్కొని భార్యాసచివసమన్వితుఁడై వాయుపథ విద్యాప్రభావకల్పితమై దివ్య మయినపల్లకి యెక్కి వ్యోమమార్గంబున దివ్యమయిన యాఋషభపర్వతమున కేఁగెను. అచ్చట వత్సరాజు దివ్యసింహాసనస్థితుని విద్యాధరేంద్రమధ్యస్థుని బహుభార్యాసమన్వితుని నిజ తనయుని పొడుపుగుబ్బలి నెత్తమ్మునం గూర్చుండి గ్రహమండలముచే పరివృతుఁడై బహుతారావళీ సంయుతుఁడైన నిండుచందురు విడంబించుచున్నవానిని కనులారం గాంచి యాతని చూపుటమృతంబునఁ దొప్పదోఁగి ప్రోల్లాసితావయవుఁడై అనిర్వచనీయ మైన యొక చంద్రోదయాంభోధిభంగిం బొందెను. అట్లు చిరకాలమునకు తండ్రిని గాంచి నరవాహనదత్తుఁడును లేచి కర మర్థి సంభ్రమంబు మీఱ మంత్రిప్రభృతిపరివారముతోఁ గూడ నెదు రేఁగెను. తండ్రి యాతనిం గవుంగిటం బొదివి తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని ఆనందపుఁ గన్నీళ్లతో వెండి యభిషేక మొనర్చెను. వాసవదత్తాదేవియు తనయుని పెద్దయుం బ్రొద్దు కవుంగిలించుకొని

తదీయశైశవస్మరణస్నుతం బయిన స్తన్యంబున నాతనిం దడి పెను. పద్మావతీదేవియు తండ్రిమంత్రులు యౌగంధరాయణాదులును మామ గోపాలకుండును తమ్ము యథార్థముగా సమ్మానించిన యాచక్రవర్తియొడలిని అమృతమయమును చకోరములు వెన్నెలంబోలె కడుఁదడవు కనుఁ ద్రావుచుండిరి. ఆ సమయంబున కళింగసేన అల్లుని నరవాహనదత్తుని కూఁతును మదనమంచుకను గాంచి ముల్లోకంబులను ఇముడ దారెను, తన యొడల నిముడనిమాట చెప్పవలయునా. యౌగంధరాయణాదులు ప్రభుప్రసాదప్రభావంబున దివ్యత్వ మొందిన నిజతనయుల మరుభూత్యాదులం గని యానందించిరి.దివ్యాభరణములు ధరించి మదనమంచుకాదేవి రత్నప్రభ అలంకారవతి లలితలోచన కర్పూరిక శక్తియశ భగీరథయశ రుచిరదేవుని చెల్లెలు దివ్యరూపయు వేగవత్యజినావతులు అక్లే గంధర్వదత్తయు ప్రభావతి ఆత్మనిక వాయువేగయశ అక్లే ఆమె సకియలు కాళికాదులు నలువురు సులోచనయు మందరదేవ్యాదులు వీవురను నరవాహనదత్తచక్రవర్తిదేవేరులు మామకు వత్సరాజునకును అత్తకు వాసవదత్తకును అత్తకు పద్మావతికిని అడుగుల కెరఁగిరి. వారును కోడండ్రను హర్షోత్కర్షమున యథార్థంబుగా నాశీర్వదించి వెంపెసఁగం జేసిరి. వత్సరాజును సాంతఃపురుని యథోచితాసనాసీనుం గావించి నరవాహనదత్తుఁడు తాను

మహాసనమునం గూర్చుండెను. వాసవదత్తాదేవి ఆయూయి క్రొత్తకోడండ్రం గాంచుచు వారి నారికేళనామము లడుగుచు మోదమున మునింగియుండెను. వత్సేశ్వరాదులు నరవాహన దత్తుని యాదివ్యవిభూతిం గాంచి తమ జన్మము కృతార్థమాయె నని తలంచిరి.

అంత నచటనే బంధుసంగమమహోత్సవము జరుగుచుం డంగా ధీరుఁడు ప్రతీహారుఁడగు రుచిదేవుఁడు వచ్చి 'ఆపాన భూమి సిద్ధమై యున్నది, అచటికి విజయము సేయవలయును.' అని నివేదించెను. అంత నందఱును మంగళమయిన యా యా పానభూమికిం జనిరి. వింతవింత రతనంపుఁ గోరలు పలువగల తామరలు గాఁగ పర్విన పుష్పమొత్తంబులు నెత్తావులు చల్ల నాయాపానభూమి ఉద్యానపుఁ దామరకొలని విడంబించుచుం డెను. అందు సుర నిండిన గిండిములతోడి చెలువలు సుధం గ్రోలియున్న రాహువుతోడి మోహినీదేవతలో యన నొప్పు చుండిరి. అందు అంతిపురి చెల్వలనాన సలకెలం బగుల్పుదాని మరుని ప్రాణంపుఁ బ్రాణమును విలాసములకుం త్రిని మద్యమును వా రాస్వాదించిరి. మధువుచేత వికాస మొంది యెఱ్ఱఁబాఱిన వారి ముఖములు లేయెండకుఁ గెంపెక్కిన కొలఁకుల నెత్తా మరలవలె శోభిల్లినవి. దేవేరుల కెమ్మోవికినోడి దాని కూటమికి వెఱచినవియుంబోలె తామర కెంపుఁగోరలు తమ కాంతిని శీధు వున దాఁచివేసినవి. నరవాహనదత్తుని దేవేరులు అపుడు కోప

సమయమును గాకున్నను మదవశంబున బోగువిలుపులును ఎల్లె
చూపులును వహించిరి. అనంతర మందఱును భోజనభూమి
కరిగిరి. భోజనభూమి విద్యావిభవసంపన్న వివిధాహారహారి
ణియు ఆస్తీర్ణవస్త్రము పాత్రాఢ్యయు తిరస్కరిణీపటసనాథయు
నానావిధాస్వాద్యరసయు నై విరుల నాట్యశాలయుంబోలె విరా
జిల్లుచుండెను. అందఱు నచట నారగించి సంధ్యా దేవితోఁ
గూడ సూర్యుఁడు క్రుంకుమెట్టలో విశ్రాము నందఁగా తామును
శయనగృహంబుల విశ్రమించిరి. నరవాహనదత్తుఁడు విద్యా
ప్రభావంబున పెక్కు మేనులు చేసికొని విభజించుకొని ఎల్ల
దేవేరుల యిండ్లను తా నుండెను. ఇందువదనయు సమదనయు
లోలతారకయు నై నిశంబోలిన మదనమంచుకతో మాత్రము
తన సత్యదేహంబుతోనే క్రీడించుచుండెను. వత్సేశ్వరుండును
అనుచరులతోఁగూడ నారాత్రిని బొందితోనే జన్మాంతర మొం
దినవాఁడుంబోలె దివ్యభోగంబులం గడపెను. తెల్లవాఱఁగానే
మేలుకాంచి అందఱును వెండియు నట్లే విద్యాప్రభావ సంప
న్నంబు లయిన మందిరోద్యానాదికంబుల భోగంబు లనుభవిం
చుచు క్రీడించుచుండిరి.

ఇట్లు నానావిహారంబుల వారి కచ్చట బహుదినములు
గడచినయంతట వత్సరాజు తనపురమునకుం బోవఁ దలఁచిన
వాఁడై నిఖిలవిద్యాధరేశ్వరుని నమ్ముని తనయునిం గాంచి
యిట్లనియె:—'పుత్త్రా, చేతనావంతుఁ డెవఁడు ఈదివ్యభోగ

ములఁ గోరఁడు ! అయినను, జన్మభూమినివాసాభిలాష మను
ష్యులను లాగును. కావున మేము మాపురికిం జనియెదము.
నీవు ఈవిద్యాధరైశ్వర్యము ననుభవించుచు నుండుము. నీవు
దివ్యమానుషుఁడవు గాన ఈభోగములు నీకుఁ దగినవి. మరల
నవసరంబున, పుత్త్రా, మముం బిలువవలసినది. లోచనపేయ
సుధారసమయమును కాంతమును నీజాబిల్లిమోమును కను
లారఁ గాంచుటయు, నీదివ్యలక్ష్మిని కని ఆనందించుటయు—
ఇదియే గదా మాకు ఈజన్మమునందు ఫలము.' తండ్రి యిట్లు
మనఃపూర్వకముగాఁ బల్కిన యీమాటను విని నరవాహన
దత్త చక్రవర్తి వెంటనే విద్యాధరాధిపతిని దేవమాయుం
బిలిపించి కన్నీటియడ్డంకిచే నెలుంగు డొత్త్రిలుచుండ నిట్లాన
తిచ్చెను. 'మానాయన మా యమ్మగార్లతోఁ గూడ తన
మంత్రులతోఁగూడను తన రాజధానికి పయన మగుచున్నాఁడు,
ముందుగా నీవు వేయిమంది వెట్టి విద్యాధరులచే పైఁడియు
రతనంబులును వేయిబారువలు నడపింపుము.' ఇట్లు ప్రభువు
ప్రీతిపూర్వకంబుగా నానతీయఁగా దేవమాయుఁడు వినమ్రుఁడై
'మానప్రదుఁడా, కౌశాంబివఱకు ఆపనినెరవేర్ప సానుచరుఁడ
నై నేనేపోయెద, అట్లు అనుగ్రహింపవలయును.' అని వేఁడెను.
చక్రవర్తి సంతసించి తండ్రిని వస్త్రాలంకారంబుల సత్కరించి
వాయుపథ దేవమాయులను సపరివారులను తోడు పంపెను.
వత్సరాజు సపరివారంబుగా దివ్యవిమాన మెక్కి దూరాను

గతుని పుత్త్రుని వెనుకకు మరలించి నిజనగరికిం జనియెను. వాసవదత్తాదేవియు ఆనుపమున నూఱింత ఉత్కంఠితురాలై ప్రణతుని తనయుని మరలించి ఏడ్చుచు కనుచు ఎట్లో వీడ్కొని యెను. నరవాహనదత్తుఁడు సచివసమేతుఁడై తలిదండ్రుల సాగ నంపి కన్నీటియుబ్బులు నెమ్మోమున చీఁకటులు గొలుపుచుండ ఋషభకపర్వతమునకు మరలివచ్చెను. అట చక్రవర్తి గోముఖాది బాలసచివులతోను విద్యాధరరాజులతోను సాంతఃపురుఁడై మదనమంచుకాసమేతుండై ఆయాదివ్యభోగంబులం దనివి తీరక యుండెను.

మహాభిషేకలంబకము సమాప్తము.



# సురతమంజరీలంబకము.

## ౧-వ తరంగము.

ఆ. తాండవంబునందు దట్టంబుగా రేఁగుఁ
జెందిరంబు వేని చెక్కునుండి
త్రాగి గ్రక్కునంత రాయ ప్రతాపంబు
కరణి, వాతఁ డేలు గణవిభుండు.

అట్లు ఋషభపర్వతమునలో నరవాహనదత్తుఁడు భార్యలతోను సచివులతోను ఉత్కృష్టమైన విద్యాధరాధీశచక్రవర్తి సిరిని అనుభవించుచుండఁగా నాతనిభోగములకు పెంపుఁబొనరింప వసంతము ఏతెంచెను. తడవునకు చంద్రునివెన్నెల తేరెను, క్రొత్తపచ్చిక కవుఁగిలింతచే భూమి క్రొంజెమరొందెను, వనశ్రేణులు దక్షిణగంధవహునిచే మాటిమాటికిఁ గౌఁగిటఁబొదువంబడినవై కంపాకులలు పులకితలు సరసలు నైనవి. మదనుని ప్రతీహారుఁడు కోకిల మావికొమ్మ గాంచుచు మానవతీమాననిషేధనంబో యన నులియుచుండెను. పూఁదీగలనుండి తేఁటిబారులు మోహితతో మానసటీఁడు మారుఁడు వింటినుండి యేసిన నారసముల బారులో యన నెగయుదెంచుచుండెను.

ఇత్తెఱంగున పుష్పప్రకార విజృంభణ మగుచుండం బరికించి గోముఖాది
మంత్రులు నరవాహనదత్తునితో విన్నవించిరి:—'దేవా విలో
కింపుము, ఈఋషభాద్రి సానువునందున దట్టంబుగా విరిసిన
కాననశ్రేణిచే పుష్పమయమై ముచ్చటపొందఁ గాక ఏదో
వేఱయినది చూడుము. ఈతీవల వింతపురుము, పుష్పాదులచే
వలిపము దాల్చినవై, వసంతునకుం గూర్చిన ముదనోలగంబున
ఒండొంటిం జాఁకెడుపువ్వులచే కంచుతాళంబులు వాయించుచు
న్నవి, తేఁటివెలందుకలయికచే పాటలు పాడుచున్నవి, గాలిచే
ఆడుచున్నవి. తేఁటిపాటకుల్లైవ్రేలఁ ఈమామిడిపూరెమ్మగాయఁడు
ముల్లోకములను గెలిచి విశ్రమించుచు ఎక్కుడించి యుంచిన
విల్లుఁదీఁగ కాదోటు? కావున, దొరా, ఈమనోహరోద్యాన
మున మందాకినితీరిని వసంతోత్సవ మాచరింతము రమ్ము.'

ఇట్లు మంత్రులు హెచ్చరింపఁగా అంతఃపురవధూజన
సహాయుఁడై నరవాహనదత్తుఁడు ఆమందాకినీతటమున కరు
దెంచెను. ఏలాలవంగపతుళాశోకమందారమండితంబై లెక్క
లేని పులుఁగుఁదుటుములయులివులచే ఘూర్ణిల్లుచున్న యా
యుద్యానమందు నరవాహనదత్తుఁడు విహరించెను. ఒకచో
విశాలమయిన చంద్రకాంతశిలాతలంబునం గూర్చుండి మదన
మంచుకాదేవి నెడమప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొని కడమ
యంతిపురికొమ్మలను కూడఁబెట్టుకొని చండసింహ ప్రముఖ
విద్యాధరేశ్వరులసంగడిని పానగోష్ఠి ననుభవించుచు నానా

సరసప్రస్తావంబులు గావించుచు ఆఋతువిభవంబుం గాంచి చక్రవర్తి మంత్రులతో నిట్లనియె:—'దక్షిణవాయువు దేహమునకు సుఖముగా వీచుచున్నది, దిక్కులు తెలివిపొందినవి, ఎటుఁ జూచినను తోఁటలు పూచి పరిమళించుచున్నవి, కోయిలలు తీయఁగాఁ బలుకుచున్నవి, పానగోష్ఠి సుఖ మొసంగుచున్నది. వసంతర్తువునందు ప్రియము గాని దేమున్నది? భరింపరానిది ప్రియజన విరహ మొక్కండు దక్క. కట్టా, ఇతరులమాట చెప్పవలయునా, తిర్యగ్జంతువులకు సయితము విరహము కష్టము. ఇదె చూడుఁడు; ఈకోయిల ప్రియునిఁ బాసి పెద్దతడవు వెదకుచు పిలుచుచుండి కానక మృతయుఁబోలె మావిలో సద్దులేక అణఁగిపడి యున్నది.'

చక్రవర్తి యట్లు పలుకఁగా గోముఖమంత్రి యిట్లు వచించెను:—సత్యము దేవా, సత్యము. ఈకాలమున ఎల్లప్రాణులకును విరహము దుస్సహము. ఇందులకుం బ్రమాణముగా శ్రావస్తిలో ఏమి జరిగినదో చెప్పెదను వినుము.—శ్రావస్తిలో శూరసేనుఁ డని యొకరాకొమరుఁడు ఒకగ్రామము జీతముగా రాజును కొలుచుచుండెను. ఆతనికి ప్రాణాధిక ప్రియ సుషేణ యనునది మాళవదేశపుయువతి తగినభార్య యయ్యెను. ఒకప్పు డతఁడు రాజాజ్ఞచే రాజధానికి పోవుచుండఁగా అనురాగవతి భార్య యిట్లు వచించెను. 'ఆర్యపుత్త్రా, నన్నొంటి విడనాడి నీవు పోఁగూడదు. నీవు లేక నేను క్షణమేనియు నిట

నుండఁజాలను.' ప్రియ యిట్లు నిర్బంధింపఁగా శూరసేనుఁ డిట్లని యె:—'ప్రాణేశ్వరీ, రాజు పిలిపించిన నే నెట్లు పోకుండ నేర్తు! నీ వేమి యెఱుఁగవా? రాకొమరుఁడను పరాధీనజీవితుఁడను కొలువుడుగాఁడను.' ఆమాట కా మెకన్నుల నీరు నించి వెండియు నిట్లనియె:—'నీవు పోక తప్పదేని, వసంతర్తువులో ఒకదినమేని దాఁటక వచ్చెదవేని ఇపు డెట్లో ఓర్చెదను.' అంత 'ప్రాణ ప్రియా, చివర కిట్లు నిశ్చయించుకొంటిని, పనిమానియైనను చైత్రమున తొలినాఁడే వచ్చెదను.' అని పలికి యెట్టకేలకు ప్రియను సమాధానపఱచి శూరసేనుఁడు రాజుకడకుఁబోయెను. భార్యయు ఆశచే దినములు లెక్కించుచు అతనిరాకకు గడువ యిన వసంత ప్రథమదినము నెదురుసూచుచుండెను. ఇట్లు దినములు గడవఁగా వసంతోత్సవదినము సంప్రాప్తమాయెను. మదనాహ్వానమంత్రమువోలె కోకిలమాఁత వినఁబడెను. పూవుల నెత్తావికి మత్తిల్లిన తేఁటికూటువలరఝంకారంబులు మారుఁ డాస్ఫాలించు వింటిటంకారంబులువోలె వినవాయెను. 'ఇదె వసంతోత్సవము వచ్చినది, నిక్కముగా ప్రాణేశ్వరుఁడు నేఁ డేఁగుదెంచును.' అని నాఁడు శూరసేనునికాంతామణి సుషేణ జలకమాడి మరునిఁ గొలిచి కై సేసికొని ప్రియునిదారి నెదురుసూచుచుండెను. పగ లెల్ల దయితుఁడు రాఁడాయెను. అంత నామె రేయి ఆస యుడిగి బెగ్గిలి యిట్లు తలపోసెను. 'మృత్యుకాల మిది వచ్చినది, నా కాంతుఁడు రాఁడాయెను, పరసేవనే తగులుకొన్న వారికి

తనవారిపై నెయ్య మెక్కడిది?' చెలువుపై మది నిలిపి యిట్లు చింతించుచుండ నామె ప్రాణములు మదనదావానలదందహ్యమానంబులువోలె మేనునుండి వెడలిపోయినవి. అంతలో నెట్టులో రాజువలన సెలవునందుకొని శూరసేనుఁడు నెచ్చెలికై యువ్విళ్లూరుచు దినము పాటుక మంచియొంటె నెక్కి దూరమెల్ల త్వరగఁ గడచి రేతిరిజామున వచ్చి యిలుసేరెను. ఇంట గతప్రాణయై కైసేతలు పెక్కు చెదరక గాలికి వెల్లగిల్లిన పూఁదీఁగవలె పడియున్న ప్రాణకాంతం గాంచెను. కన్నమాత్రాన బెగ్గడిల్లి ఆమె పాతఁ డొడి నిమురుకొనునంత పలవరింతలతోఁ జూడ . ఆవియోగాతురుని ప్రాణములును తరలిపోయినవి. అట్లు విపన్నులయిన యాదంపతులం గాంచి కనికరించి కులదేవత వరద చండి బ్రదికించినది. అట్లు మరల ప్రాణ మొందినవారై యాదంపతులు అప్పటినుండి ఒకరిప్రేమ నొకరెఱిఁగి ఒండొరులం బాయక సుఖముండిరి. ఈప్రకారముగా వసంతసమయమందు దక్షిణానిలపీడితం బగు విరహపావకము ఏప్రాణికి దుస్సహము కాదు!

ఇట్లు గోముఖుఁడు చెప్పిన విషయంబును భావించుచున్న నరవాహనదత్తునికి తిన్నట్లుండి మనంబేమియు నల్లగాక పోయెను. మహాత్ములకుఁ గారణము లేకయే సుస్థితంబును దుఃస్థితంబునునై యంతరాత్మయే రాఁగలశుభాశుభములను సూచించును. ఆపవలు ముగియఁగా చక్రవర్తి సంజను గొలిచి

సహకటింట సెజ్జం బవళించెను నాతండ్రిని ఎవ్వతెయో నల్లని వేఁది దక్షిణంపుదిక్కునకు ఈడ్చుకొనిపోవుచున్నట్లు రే తుఁజని కలఁగని, మేలుకాంచి తండ్రి కేమో కీడు కలిగెనని భయ మందినవాఁడై ప్రజ్ఞప్తివిద్యను దలంచెను. తలంపునకే విద్య సవిగ్రహారై తోఁతెంచెను. 'మా యానవత్సరాజు వృత్తాంత ము చెప్పుము, ఆయన సంగూర్తి చెడుకలం గని కంకావ్యాకులుఁడ నై యున్నాఁడను.' అని నా జడిగెను.

విద్య పల్కినది:— నీతండ్రి వత్సరాజు వృత్తాంతము వినుము. ఒకనాఁడు ఉజ్జయినినుండి కౌశాంబికి నీతండ్రికడకు దూత వచ్చి చండమహాసేనుఁడు స్వర్గస్థుఁ డాయె ననియు ఆతని దేవేరి అంగారవతి సహగమనము చేసిన దనియు తెలిపెను. ఆమాట విని నీతండ్రి మూర్ఛిలి నేలఁబడియెను. తడవునకు తెలివి వచ్చి తానును వాసవదత్తయు పరిజనులును స్వర్గతు లను అత్తమామలను వనవుచుండెను. అంతట మంత్రులు 'మహారాజా, భంగురం బగునీసంసారమున నిలుకడ యెక్కడిది? నీవంటియల్లుఁడును, గోపాలునివంటికుమారుఁడును, నరవా హనదత్తునివంటిదౌహిత్రుఁడును గలిగినమహాత్మునికై వగ వేల!' అని బోధించి లేపఁగా మీరావామున అత్తమామలకు జలాం జలి యిడెను. అనంతరము మీతండ్రి స్నేహావశంబున తన ప్రక్క నున్నబావమఱఁదిని గోపాలునిఁ గాంచి బాష్పరుద్ధ కంఠుఁ డై 'లేలెమ్ము' ఉజ్జయినికిం బొమ్ము, పైతృకం బగు

నీరాజ్యము నేలుకొమ్ము, ప్రజలు నిన్నెదురుసూచుచున్నా రనియు దూత చెప్పినాఁడు.' అని మందలించెను. అంతట నేడ్చుచు గోపాలకుఁడు వత్సరాజుతో నిట్లనియెః—'దేవా, నిన్నును చెల్లెలిని వాసవదత్తను విడిచి నేఁ బోఁజాలను. నాయనలేని యానగరిని నేను చూడనేని యొల్లను. కావున నాయనుమతిని నాతమ్ముఁడు పాలకుఁ డచట రా జగుఁగాక.' ఇట్లు పలికి గోపాలకుఁడు ఎంత చెప్పినను వినకయుండగా వత్స రాజు సేనాపతిని రుమణ్వంతుని ఉజ్జయినికిం బంపి చిన్నబావ మఱఁదికి పాలకునికి అన్న యనుమతిని పట్టము గట్టించెను. సకలము నస్థిర మని తలపోసి విషయములందు విరక్తి నొంది మాతండ్రి యౌగంధరాయణాది మంత్రిపుంగవులతో నిట్లనియెః 'అసార మగుసీసంసారమందు భావములెల్ల తుదిని విరసతగొలుపునవి. మేమును రాజ్య మేలితిమి, భోగము లనుభవించితిమి, పగతుర నోర్చితిమి, విద్యాధరాధిపత్యప్రాప్తుని పుత్త్రునిం గంటిమి, ఇపుడు బంధువులతోఁగూడ మావయస్సు అతీతమయి నది, మృత్యువుననర్పించునదై ముదిమి మమ్ము జుట్టుపట్టుకొన్నది. పందరాజ్యమువోలె మాశరీరము బలులచే నాక్రాంత మైనది. కావున కాలంజరగిరి కేఁగి యీయస్థిరదేహమును త్యజించి యథోక్తశాశ్వతపదమును సాధించెదము.' రా జిట్లు వచింపఁగా మంత్రులందఱును వాసవదత్తాదేవియు ఆలోచించుకొని ఆయ నతో నేకాభిప్రాయులై యి ట్లనిరి. 'దేవా, తమచిత్తము సరి.

తమయనుగ్రహముచేత మేమును కూడ వచ్చి పరమందు నుత్త మగతిం బొందెదము.' ఇట్లు తనకుం దుల్యులై వారు వలు కంగా రాజు నిశ్చయము చేసికొని భావమునందిని సమర్థుని గోపాలకునిం గని యిట్లానతిచ్చెను. 'నరవాహనదత్తుండును నీవును ఇరువురును నాకు సమానులు, ఇరువురు సుతులు, కాన ఈకౌశాంబీరాజ్యమును నీకు నే నొసంగితిని, దీని నీ వేలుము.' అందులకు గోపాలకుం డిట్టు లనియె:— 'మీ రేగతియో, నాకును ఆగతియే, నేను మిమ్ము విడిచియుండ నొల్లను.' చెల్లెలి మీందిప్రేమతో ఆతండు ఇదే మాటగా నుండంగా వత్సరాజు మిథ్యాకోప మభినయించి యిట్లనియె :— 'నీవు నన్ను అను సరించుట పొల్లు, ఇపుడే చెప్పినమాట వినవైతివి! పదవి రొండ లు నెవనియాజ్ఞ నెవండు మన్నించును!' ఇట్లు రాజు కటువుగాం బల్క గోపాలుండు తలవాంచి బిట్టు శోకించుచు మనస్సులో వనంబున కేంగ కృతనిశ్చయుండై అప్పటికి వారి ననుగమింపక నిలిచెను. అంతట రాజు వాసవదత్తాపద్మావతులతోంగూడ ఏనుంగు నెక్కి మంత్రులతోంగూడ పయనం బాయెను. ఆయన కౌశాంబిని వదలంగానే పురజనులు ఆండ్రను బిడ్డలను వృద్ధుల నుం దోడ్కొని యేడ్చుచు కన్నీటిజడులచే నద్దినంబు దుర్దినంబు నేయుచు, వెంటందరలిరి. 'గోపాలకుండు మీకు రక్షకుండు' అని చెప్పి యెట్లో వారిని మరలించి వత్సరాజు కాలంజరగిరి చేరెను. అనంతరము మీనాయన కొండ యెక్కి ముక్కంటికి

మ్రొక్కి ఎల్లకాలమునందును వల్లభ యగు వీణను ఘోషవతిని చేబట్టినవాఁడై, దేవులు ఇరువురును తనయిరుప్రక్కల నుండ, యౌగంధరాయణాదిమహామంత్రులతోఁ గూడ కొండచఱియ నుండి దుమికెను. పడుచుండఁగానే దేదీప్యమాన మయిన విమానము రాఁగా దారపరిజనసహితంబుగా దాని నెక్కి వెలుఁగుచు స్వర్గమున కరిగెను.

విద్య యిట్లు పలుకఁగా విని నరవాహనదత్తుఁడు 'హా నాయనా!' అని మొరసి సొమ్మసిల్లి నేలం బడియెను. తెలివి వచ్చి ప్రమీతజనకులగు నిజామాత్యులుం దానును తల్లిని తండ్రిని తండ్రిమంత్రులను వగచుచుండెను. విద్యాధరాధీశులును ధనవతియు 'మహారాజ, ఇంద్రజాలమువంటిదై క్షణభంగురంబగు నీసంసారము స్వరూపమును ఎఱిఁగియు నీ వేల యిట్లు మోహమునం బడెదవు? శోకింపఁ బనిలేనివారికి, ఎవరికి విద్యాధరేంద్రైకచక్రవర్తివి నీవు కుమారుఁడవుగా జనించితివో, అట్టి ధన్యులకు తలిదండ్రులకు శోకింపఁదగవేమి?' అని యూఱార్పఁగా తెప్పిరిల్లి చక్రవర్తి తలిదండ్రులకు జలాంజలి యొసంగి, మరల విద్యను, 'మామామ గోపాలుఁ డెక్కడ నున్నాఁడు? ఏమి చేసినాఁడు?' అని యడిగెను.

విద్య యిట్లనియె:— 'వత్సరాజు మహాపథయాత్ర పోవుడు గోపాలకుఁడు ఆతనికి వగచి చెల్లెలిం బనిచి, సర్వము అస్థిరమని యెంచి, తా నూరిబయటన యుండి, ఉజ్జయినినుండి

తమ్ముని పాలకుని రావించి కౌశాంబీరాజ్యము కూడ నతనికే యిచ్చి రెండురాజ్యములందు నతనిం బ్రతిష్ఠించి, వైరాగ్యంబు నంజేసి తాను తపంబునకై అసితగిరిలో కశ్యపాశ్రమమునకుం బోయెను. అట నిప్పుడు, దేవా, నీమామ గోపాలకుఁడు నార చీరలు దాల్చి మునిమధ్యగతుఁడై తపంబొనర్చుచున్నాఁడు.'

ఇట్లు విద్య చెప్పఁగా విని నరవాహనదత్తుఁడు వెంటనే మామం గన నుత్కంఠితుఁడై సపరివారంబుగ విమాన మెక్కి అయ్యసితగిరి కరిగెను. అట విమానము డిగ్గి విద్యాధరేశ్వరపరి వృతుఁడై కశ్యపమునియాశ్రమముం గాంచెను. కృష్ణసార మృగములసంచారంబులు తమ్ముఁ జూచుచూపులఁ బోల, పక్షుల యులివులు తమ్ముఁగూర్చి పలుకుస్వాగతంబువోల, నయ్యా శ్రమంబు తమకు అతిథిసత్కారము సేయుచదివోలె నెసలారెను. అందుండి హోమధూమము మింటి కెగయుచు వేలిమిసల్పు తాపసులకు స్వర్గ మెక్క దారిసూపుచున్నదోయనునట్లుండెను. మఱియు నయ్యాశ్రమము బహుంభూధరనాగేంద్రంబును కపిలో త్కరసేవితంబును వితామసంబు నై యూర్ధ్వస్థమయిన యపూ ర్వపాతాళంబో యన నొప్పియుండెను. దాని నడుమ జడలు గలిగి చెట్లనారఁ దాల్చి మునిజనపరివృతుఁడై యున్న మామను మూర్తిభవించిన ప్రశమంబునుంబోలె చక్రవర్తి పొడగాంచెను. మామ గోపాలకుండును తనుఁ గాన వచ్చిన మేనల్లుని లేచి కవుం గిలించికొని కన్నీళ్లు తనకన్నుల ముంప నొడిలోఁ గూర్చుండఁబెట్టు

కొనెను. అంత నయ్యిద్దరుపురుసు క్రొత్తపడినదుఃఖమున బంధువులకై వగచిరి. బంధుదర్శనసమీరసంజీవితం బయిన దుఃఖాగ్ని ఎవరి నేర్పదు? వారిదుఃఖముం గాంచి తిర్యగ్జంతువులు సయితము దుఃఖార్తంబులు కాఁగా నంత కశ్యపాదిమునులు అరుదెంచి వారి నిరువురను ఓదార్చిరి. ఆదిన మటు గడపి నరవాహనదత్తచక్రవర్తి మఱునాఁడు మామను తనతోఁగూడ తనయైశ్వర్య మను భవింప రమ్మని పిలిచెను. గోపాలకుఁ డిట్లనియెః—'నాకు నీదర్శనము చాలదా, ఇంకేమి వలయును? నాయందు నీ కను రాగ మేని ఈవచ్చినవర్షాకాలము నాయీయాశ్రమమందు ఉండుము.' మామ యిట్లు కోరఁగా నరవాహనదత్తుఁడు పరివార సహితుఁడై అయ్యసితగిరిలో కశ్యపాశ్రమంబున నుండెను.

---

## ౨-వ తరంగము.

### ఇత్యకుఁడు సురతమంజరిని హరించుట.

అసితగిరియందు నరవాహనదత్తుఁ డొకనాఁడు కొలువై యుండఁగా సేనాపతి హరిశిఖుఁడు వచ్చి విన్నవించెను.— దేవా, ఈరాత్రి నేను సేనలం బరికించుచు మేడలో నుంటిని. దివ్యుఁ డెవఁడో బలాత్కారంబున నొకయింతిని హరించి యెత్తుకొని ఆకాశంబున బాఱుతెంచుచుండెను. ఆమె 'అయ్యో! ఆర్యపుత్ర!' అని యేడ్చుచుండెను. ఆతఁ డామెను హరించుట

చంద్రుఁడు తన కాంతినెల్ల హరించిన దని సమయము వేచి యిపుడు తాత్కాలికబలమహిమంబున హరించికొని పోవుచు న్నాఁడో యనున ట్లుండెను. ‘ఎవఁడవురా నీవు పాపాత్ముఁడా, నరవాహనదత్తుఁడు రక్షకుఁడైన యీ రాజ్యమందు పరదారను హరించి యెట కేఁగెదవు? అఱువదివేలయోజనముల యీ విద్యాధరభూమియందు తిర్యగ్జంతువులుకూడ నధర్మ మాచ రింపవు, ఒరులమాట చెప్పవలయునా!’ అని బెదరించుచు వెంటఁ దఱిమి పట్టి పరికించునంత నాతఁడు నీమహాదేవితమ్ముఁడు, నీబావమఱఁది ఇత్యకాఖ్యనభశ్చరుఁడు, కళింగసేనాదేవియందు మదనవేగునికిం గలిగినవాఁడు. ‘ఈమె యెవతె? ఏల ఈమెను హరించెదవు?’ అని నే మడుగఁగా ‘ఈయువిద మతంగదేవుఁ డను విద్యాధరపతికూఁతురు, అశోకమంజరియందుఁ బుట్టినది, పేరు సురతమంజరి. ఈచెలువను మున్నుగా తల్లి నాకు వాగ్దా నంబు సేసియుండఁగా తండ్రి యిపుడు ఒరునికి మానుషునికి ఇచ్చినాఁడు. కావున ఇట్లు నాభార్యను నేను కొనిపోవుచున్నాఁ డనయేని నాయం దేమి దోషము?’ అని యిత్యకుఁడు వచించి నాఁడు. ‘ఆర్యా, ని న్నెవఁడు పెండ్లియైనాఁడు? ఇతని కెట్లు దొరకితివి?’ అని యామెను నే మడుగఁగా ‘ఉజ్జయినిలో శ్రీమం తుఁడు పాలకమహారాజు కలఁడు, అవంతివర్ధనుఁ డని యాయ నకు సుగృహీతనామధేయుఁడు కుమారుఁడు కలఁడు, ఆయన నన్ను వివాహ మైనాఁడు, ఆయనతోఁగూడ నేను మేడమీఁద

శయనించి ఆయన నిద్రితుఁడై నేనును నిద్రితనై యుండఁగా ఈపాపాత్ముఁడు నన్ను హారించి తెచ్చినాఁడు.' అని సురతమంజరి యుత్తర మిచ్చినది. ఆతనిని నేను కట్టియున్నాఁడ, ఇరువురను సావధాంబునం గాచియున్నాఁడ. విని యిపుడు మహాప్రభువు ప్రమాణము.—

ఈప్రకారము సేనాపతి హరిశిఖుఁడు చెప్పఁగా చక్రవర్తి సంశయము చెంది గోపాలకుకడకుం జని యీవృత్తాంతము నివేదించెను. గోపాలకుండును 'వత్సా, ఈవృత్తాంతము నే నెఱింగినది కాదు. ఈమెను పాలకసుతుఁడు ఇటీవల పరిణయమై యుండవలయును. ఉజ్జయినీనుండి కుమారుని భరతరోహక మంత్రితోఁగూడ రావింపుము, నిక్కువం బెఱుంగుదము.' అని వచించెను మామ చెప్పినమాటబడి నంతట నరవాహన దత్తుఁడు ధూమశిఖవిద్యాధరుం బిలిచి చినమామ పాలకుని కడకుం బంపి యాతనికొమరుని ఆమంత్రిని రప్పించెను. వచ్చి నమస్కరించినయాయిరువురను గోపాలకసనాథుండై నెయ్యంబు మీఱ నాదరంబుదోఁప సమ్మానించి ప్రకృతముం గూర్చి ప్రశ్న చేసెను. అంతట రాత్రిం బాసినచంద్రునివలె నవంతివర్ధనుం డటనుండ, అట్లే సురతమంజరితండ్రియు నిత్యకుండును ఉండ, వాయుపథాది విద్యాధరాధీశ్వరులు నుండ, కశ్యపమునియు సన్నిధిసేసియుండ, ఇతరులు నుండ, మంత్రి భరతరోహకుం డిట్లు చెప్పసాగెను.

దేవా, ఈవృత్తాంతము నామూలముగా నవధరింపవలయును. ఒకనాఁడు ఉజ్జయినిలో నెల్లవారును పాలకభూపతిని దర్శించి యిట్లు విన్నవించిరి.—ప్రభూ, ఈదిన మీపురమున నుదకదాన మనుమహోత్సవము ప్రవర్తిల్లును. అందులకారణ మెఱుంగవేని చెప్పెదము వినుము. మున్ను మీనాయనచండమహాసేనమహారాజు ఖడ్గోత్తమంబును భార్యారత్నంబును గోరి చండిక మెచ్చ తపంబు సేసెను. దేవి ప్రసన్నురాలై తన కత్తియె యాయన కిచ్చి భార్యార్థమై 'అంగారకాసురునిఁ గొట్టి వాని తనయను కల్యాణిని అంగారవతిని త్వరలోనే వివాహ మవుదువు.' అని యానతిచ్చెను. రాజు ఆకాల మెదురుచూచు చుండెను. ఇట్లుండఁగా నుజ్జయినిలో నెవ్వఁడు నగరాధిపతి యైనను వానిని రాత్రిరాత్రియు నేదో సత్త్వము భక్షించు చుండెను. దానిని వెదకి కనిపట్టువాఁడై చండమహాసేనుఁడు స్వయముగా నొకరాత్రి ఒంటరిగా పురిం దిరుగుచు పారదారికు నొకపురుషుం గాంచి చటాలున కత్తి దూసి సాభరణమును వాని తలకాయం దునిమెను. అయ్యంతలో నెవఁడో రక్కసుఁడు వచ్చి యామొండెమును గైకొనియెను. అంతట రాజు 'ఆహా! వీఁడె పురాధిపులను తినివేయుచున్నవాఁడు' అని పలికి వాని జుట్టు పట్టి తలగొట్ట నుంకించెను. అంత నారాక్షసుఁడు 'మహారాజ, నన్నేల వృథా చంపెదవు, నీపురాధిపులను తిను రాక్షసుఁడు ఇంకొకఁడు, నేను గాను.' అని మొఱ యిడెను.

వాఁ డెవఁడో తెల్పుమని రాజడుగ నారక్కసుఁ డిట్లనియె.—
'దేవా, అంగారకుఁ డని పాతాళనివాసి యసురుఁ డొకఁ
డున్నాఁడు, వాఁడు రాత్రుల నీపురాధిపులను తినుచున్నాఁడు.
ఓయి పరంతపుఁడా, వాఁడు ఇంతయగాక ఎల్లెడలనుండి రాజ
కన్యలను బలాత్కారంబున హరించును. వారిని తనకూఁతు
రంగారవతికి పరివారముగా నేర్పఱుచును. వానిని అడవిం
ద్రిమ్మరుచుండం గాంచి కూల్చి నీవు కృతార్థుఁడవు గమ్ము.' అం
తట రాజు ఆరక్కసుని వదలి తనయింటికిం బోయెను

పిమ్మట నొకనాఁ డారాజు వేఁటకై అడవికిం బోయి
యచట గొప్ప కాయంబును కనలున మంటలు గ్రక్కుకన్నులుం
గలిగి దరీఖండంబులతోడి యంజనాద్రియో యన నొప్పుచున్న
యొక యొంటిగానిం గాంచి, 'ఇదేమో పంది కాదు, మాయావి
యాయంగారకుఁడై యుండునా?' అని తలపోయుచు దాని
పై నారసంబులు నిగిడించెను. అది వానిని సరకుగొనక యాతని
యరదమును గూలద్రొబ్బి చని భూమిలో నొక మహావివరం
బుం జొచ్చెను. రాజు వీరంబుమీఱ దాని వెనువెంటనే చని
గుహ సొచ్చి చూడ అందు దివ్యపురం బొండు గానఁబడియెను,
సూకరంబు గానరాదాయెను. అం దొక డిగ్గియదరిం గూర్చుండి
కన్యాశతపరివారను రూపుదాల్చిన రతియో యన నొప్పులు
గుప్పుదాని నొకవరకన్యం గాంచెను. ఆకన్నియ యీయనం
దఱిసి రాకకుం గారణ మడిగి విని బాష్పాయమాణలోచన

యుగళరై ప్రేమ దొలఁకు బిత్తరి చూపులం గాంచుచు నిట్ల
నియె. 'అయ్యో! ఇట కేల వచ్చితివి? నీవు కన్నయావరా
హము అంగారకాసురుఁడు వజ్రకాయుఁడు మహాబలుఁడు.
ఇపుడు పందిరూపు విడిచి లోపల నిద్రించుచున్నాఁడు, మేలు
కొని భోజనసమయంబున నీకు అత్యాహిత మాచరించును.ఓయి
సొబగుఁడా, నే నాతని కొమరితను అంగారవతిని. నీకు గాఁగల
యనిష్టంబుం దలంప ప్రాణంబులు నాకుం గంఠగతంబులైనవి.'
ఆమె యిట్లు పలుకఁగా చండమహాసేనుఁడు దేవి యిచ్చిన
వరము జ్ఞప్తియై తనకు కార్యసిద్ధికలదని నమ్ముకొని యాకన్యతో
నిట్లనియె:—"నాయందు నీకు కూరిమి కలదేని నామాట
చేయుము. మీనాయన మేలుకోఁగా ఆయనప్రక్క నిలిచి
యేడువుము. అతఁడు కారణ మడుగును. 'నాయనా, నీవు పరా
కుగా నున్నప్పుడు ఎవఁడైన నిన్ను చంపివేసినయెడల అనంత
రము నాగతియేమి?' అని యుత్తర మిమ్ము ఇట్లు సేయుదువేని
నిక్కముగా నాకు మేలు కలదు. నీకును గలదు." ఆకన్య
మారమోహితయై రాజు చెప్పినట్లే తండ్రి మేలుకొనుసమయ
మున ప్రక్కనుండి యేడువసాగెను. కారణ మడుగఁగా అతని
వధవలని భయముం జెప్పెను. అంతట దైత్యుఁ డిట్లు పలికెను.
'నేను వజ్రకాయుఁడను, నన్నెవఁడు కొట్టఁగలఁడు నాయాయు
వుపట్టు నా యెడమచేత నున్నది. దానిని నావిల్లు కాచుచుం
డును.' ఈమాటను రాజు చాటుననుండి వినెను. దైత్యుఁడు

స్నానము చేసి శివార్చనకుం గడంగెను. పూజాసమయంబున రాజు ధృతకార్ముకుండై ఎదుటికిం జని వానిని పోరికి పిలిచెను. దైత్యుండు మౌనమూనిన సమయ మది. అంతట దైత్యుండు కుడిచేయి పనిలో నున్నందున ఎడమచే యెత్తి 'ఇంచుక తడవు తాళుము' అని సన్న చేసెను. అతిశీఘ్రుండు రాజు తత్క్షణమే ఆచేతిలోని మర్మస్థానమును కోల నేసెను. దైత్యుండు నేలం బడియెను. 'దప్పిగొనియున్న నన్ను ఎవండు చంపినాడో అతండు ప్రతిసంవత్సరము నీళ్లతో తప్పింపండేని అతని మంత్రులు నీవురు మృతి నొందుదురు. అని పల్కుచు దైత్యుండు ప్రాణములు విడిచెను. అంతట చండమహాసేనుండు తత్పుత్త్రిని అంగారవతిని గైకొని ఉజ్జయినికిం జనియెను. అట నామెను యథావిధి వివాహమై మాతండ్రి ఏట నేట అంగారకునికి జలదానము నేయించుచుండెను. అది మొదలు ఎల్లవారును ఈనగరంబున నుదకదాన మహోత్సవము చేయుదురు. ఇది ఆనివము. మా నాయన ఏమి చేయుచుండెనో దానిని నీవునుం జేయుము'

## అవంతివర్ధనుండు మాలపిల్లను వలచుట.

ప్రజ లిట్లు విన్నవింపంగా పాలకమహారాజు నగరంబున నుదకదాన మహోత్సవమును ప్రవర్తిల్లంజేసెను. అయ్యుత్సవంబున జనులు కోలాహలమగ్నులయియుండ ఆకస్మికంబుగా నేనుం గొకటి మదమెక్కి కట్టుకంబము నూడం బెఱికికొని యటకు పఱతెంచెను. ఆయేనుంగు అంకుశమును రాల్చి

మావటీనిఁ ద్రోచి ఊరిలోపల తిరుగుచు క్షణములో పలువురు
జనులను చంపివేసినది. మావటీఁడును మహామాత్రులును పరువున
వచ్చినను ఊరివారిలో నెవ్వారేనియుఁ దానిని పట్టలేరైరి గజము
క్రమంబుగా మాలవాడెమునకుఁ బోఁగా అందుండి మాలపిల్ల
యొకతె వెలువడి వచ్చెను. ఆకన్య, ఈమెముఖముచే నావైరి
చంద్రుఁడు జితుఁడాయెను అను కృతజ్ఞత చేతఁ దనకుఁ
బాదలగ్నయయిన కమలశ్రీచే భూమిని వెలిగించుచుండెను.
ఆమెయందు నిద్రయందుంబోలె లోకులెల్లరయు మనస్సు లితర
భావములనుండి మరలి, స్థితి యస్తమించి, కన్నులు విశ్రాంతిం
బొందినవి. ఆకన్య తన కెదుర వచ్చిన యావారణేంద్రముచు
కరము తనకరమున నడచి తన క్రేఁగంటి వంకర చూపులం
గొట్టెను. ఏనుంగు ఆకేలుసోఁకినంత మోహామొంది మోము
వాంచి ఆచూపువ్రేటుఁ బడి ఆమెనే కాంచుచు అడుగైనను
అవలికి జరుగక నిలిచినదాయెను. అంత నావరకన్య తనయుత్త
రీయమును దాని దంతముల నొకయుయ్యాలఁగాఁ గట్టి ఎగిరి
దానం గూర్చుండి యూఁగుచుండెను. ఇంచుక తడవునకు ఆమె
డప్పిగొనఁగా ఏనుఁగు చెట్టునీడకు ఆమెం గొనిపోయెను. ఈ
మహాచిత్రముం గని 'అహా! ఈమె యెవరో దివ్యకన్య, సర్వాతి
శాయి యగు రూపంబునన గాక ప్రభావముచేత సయితము
తిర్యగ్జంతువులను సయితము వశపఱచుకొన్నది.' అని పౌరులు
పల్కుచుండిరి. ఊరిలో ఈవృత్తాంతము విని కుమారుఁ డవంతి

వర్ధనుఁడు ఆవింతే చూడవచ్చి ఆవరకన్యం గాంచెను. చూచిన మాత్రాన రాజసుతుని మనోహారిణము మదనవ్యాధునివల యగు నాకన్నియయందు తగులుకొనిపోయెను. ఆమెయు రాజసూనుం గాంచి తన హృదయము నాతని రూపుపాలు చేసికొని ఉయ్యేల దిగి ఏనుఁగుదంతములనుండి తనయుత్తరీయముం దివిచికొన్నదై, ఇంతలో మావటీఁడు గజము నెక్కఁగా, తాను రాజకుమారుని అనురాగంబు లోలుకుచూపులం గాంచుచు నిజగృహంబున కేఁగెను. అవంతివర్ధనుండును ఏనుఁగు గందరగోళము ఆఁగఁగా తన హృదయమును ఆమెకుం గోలుపోయి, ఉత్తవాఁడే ఇంటి కేఁగెను. అట నాతఁడావరకన్య లేమిం దపించుచు ఆరంభించిన జలపానోత్సవమును మఱచి 'ఎఱుఁగుదురా ఆకన్య ఎవరికూఁతురొకో! పేరేమో?' అని చెలికాండ్ర నడిగెను. అంతట వారు రాజపుత్త్రునితో నిట్లనిరి.—'ఇట మాలకూడెములో ఉత్పలహస్తుఁ డని మాల యొకఁ డున్నాఁడు. ఆకన్య వాని కూఁతురు సురతమంజరి యని పేరు. అయ్యందగత్తియనెమ్మేను చిత్తరువువోలె దర్శనమాత్ర ఫలము గాని ఉపభోగార్హము గాదు' వా రట్లుచెప్పఁగా రాకుమారుఁ డిట్లనియె:—'ఆకన్య మాలకూఁతురు గాదు, నిక్కముగా ఎవతెయో దివ్య యని నేను తలఁచెద. మాలపిల్ల యెక్కడ? ఆ మాకృతి యెక్కడ? ఆరూపవతి నాకు భార్య గాదేని, నా కీజీవిత మేల?' ఇట్లు పలుకు నారాకొమరుని మన

స్సును మంత్రులు మఱల్ప నేరరైరి. అతఁడును ఆవిరహానలం
బునం గడుంగడుఁ గ్రాఁగుచుండెను. అంత నతనితలిదండ్రులు
అవంతిమతీ దేవియు పాలకనృపతియు ఆతని యావృత్తాంత
మెఱింగి చాలసేపు వ్యాకులపడిరి. 'ఇదేమి నాకుమారుఁడు రాజ
వంశ్యుఁడు అంత్యజాతిని కోరుచున్నాఁడు!' అని దేవి ఆశ్చర్య
పడఁగా రాజు ఇట్లు వాక్రుచ్చెను.

ఈ విధమున మనకుమారుని చిత్తము ఆకన్నియయందు
తగులుటంబట్టి నిక్కముగా ఆకుమారి కారణమాతంగి గాని
వాస్తవమాతంగి గాదు, ఎవతెయో లాఁతియే. సజ్జనుల
మనస్సే అనురక్తము విరక్తమును అయి కార్యమును అకార్య
మును సూచించును. అందులకు నిదర్శనంబుగా ఈ కథ విను.

## మాల కుమారుఁడు రాచకన్యను వలచుట.

సుప్రతిష్ఠిత మను నగరంబున మున్ను ప్రసేనజిత్తను
రాజునకు కురంగి యని అతి సుందరి కొమారిత యుండెను.
ఒకప్పు డాకన్నియ విహారార్థము ఉద్యానమునకుం బోవుచుం
డఁగా మత్తగజం బొకటి కట్టు దప్పి విడఁబడి వచ్చి పల్లకితోఁ
గూడ నామెను ఇరుదంతంబుల నెత్తికొని పఱతెంచుచుండెను.
పరివారము ఏడ్చుచు పలాయితము కాఁగా, నచటికి కేలఁ గత్తి
బూని మాలయువ యొకఁడు వీరుఁడు వచ్చి తొండము నఱికి
వేసి ఏనుంగుం గూల్చి యాకన్యామణిని రక్షించెను. ఇంతలో
పరిజనము వచ్చి కలయ నాకన్నియ యాతని సౌందర్యపరాక్ర

మములు తనహృదయమును లాగికొనఁగా శూన్యయై యింటికిం జనియెను. ఇంట తనకు ఏపుఁగునుండి కాచిన యావీరుఁడు మగఁడగుటయో మరణమో అని చింతించుచు విరహాగ్నిచే దందహ్యమానయై యుండెను. ఆమెరూపము తనచిత్తమును హరింపఁగా నామాలకొమరుఁడును అల్లన నింటి కరిగి ఆమెనే ధ్యానించుచు మరుకాఁకపాలై యుండెను. అంత్యజన్ముఁడను, నేనెడ రాజకన్యయెడ కాకిని రాయంచ వెలందికిని సమాగమ మెట్టిది! కలుగునా! ఇది నగుఁబాటుగా నున్నది. చెప్పనుం జాలను ఒప్పరికింపనుం జాలను. కావున నీయొకరున నాకు మరణమే శరణము.—అని యిట్లాలోచించి యాచండాలకుమారుఁడు రాత్రి వల్లకాటి కేఁగి స్నానముచేసి సొవపేర్చుకొని నిప్పంటించి మంటఁబెట్టి యగ్నిదేవుని 'దేవా, పావకుఁడా, విశ్వాత్ముఁడా నన్ను నీకు ఆహుతిగా వేల్చుకొనెదను నాకు పైపుట్టువునందేని ఆ రాకుమారి భార్యయగునట్లు వర మిమ్ము.' అని వేఁడుకొని చిచ్చున నుఱుక నుంకించునంత అగ్నిదేవుఁడు ప్రసాదంబునం బ్రత్యక్షుఁడై యిట్లు ఆనతిచ్చెను.—'వృథా సాహసము సేయకు. ఆకన్య నీకే భార్యయగును. నీవు మున్ను చండాలుఁడవు గావు, ఎవఁడవో చెప్పెద వినుము. ఈ పురమున కపిలశర్మ యని బ్రాహ్మణోత్తముఁడు కలఁడు. అతని యగ్నిగృహంబున నేను ప్రత్యక్షుండనై సాకారుండనై వసించుదును. అంతొకప్పుడు అతని కూఁతురు కన్య నాసమీప

మునకు రాఁగా రూపలోభంబున నక్కన్నియను భార్యంజేసి కొంటిని, దోషము పొరయనట్లు పరమిచ్చితిని. అప్పుడే ఆకో మలియందు నా తేజంబున నీవు పుట్టితివి. లజ్జచే నాపిల్ల నిన్ను తత్క్షణంబ రచ్చ మొగంబునం బాఱవైచెను. నిన్ను మాలలు గొనిపోయి మేఁకపాలు పోసి పెంచినారు. ఇట్లు నీవు నా కుమారుఁడవు, బ్రాహ్మణి కడుపునఁ బుట్టిన వాఁడవు. కాన నా తేజస్సునఁ బుట్టిన నీకు మైల లేదు. తప్పక యీ రాజకన్యకను కురంగిని నీవు భార్యగాఁ బొందుదువు.' ఇట్లు చెప్పి వేడి వేల్పు తిరోహితుం డాయెను. మాలని పెంపుడు కొమారుఁడును ఆస్థ గొని యింటి కరిగెను; అనంతరము ప్రసేనజిన్మహారాజు కలలో అగ్నిదేవునివలన ఆజ్ఞ పొంది తత్త్వము విచారించి ఆపాదకపుత్రునికి తనకొమారిత నిచ్చి వివాహము చేసెను. ఇవ్విధంబున సదా దివ్యులు భూమియందు ప్రచ్ఛన్నులై యుందురు. అట్లే ఈ సురతమంజరియు ఎవతెయో దివ్యయే గాని లాఁతిది గాదు, ఆరత్నమేమో వేఱ ఆమె నిశ్చయ ముగా నాసుతునికి తొలిపుట్టువున భార్య, అందులకు ఈచతూ రాగమే ప్రమాణము.

## జాలరికుమారుఁడు రాచకన్యను వలచుట.

అంతట నేను వ్యాకుచ్చితిని.—రాజగృహంబున మల యసింహుఁ డని రా జుండెను. ఆయనకు సాటిలేని రూపవతి మాయావతి యని కూఁతు రుండెను ఒకప్పుడు ఆమె యుద్యా

నంబున విహరించుచుండఁగా రూపయౌవనశాలి జాలరికుమారుఁ డొకఁడు సుప్రహరనాముఁడు ఆమెను గాంచి స్మరాతురుఁ డాయెను భవితవ్యత సాధ్యాసాధ్యవిచార మొల్లదు గదా. వాఁ డింటికిఁ బోయి చేఁపలుపట్టుట మాని తిండి మాని ఆమెనే తలంచుచు సెజ్జం బడెను. తల్లి రక్షితికానామధేయ ఇబ్బందిగా నడుగఁగా నక్కుమారుఁడు ఆమెతో వాస్తవము చెప్పెను. అంత నాజాలారిది 'పుత్త్రా, దిగులుపడకు, అన్నము తిను, లే; ఇ దెంతపని నాయుక్తిచేత నేను నీకోరికను సాధించెదను చూడు.' అని యోదార్చెను. పుత్త్రుఁడు నూఱిల్లి ఆస్థ గలిగి అన్నము తినెను. తల్లి మంచిమంచి చేఁపలను కానిక కొని రాకుమారియింటి కేఁగెను. కొలువుకై వచ్చినట్లు చేటికలవలనం దెలుపుకొని దొరకూఁతును దర్శించి జాలరిది ఆచేఁపలు కానుక పెట్టెను. ఆవరుసను దినదినంబును అట్లే కానిక యిడుచు మాట కెదురుసూచుచు రాజసుతను సేవించుచుండెను. రాజకన్య సంతోషించి 'నీకోరికం దెలుపుము, దుష్కర మయిననుం నేను నెఱవేర్చెదను.' అని పలికెను. దాశి ఏకాంతంబున ముందుగా నభయంబు వేఁడి రాజకన్యతో నిట్లు విన్నవించెను:—'దేవీ, ఉద్యానగతవు నిన్నుం గాంచి నా కొమరుఁడు నీవు లేమి స్రుక్కుచున్నాఁడు, నే నాసగొలిపి ప్రాణత్యాగమునుండి వారించి నిలిపియున్నాను, కావున నాయందు దయగలవేని నాసుతుని తాఁకి బ్రదికింపుము.'

చెంబడిది యిట్లు చెప్పుకొనఁగా నృపాత్మజ లజ్జితయై మోమోటపడియు ఆలోచించుకొని యారాత్రి గుప్తముగా ఆకొమరుని తనమందిరమునకుం దెమ్మని యానతిచ్చెను చెంబడి దియు హర్షంబున నేఁగి రాత్రి కుమారుని యథాశక్తి అలంక రించి రాజకన్యాంతఃపురమునకుం దెచ్చెను. రాజపుత్త్రియు చిరోత్సుకుని సుప్రహారుని చేపట్టి ప్రీతిపూర్వకంబుగా సెజ్జఁ జేర్చి విరహానలక్రాంతగాత్రు నాతని గందపుఁజలువలు వెదచల్లు తనకేలం దాఁకి తీర్చెను. ఆదాశీసుతుఁడు అమృతంబున స్నాన మైనయట్టులై ధన్యమ్మన్యుఁడై విశ్రాంతుఁడై నిద్రలో మునిం గెను. రాసుత యట్లు ధీవరకుమారుని రంజించియు తన శీలంబు కాచుకొనియు తాఁ బోయి సేజకుం బవ్వళించెను. ఆమె కేలి తాఁకుడు ఎడలినంతట సుప్రహారుఁడు మేల్కొని కై దప్పి పోయిన యా మోహనాంగిం గానక చేతికబ్బినలిబ్బిం గోలుపో యిన నిఱుపేదవోలె తల్లడిల్లి నిరాశుఁడై ప్రాణములు వదలెను. దానిం గని రాజకన్య తన్ను తాదూఱుకొనుచు తెల్లవాఱఁ గానే వానితో సహగమనమున కుద్యుక్తురాలాయెను.

ఆవృత్తాంతము నామెతండ్రి విని వచ్చి ఎంత నివారించి నను ఆమె వినకున్నంత ఆచమన మొనరించి యిట్లు పలికెను:— 'నేనే సత్యముగా దేవదేవుఁడు త్రిలోచనునియందే భక్తుఁడనేని ఓలోకపాలురారా, నే నిపుడిందుల కేమి సేయఁ దగునో నాకు బోధింపుఁడు' అంతట దివ్యవాణి యిట్లు పలికెను,—

'రాజా, నీకూఁతురు ఈ చెంబడి కుమారునికి జన్మాంతర భార్య. నాగస్థల మను గ్రామమున మహీధరుని కుమారుఁడు బలధరుఁ డని గుణవంతుఁడు బ్రాహ్మణుఁ డొకఁ డుండెను. ఆతఁడు తండ్రి స్వర్గస్థుఁ డయినంతట దాయాదులు తన ధనము హరింపఁగా విరక్తుఁ డై భార్యతోఁగూడ గంగాతీరమున కేఁగి అచట ప్రాణము విడువ నెంచి ప్రాయోపవేశం బుండి నిరాహారుండై తాను అచట చెంబడులు చేఁపలు తినుచుండఁగా ఆఁకటి వెంపున ఆసతోఁ గాంచెను. అతం డట్లు తత్సంకల్పదోషకళంకితుండై మృతిఁ జెందెను. భార్య శుద్ధసంకల్పయై తప మాచరించి యాతని ననుగమించెను. ఆ బ్రాహ్మణుఁడు వీఁడె, సంకల్పదోషంబున జాలరికులమునం బుట్టినాఁడు. మంచి తపస్సు చేసినది యాతని భార్య నీకుం గూఁతు రైనది. ఇపుడు నీకూఁతురు నిర్దోష, తన యాయుస్సులో సగ మిచ్చి భర్త నీతని బ్రదికించుకొనును గాక. ఈమె తపోమహిమ చేతను ఆపుణ్యతీర్థమున మరణించినందునను పవిత్రుఁ డీతఁడు నీయల్లుఁ డై రా జగును.' అంతట రాజు కూఁతు చేత నర్ధాయు విప్పించి ఆ చెంబడి కుమారుని బ్రదికించి వానికి ఆమె నిచ్చి వివాహము చేసెను. ఈతీరున పూర్వజన్మ సంబంధము ప్రాయికముగా ప్రాణులకు ప్రీతి పుట్టించును.

### దొంగ కథ.

ఇవ్విషయంబున ఈదొంగ కథంగూడ వినవచ్చును. అయోధ్యలో వీరబాహుఁ డని ప్రఖ్యాతుఁడు రా జుండెను.

ఆతఁడు సదా ప్రజలను తన సుతానంబుగా పాలించుచుండెను. ఒకప్పుడు పౌరులు రాజును దర్శించి 'దేవా, దొంగలు ప్రతి రాత్రియు ఊరెల్ల దోఁచుకొనుచున్నారు. మేము మేలుకొనియే యుండియు వారిం గనిపట్టలేకున్నారము' అని మొఱ యిడిరి. అంతట రాజు దొంగలను గనిపట్ట రాత్రి వేగులను నియమించెను. వారుం గనిపట్ట నేరరైరి. ఉపద్రవము మాన దాయెను. అనంతరము రాజు స్వయముగానే దొంగలం బట్ట నడుకట్టి ఖడ్గపాణియై ఊర నేకాకిగా తిరుగుచుండెను. తిరుగుచుండఁగా నాతనికి ఒకచో ప్రాకారముమీఁద నొకపూరుషుఁడు భయంబున తేలికగా అడుగు లిడుచు, కాకివలె చంచలలోచనుండై, సింహమువలె మెడ త్రిప్పి వెనుకఁ గాంచుచు చేతి విచ్చుకత్తి తళతళలతో నక్షత్రరత్నములను హరింప విసరెడి యుచ్చుదారములతోనుంబోలె నగపడియెను. వానిం గని రాజు నిశ్చయంబుగా వాఁడే ఏకచరుఁడు ఊరెల్ల నిత్యము దోఁచుచున్నాఁడని తలంచి చదురు మెఱసి వానికడ కేఁగెను. చోరుఁడును శంకగొని నీవెవరవని యడిగెను. రాజు 'నేను బహువ్యసనంబులచే బ్రదుకలేక సాహసికవృత్తి నవలంబించినదొంగను. నీవెవరవో చెప్పుము.' అని యడిగెను. చోరుఁ డిట్లనియె:— 'నే నేకచరుఁడను దొంగను, మహాధనుఁడను. కావున నా యింటికిరమ్ము, నీధనేచ్ఛను పూరించెదను.' రాజు సరియే యని వానితోఁ గూడ ఊరివెలుపల అడవిలో వానినేలమాలె

కుం బోయెను. వరాంగనాధిష్ఠితంబును భూరిరత్న ప్రకాశితం
బును సదానవోపభోగంబును నై యానేలమాళిగ భుజంగ
నగరంబు భాతి నుండెను. దొంగ లోనిగృహంబున కేఁగెను.
రాజు మోసలం గూర్చుండెను. అంత నాతని చెంతకు దాసి
యోర్తు వచ్చి జాలిగొని 'అయ్యో! ఎటకు వచ్చితివి! తత్క్షణమే
పొమ్ము! ఈయింటరి దొంగ విశ్వాసఘాతకుఁడు, తన రహ
స్యము బయ లగు నను వెఱపున తప్పక నిన్నుం బొరిగొనును.'
అని మందలించెను. ఆమాట విని వెంటనే రాజు వెలువడి తన
యిలు సేరి సేనాపతిం బిలువనంపి దండు దోడ్కొని మరల
వచ్చి ఒంటరి దొంగయిలు ముట్టడించి మాసటీలను లోని కంపి
వాని ధనరాసు లెల్ల చూఱగొని దానిం గట్టి తెచ్చెను. తెల్ల
వాఱఁగానే రాజు వానిం గొఱుతవేయ నాజ్ఞ చేసెను. ఆరె
కులు బజాఱుదారిని వానిని వధ్యభూమికిం గొనిపోవుచుండఁగా
వానిం గని మరు లూని వణిక్కుమారి యోర్తుతటాలున తండ్రి
కడ కేఁగి 'నాయనా, ఇదె డప్పుగొట్టి చాటించి వధ్యభూమికిం
గొనిపోవు చున్నారే ఆతఁడు నాకు మగఁడు గా వేరఁడేని
చచ్చితి నని యెఱుంగుము' అని పలికెను. ఎంతకు ఆమె
యాకట్టు వదలకుండఁగా, గత్యంతరము లేక ఆమె తండ్రి రాజు
కడ కేఁగినవాఁడై దేవా, కోటిధనమైన నిచ్చెదను, ఆదొంగను
మన్నింపవలయును. అని వేఁడెను. రాజు వర్తకునిపైఁ గోపిం
చెనేగాని దొంగను వదలఁడాయెను, మీఁదుమిక్కిలి వానిని

వెంటనే కొలుత వేయించెను. అంతట వాయదత్తయను వేరిది ఆవణిక్కన్య ఆదొంగ దేహముం బుచ్చుకొని అనురాగాతిరేకం బున దానితో నగ్నిప్రవేశము చేసెను. ఇవ్విధమునఁ బూర్వ జన్మసంబంధవశంబున జంతువులు ప్రవర్తిల్లుచుండఁ గావలసిన దేది కాకమానునా! ఎవఁడు ఎవనివి ఎందు వారించును! కావున మహారాజా, నీకుమారునికి అవంతివర్ధనునికి ఈసురత మంజరి యెవతెయో పూర్వసంబంధముచేత భార్యగా నిర్మిత యైనది. ఒండేని సద్వంశ్యునికి రాజపుత్త్రునికి నీతనయునికి మాతంగకన్యయందు ఇట్టి యత్యాసక్తి యెట్లు కలుగును?

నే నట్లు పలుకఁగా విని పాలకమహారాజు వెంటనే కన్య నడుగ నుత్పలహస్తునికడకు దూతలం బంపెను. వారు పోయి యడుగఁగా మాతంగుఁడు 'ఇది నా కిష్టమే, కాని నాయింట నెవఁడు ఈయూరివారికి పదునెనిమిదివేల బ్రాహ్మణులకు భోజన సంతర్పణ చేయించునో అతనికి నాసుత నీసురతమంజరి నిచ్చెద.' అని యుత్తరము చెప్పెను. ఆమాటను దూతలు వెంటనే వచ్చి రాజున కెఱుకపఱిచిరి. ఇందుల కేమో కారణ ముండు నని తలంచి రాజు ఊరిలోని బ్రాహ్మణులనెల్ల సమకూర్చి యా వృత్తాంతము తెలిపి 'ఓ బ్రాహ్మణులారా, మీరు మాలవాఁడు ఉత్పలహస్తుఁడు కలఁడే వానియింట పదునెనిమిదివేల మంది భుజింపుఁడు, అటు సేయరేని క్షేమ ముండదు.' అని ఆనతి చ్చెను. అంత బ్రాహ్మణులు రాజాజ్ఞ కోర్వక ప్రక్కను చండాలా

న్నమున కొకప్రక్కను భయపడుచు ఏమిచేయనుం దోఁపక మహాకాళు నాశ్రయించి తపం బారంభించిరి. 'ఉత్పలహస్తుని యింట నిశ్శంకముగా అన్నము భుజింపుఁడు, అతఁడు సకుటుంబుఁడు విద్యాధరుఁడుగాని చండాలుఁడు గాఁడు.' అని శంభుఁడు కలలోఁ దెల్పఁగా బ్రాహ్మణులు లేచిపోయి ఆవృత్తాంతము రాజున కెఱింగించి వెండియు నిట్లనిరి:—'మాలగూడెములోఁ గాక యుండెడ నీయుత్పలహస్తుఁడు శుద్ధాన్నమును వండించుఁ గాక. మేము భుజించెదము.' అంతట రాజు ఉత్పలహస్తునికై వేఱులోఁగిలి కట్టించి అందు ఆతని యన్నమును వండించెను. ఉత్పలహస్తుఁడు స్నాతుఁడై మడికట్టుకొని ఎదుట చూచుచుండఁగా అగ్రజన్ములు పదునెనిమిదివేల మందియు భుజించిరి. వారు భుజించి లేచినతర్వాత ఉత్పలహస్తుఁడు వచ్చి రాజుతో ప్రకృతులయెదుట ప్రణామపూర్వకంబుగా నిట్లు విన్నవించెను.

దేవా, గౌరిముండుఁడని మహాప్రబలుఁడు విద్యాధరేశ్వరుఁ డుండెను. నేను ఆతని యాశ్రితుఁడను, మతంగదేవుఁడు నాపేరు. నాకు ఈకూఁతురు సురతమంజరి పుట్టినప్పుడు గౌరిముండుఁడు నన్ను 'ఈవత్సేశ్వరుని కుమారుఁడు కలఁడే నరవాహనదత్తుఁడు, అతఁడు మన కెల్ల చక్రవర్తి కాఁగలఁ డని దేవతలు చెప్పుచున్నారు. కాన చక్రవర్తి పదముం బొందు వఱకు నతఁడు మనకు క్షుద్రశత్రువు గావున నీవు పోయి నీ మాయచే నాతనిం గూల్పుము, లెమ్ము.' అని త్వరపెట్టెను.

ఆపాపాత్ముఁ డిట్లు నన్నుం బ్రేరింపఁగా అందుకై నేను ఆకాశ మార్గమునం దరలఁగానే మోలి మహేశ్వరుం డగపడి కోపం బున హుంకారము గావించి న న్నిట్లు శపించెను.— 'ఓరి పాపాత్ముఁడా, మహాపురుషునికి ఎగ్గుసేయఁ గడంగితివేలరా! కాన ఓరి దుర్మతీ నీవు ఈ యొడలితోనే భార్యాపుత్రీ సమేతముగా పోయి ఉజ్జయినిలో చండాలురలోఁ గలయుము. నీకూఁతు నిచ్చుటకు శుల్కముగా ఎవఁడేని నీయింట పదునెని మిదివేల బ్రాహ్మణులను ఎపుడు భోజనము చేయించునో అపుడు నీశాపము తీఱును, వానికి నీతనయ నీయవలసినది.' ఇట్లు పలికి శంభుఁ డంతర్హితుఁ డాయెను. నేనును ఇట చండాలురలోఁ బడితిని. వారిలో నాకు ఉత్పలహస్తుఁ డని పేరయినది. నాకు వారితో సాంకర్యము లేదు. ఇపుడు నీ తనయునికరుణచే నా శాపము తీఱిపోయినది. కాన నిదె నే నాతనికి నాకుమారితను సురతమంజరిని ఇచ్చినాఁడను. ఇఁక నరవాహనదత్తచక్రవర్తిం గొలువ నావైద్యాధరపదమునకుం బోయెద.

ఇట్లు వచించి కూఁతు నిచ్చి మింటి కెగసి భార్యతోఁ గూడ మతంగదేవుఁడు వీఁడుగో నీపాదమూలమునకు వచ్చి నాఁడు. పాలకరాజును తత్త్వ మెఱిఁగి సంతసించి సురతమం జరిని తనతనయునికి వివాహము చేసినాఁడు. ఆవిద్యాధరిని భార్య గాఁ బడసి తత్పుత్రుఁడు అవంతివర్ధనుఁడు తనకోరికల కెక్కు డగు సిద్ధిచే కృతార్థుం డాయెను. ఒకనాఁడు ఆక్కుమారుఁడు

ఆమెతోఁకూడ మేడలో శయనించి నాలవజామున మేల్కని యామెం గానఁడాయెను. వెదకి కానక యేడ్చుచు తపింప సాగెను. ఆవృత్తాంతము విని రాజు వచ్చి కని తానును దుఃఖార్ణవమగ్నుఁడాయెను. 'ఈయూరికి కావలి యున్నది, రాత్రి ఎవఁడు నిందుఁ బ్రవేశింపఁజాలఁడు, నిక్కముగా ఎవఁడో పాపాత్ముఁడు నింగిద్రిమ్మరి ఆమెను హరింపఁబోలును.' అని ఆ సమయమున వచ్చికూడిన మేము పల్కుచుండఁగా మాపంపున వచ్చి ధూమశిఖుఁడు పాలకపతికి వృత్తాంత మావేదించి కుమారుని నన్నును దెచ్చినాఁడు. ఇట సురతమంజరియు ఆమె తండ్రియు నున్నారు. ఆమె వృత్తాంత మిది, అటుపై దేవర ప్రమాణము.

అట్లు చెప్పి పాలకమంత్రి భరతరోహకుఁడు విరమింపఁగానే నరవాహనదత్తుసిమోౕలి సభాసదులు మతంగదేవుని 'ఎవరికయ్యా నీవు సురతమంజరి నిచ్చితివి ? చెప్పుము' అని యడిగిరి. నే నవంతివర్ధనుని కిచ్చితి నని మతంగదేవుఁ డుత్తర మిచ్చెను. 'నీ వేల యోయి ఈమెను హరించెదవు?' అని వారు ఇత్యకు నడుగఁగా 'నాకు తొలుత తల్లి ఈకన్యను వాగ్దానము చేసినది.' అని ఇత్యకుఁడు పలికెను. 'తండ్రి యుండఁగా కన్య నిచ్చుటకు తల్లి కేమి యధికారము ? అందులకు నీకు సాక్షి యెవరు ? కావున నోరిపాపీ, నీ కీమె పరభార్య.' అని సభ్యులు ఇత్యకునిం బల్కిరి. ఇత్యకుఁ డట్లు నిరుత్తరుఁడు కాఁగా, నర

వాహనదత్తచక్రవర్తి వానిదుర్వినయమునకుం గనలి వానివధ నాజ్ఞాపించెను. అంత కశ్యపాదిమునులు 'రాజా, వీనియీారియొక యపరాధమును క్షమింపుము, వీఁడు నీబావమఱఁదిగదా, మదన వేగుని కుమారుఁడు కదా.' అని యనునయింపఁగా చక్రవర్తి వానిని బుద్ధిచెప్పి విడిచిపెట్టెను. మామకుమారునికి తల్ప్రి యను సురతమంజరి నర్పించి వాయుపథుని తోడిచ్చి భరత రోహకునితోఁగూడ ఉజ్జయినికిం బంపివేసెను.

---

## 3-వ తరంగము.

---

### తారావలోకుని కథ.

ఇవ్విధంబున నయ్యసితగిరియందు ఆపతివ్రతను సురత మంజరిని రక్షించి మునిజనమధ్యంబున నాసీనుఁడై యున్న నరవాహనదత్తుని కశ్యపముని యిట్లభినందించెను.— రాజా, నీబోఁటి చక్రవర్తి ఇంతకు ముందు లేఁడు, ఇంకను నుండఁడు. ఏలన ధర్మాసనమందు నీమతి రాగాదివశము గాకున్నది. సుకృతిని నిన్ను సదా కనువారు ధన్యులు సుమా. ఇట్టి సామ్రాజ్యం బుండియు నీయందు దోష మించుకేనియు లేదు. పూర్వము ఋషభకాదులు చక్రవర్తు లుండిరి. నానావిధదోష ములచే వారు సిరి తొలఁగి చెడిరి. ఋషభుఁడు, సర్వద మనుఁడు, మూఁడవవాఁడు బంధుజీవకుఁడు, వీ రందఱును అతి

దర్పముమూలముగా ఇంద్రునివలన నిగ్రహ మొందిరి. జీమూత
వాహనుఁడు చక్రవర్తిపదప్రాప్తికారణమును నారదముని
యడుగఁగా కల్పవృక్షనిజదేహదానములు కారణ మని చెప్పి
నిజసుకృతకథనదోషంబున చక్రవర్తిపదముం గోలుపోయెను,
విశ్వాంతరుఁ డని యుండెను గదా చక్రవర్తి, ఆతఁడును తన
తనయుని ఇందీవరాక్షుని చేదిరాజు వసంతతిలకుఁడు తన
రాణిని చెఱిపిన ద్వేషముచేతఁ బోరిగొనఁగా ఆదుష్టపుత్త్రునికై
వగపు పట్టలేక తాను మృతుఁ డాయెను. తారావలోకుఁ
డొక్కఁడుమాత్రము మనుష్యుఁడ యయ్యును సుకృతప్రభా
వంబున విద్యాధరచక్రవర్తిపదముం బొంది దోష మేమియు
నెఱుంగక చిరకాలము సామ్రాజ్య మనుభవించి, తుదను
వైరాగ్య మొంది తపంబుకై రాజ్యము వీడి వనమున కరిగెను.
ఈరీతిని ప్రాయికంబుగా విద్యాధరులు పదవి గలిగినప్పుడు మఱ
పుఁ జెంది రాగాద్యంధులయి యనుచితమార్గమున నిలువక పడి
పోదురు. కావున నీవు 'న్యాయ్యమార్గముననె యుండి తప్పులం
దప్పించుకొనుచు ధర్మము దాఁటకుండునట్లు నీప్రజలను విద్యా
ధరులనుం గాపాడుకొనుచు నుండవలయును.

కశ్యపుఁ డిట్లు పలుకఁగా చక్రవర్తి ఆయనమాటను
శ్రద్ధాపూర్వకంబుగా గ్రహించి యాయనను 'ఎక్కరణిని
తారావలోకుఁడు మానుషుఁడ యయ్యును మున్ను విద్యాధర

కదముం బొందినాఁడో స్వామీ నాకు వర్ణింపుఁడు' అని వేఁడెను. కశ్యపముని యిట్లు చెప్పందొడంగెను:—

పూర్వము శిబిదేశంబున చంద్రావలోకుం డని రాజొకఁ డుండెను. ఈశ్వరుని కాతనికి మూర్ధన్య దుగ్ధాబ్ధినిర్మలకుల గంగా సమస్థితి శుద్ధచంద్రలేఖ యని ప్రియ యుండెను. మఱియు నాతనికి పరసేనావిమర్దకము భూలోకంబున కువలయాపీడ మను పేరఁ బ్రఖ్యాత మయినది యేనుం గొకటి యుండెను. దాని ప్రభావంబునం జేసి యారాజు తనరాజ్యము పౌరస్వామికంబ యయినను ఎట్టిబలాఢ్యుని చేతఁ గాని మార్తునిచే నో టెఱుంగ కుండెను. ఆరాజునకు జవ్వన మెడలినంతట చంద్రలేఖాదేవి యందు ఒక్కఁడే కుమారుఁడు శుభలక్షణుఁడు కలిగెను. తారావలోకుఁ డను పేర నాబాలుఁడు తోఁబుట్టువు లయిన తన దానధర్మవివేకాదిసుగుణంబులతో పెరుఁగుచుండెను అమ్మహా మతి వాఙ్మయ మెల్ల నేర్చియు నశబ్దార్థముమాత్రము నేర్వని వాఁడై యర్థికల్పద్రుమంబై యుండెను. ఆతఁడు వయస్సుచే యువ యయ్యును పనులచే వృద్ధయి తేజస్సుచే సూర్యవిభుఁ డైనను దర్శనంబున సౌమ్యుఁడై, నిండుపున్నమ చందమామకు వోలె సకలకలాసందోహసుందరుఁడై, కందర్పునివలె ఎల్లలోక మునకు ఔత్సుక్య మిడువాఁడై, పితృశుశ్రూషయందు జీమూ తవాహనుని మించి స్ఫుటంబుగ మహాచక్రవర్తిలక్షణలాంఛి తుండై యుండెను. ఆకుమారునికి తండ్రి చంద్రావలోకుఁడు

మద్రరాజుకూఁతును మాద్రి యనుదానిం దెచ్చి వివాహము చేసి గుణోత్కర్ష హృష్టుండై యపుడే యువరాజుంగా పట్టాభిషేకము చేసెను.

ఇట్లు తండ్రిచే సభిషిక్తుండై తారావలోకుండు తదాజ్ఞచే అన్నాదిదానసత్త్రములుం పెట్టించెను; పడకనుండి లేచుచునే పాత్రుల వెదకి తెమ్మటంచు కువలయాపీడము నెక్కి తిరుగుచుండును. ఎవఁ డేమి కోరిన వాని కది యిచ్చును, ప్రాణమైనను సరియే. దానంజేసి యెల్లదిక్కులయందును యువరాజు కీర్తి పర్వుచుండెను. ఇట్లుండ ఆయనకు మాద్రియందు ఇరువురు కుమారులు కవలవాండ్రు జనించిరి. వారికి రామలక్ష్మణులని యాతఁడు పేరిడెను. అక్కుమారులు తల్లిదండ్రులస్నేహానందంబులో యన వర్ధిల్లుచు తాతకును అవ్వకునుం గూడ ప్రాణాధికప్రియులుగా నుండిరి. తరవిండ్లవలె ఆరోపితగుణులై వినతులైన యక్కుమారులం గనుచు తారావలోకుండును మాద్రియు తనివినొందరైరి. అంతట కువలయాపీడగజంబును, దాతృకీర్తిని, సుతులనుం, గని తారావలోకునిశత్రువులు తమబ్రాహ్మణులం బిలిచి యి ట్లనిరి. 'మీరు పోయి తారావలోకుని కువలయాపీడగజమును యాచింపుఁడు. అతఁడు దానిని మీ కిచ్చునేని అది లేమి దుర్బలుఁ డగునతని రాజ్యమును మేము హరించెదము. ఈయనిచో దాతృకీర్తి నశించును.' ఆబ్రాహ్మణులు వల్లె యని పోయి దానవీరుని తారావలోకుని ఆగజ

మును యాచించిరి. "ఏనుఁగును యాచించి పుచ్చుకొని బ్రాహ్మ
లేమి చేసికొందురు! కావున నిశ్చయముగా వీరి నెవరో ప్రయో
గించినారు. ఏ మయినం గానిమ్ము, నే నీయేనుఁగును ఇయ్యవలసి
నదే, నాకొందిని ప్రాణము లుండఁగా యాచకుఁడు విఫల
మనోరథుఁడై యేఁగుట యెట్టిది?' ఇట్లు తలంచి తారావలోకుఁడు
ఇంచుకేనియుం గలంగక అవ్వారణేంద్రము బ్రాహ్మణుల
కిచ్చెను. ఏనుంగును బ్రాహ్మణులు కొనిపోవుచుండఁగాఁ గాంచి
పౌరులు కలంగి కోపంబున చంద్రావలోకనృపతికడ కేఁగుదెంచి
యిట్లనిరి.—'దేవా, నీకుమారుఁడు నీరాజ్యమును వదలివేసి
సర్వసన్న్యాసము చేసి మునిధర్మంబునం బ్రవర్తిల్లుచున్నాఁడు.
ఎట్లన, సిరికి మూలంబయిన తనమదగంధము సోఁకినమాత్రాన
నన్యగజములు పలాయితంబు లగు కువలయాపీళవారణేంద్రంబు
నీతఁడు యాచకుల కిచ్చినాఁడు చూఁడు. ఈనీతనయుని తపస్సు
కై అడవికేని పంపుము, ఏనుంగు నైనం దెమ్ము; అట్లు సేయ
వేని మేము వేఱొకని రాజుం జేసికొందుము.' చంద్రావలో
కుఁడు పౌరుల యీ విన్నపమును ప్రతీహారముఖంబున పుత్త్రు
నికి తారావలోకునికి వినిపించెను. తారావలోకుఁడు విని యిట్ల
నియె:—'ఏనుఁగు నేమో నే నర్థుల కిచ్చితిని, నాకు ఏదియు
అర్థుల కియ్యరానిది గాదు. పౌరాయత్త మయిన యట్టి యీ
రాజ్యము నాకేల? మెఱుపువలె చంచలమయిన పరుల కుపయోగ
పడనియీసిరియు నాకేల? కావున వేనిఫలశ్రీ సర్వభోజ్యమో

అట్టి క్రూరమృగములతోఁగూడ నడవిలో నుండుట మేలుగాని, ఇట్టి పశువులనడుమ నుండుట సరి గాదు.'

ఇట్లు పలికి తారావలోకుఁడు సమసంకల్పధీర యగు భార్యను దోడ్కొని తలిదండ్రులపాదములం దలంచి ధన మెల్ల నర్థుల కిచ్చి నారచీరలు గట్టి, పుత్త్రులతోఁగూడ నగరు వెలు వడెను. ఏడ్చుచు వెంట వచ్చిన ద్విజులను ఓదార్చి మరల్చెను. అట్లు తరలినయాతనిం గని యేడ్చినపశుపక్షుల యశ్రుధారలచే భూమి తడిసిపోయినది. శిశువులకై యొక బండిమాత్రము గ్రహించి యాతఁడు పయనము నడచుచుండఁగా దారిలో బ్రాహ్మణులు బండిగుఱ్ఱములను యాచించిరి. అంత నాతఁడు గుఱ్ఱములను విప్పి యిచ్చివేసి బాలుర బండిని తానును భార్యయు తపోవనమునకు ఈడ్చుకొనిపోవుచుండిరి. అడవి నడుమ అలయికచే నిలిచినయా తారావలోకుని బ్రాహ్మణుఁ డొక్కఁడు గుఱ్ఱములు లేని యావట్టియరదమును యాచించెను. తారావలోకుఁడు కలఁత చెందక ఆబ్రాహ్మణునికి ఆతేరి నిచ్చి వేసి భార్యయు తానును పిల్లలతో పిల్లకాయలతో తపోవనము చేరెను. అచట భార్య మాద్రి కొఱఁతలేకుండం బరిచరించు చుండ చెట్టుక్రింద ఇల్లుగా మృగములే పరివారముగా వసించు చుండెను. వైరాగ్యరాజ్యస్థు నవ్వీరుని గాలి కాఁపుపూరెమ్మలు వింజామరలుగా, పెనపెద్దనమేరుతరువులు ఆతపత్త్రంబుగా, ఆకులు పఱుపుగా, రాతిన్నెలు ఆసనంబులుగా, తేఁటి కోమ

లుల యులివులు పాటలుగా, నానాఫలరసంబు లాసవంబులుగా, వనాంతంబులు గొలుచుచుండినవి

ఇట్లుండ నొకనాఁడు భార్య ఆతనికై స్వయముగా ఫల పుష్పంబులు తేర నాశ్రమమునుండి బయటఁబోయియుండఁగా వృద్ధ బ్రాహ్మణుఁ డొకఁడు వచ్చి ఆకుటింట తారావలోకుం గని సుతులను రామలక్ష్మణులను తన కిమ్మని యాచించెను. 'నిసువుల నయినను వీరిం గొనిపోయిన సహింపఁగలను గాని ఆసచెడి యాచకుఁడు మరలిపోయిన నేను సహింపఁజాలను. శతుఁడు విధి నాధైర్యధ్వంసముం గనవేఁడుచున్నాఁడు!' అని తలపోసి తారావలోకుఁడు ఆబ్రాహ్మణునికి తనశిశువుల నిచ్చి వేసెను. వారు కూడఁబోనిచ్చగింపక యుండఁగా నాబ్రాహ్మణుఁడు ఇరువురను తీఁగలతో చేతులు కట్టి కొట్టి తఱుమసాగెను. తల్లిం జీరుచు వెనుకకు మరలి మరలి తండ్రిం జూచుచు కన్నీళ్లతో నేడ్చునానిసువులను ఆపాఱుఁడు కనికరింపక తోలుకొనిపోయెను. దానినెల్లం గనుచునే యుండియు తారావలోకుఁడు డెందంబునం గలంగఁ డాయెను. అతనిధైర్యమునకు చరాచరాత్మక మయిన భూతగ్రామం బెల్ల కలఁగుండివడియెను. ఇంతలో నాతనిభార్య మాద్రి వనాంతమునుండి పుష్పఫల మూలాదికములం గొని యలసి మగనియాశ్రమమునకు వచ్చెను. తలవాంచియున్న మగనిం గని సుతులం గానక ఇటునటు వైచఁ బడియున్న వానిని గుజ్జిములు అరదములు లోనగు మట్టి

బొమ్మలను గాంచి యుల్లంబున సాశాభయమ్ములు మల్లడిగొన 'అయ్యో! చెడితిని, నాశిశువు లేరీ?' అని దిగులుతో నతని నడిగెను. 'ఓసి పుణ్యశీలా, నీతనయులను యాచకునికి దరిద్రుని కొక బ్రాహ్మణునికి ఇచ్చివేసితిని.' అని యాతఁడు మెల్లన వచించెను. అంత నాసాధ్వి మోహాముతీఱి పతితో 'అట్లని మంచి పనియే చేసితివి, యాచకుఁడు పరాఙ్ముఖుఁ డగుట తగునా!' అని పల్కెను. ఇట్లామె పల్కఁగా ఆదంపతుల తుల్యసత్త్వతను లోకము క్రక్కదలెను, ఇంద్రునిసింహాసనము చలించెను.

అంత నింద్రుఁడు మాద్రీతారావలోకుల దానసత్త్వ ప్రభావంబునకు జగత్తు అట్లు కంపిల్లె నని యోగదృష్టివలన నెఱింగి పరీక్షార్థము తాను బ్రాహ్మణరూపంబున తారావలోకుని యాశ్రమంబునకుం జని అతని యేకపత్నిని మాద్రీ దేవిని తన కిమ్మని యాచించెను. తారావలోకుండును వికల్పంబు సేయక ధారోదకముతో నామె నిచ్చివేయఁగడంగెను. 'ఓయి రాజర్షీ, ఇట్టిభార్యను సయితము ఇచ్చివేసి పిమ్మట ఏమి సాధింతువు?' అని బ్రాహ్మణరూపంబున నున్నయింద్రుం డడుగఁగా తారావలోకుఁడు 'నాకు సాధింపవలసిన దేమియు లేదు, ఇది యొకటియే నాకోరిక, ఏమనఁగా బ్రాహ్మణులకై నాప్రాణము నయినను ఇచ్చివేయుదును గాక యని.' అని యుత్తరము చెప్పెను. అంత నింద్రుఁడు నిజరూపము దాల్చి 'అయ్యా! నీవు భార్యను ఈయవలదు, మహాసత్త్వుఁడా, నీవు త్వరలోనే

విద్యాధరులకు చక్రవర్తి వగుదువు.' అని చెప్పి యంతర్ధాన
మాయెను.

ఈలోపల ఆమునలి బ్రాహ్మణుఁడు తారావలోకునివలన
తాను యాచించి కైకొన్న యాశిశువుల నిద్దఱం దోడ్కొని
దారి తప్పి దైవవశంబున తారావలోకుని తండ్రి చంద్రావలో
కుని పురంబునకే పోయి అచట బజాఱులో ఆ రాసుతులను
విక్రయింపఁ గడంగెను. పౌరు లాకుమారుల నానవాలుపట్టి
పోయి రాజున కెఱుకపఱిచి బ్రాహ్మణసహితముగా నాతనికడకుం
గొనిపోయిరి. రాజు అట్లు చేరిన తనమనుమలం గాంచి యుద
గ్రుండై బ్రాహ్మణు నడిగి వృత్తాంతముఁ విని పెద్దయుం బ్రొద్దు
సుఖదుఃఖమయుఁ డాయెను. అంత నారాజు తనకొమరుని
సత్త్వాతిశయమును తలపోసి తానును రాజ్యముపై విరక్తి
చెందినవాఁడై పౌరులవేఁడుకోలు, పాటిసేయక బ్రాహ్మణునికి
ధన మిచ్చి యామనుమల నిరువురం గొని భార్యతోఁగూడ తన
కొమారుని యాశ్రమమునకుం బోయి అందు మహావృక్షంబుం
బోలె బద్ధజటుని వల్కలధారిని ఆశాగతద్విజభుక్తశ్రీని కుమా
రుని తారావలోకుం గనుఁగాంచెను. దూరమున నుండఁగానే
లేచి పరువున వచ్చి తనయడుగుల వ్రాలినయాపుత్త్రుని తారావ
లోకుని తండ్రి చంద్రావలోకుఁడు బాష్పధారల నభిషేకించి
యొడిం గూర్చుండఁ బెట్టుకొనుట, విద్యాధరాధి రాజ్యాభి
షేక సింహాసనారోహణంబుల కారంభమో యనం జెల్లెను.

అంతట చంద్రావలోకుఁడు తారావలోకునికి ఆతనికుమారుల నిరువురను బ్రాహ్మణునివలన ధన మిచ్చికొనుట తెలిపి యప్ప గించెను

వారచట నింక అన్యోన్యవృత్తాంతములం జెప్పుకొను చుండఁగానే చౌదంతియు లచ్చియు దివినుండి అచటికి దిగి వచ్చిరి. ఇంక విద్యాధరపతు లనేకులును దివినుండి దిగిరాఁగా, పద్మహస్త లక్ష్మి తారావలోకునితో 'ఈ యేనుఁగు నెక్కి విద్యాధరనిలయమునకు రమ్ము, దానప్రభావంబున సాధించిన తచ్చక్రవర్తిశ్రీని అనుభవింపుము.' అని యానతిచ్చెను. అంతట తారావలోకుఁడు భార్యాపుత్రసమన్వితుఁడై తలిదండ్రులచరణ ములకు మ్రొక్కినవాఁడై ఆశ్రమవాసులెల్ల వింతపడి చూచు చుండ లక్ష్మితోఁగూడి ఆదివ్యగజేంద్రము నెక్కి విద్యాధరేశ పరివృతుఁడై ఆకాశమార్గమున వైద్యాధరపదమునకుం బో యెను. చిరకాలము సామ్రాజ్య మనుభవించి కాలక్రమంబున వైరాగ్యముఁ బొంది తపస్సుకై వనంబు నాశ్రయించెను ఇట్లు తారావలోకుఁడు మానుషుఁడ యయ్యును పూర్వము తన సుకృతములచేత సర్వ విద్యాధరేంద్రపదవిం బొందెను. ఇతరు లాపదవిని బొందియు దోషవశంబున భ్రష్టు లయిరి. కావున నీవు నీవలనఁగాని ఒరులవలనఁగాని అపచారము లేకుండ జాగరూ కుఁడవై మెలంగుము.—

ఇట్లు కశ్యపముని కథ చెప్పి అనుశాసింపఁగా నరవాహనదత్తుఁడు భక్తితో సంగీకరించెను. మఱియు 'ఓ విద్యాధరులారా వినుఁడు. ఇది మొదలు నా ప్రజలలో ఎవ్వఁడేని ధర్మము నుల్లంఘించెనేని నిక్కముగా వాఁడు నాకు వధ్యుఁడు. అని కైలాసముచుట్టును చాటింపించెను. ఇట్లు సురతమంజరీ మోచనంబున కీర్తివహించి నరవాహనదత్తచక్రవర్తి సకల విద్యాధరులయు నెడలం దనశాసనము నిలిపి మునిబృందమధ్యంబున తనమామచెంత వావర్షాకాలంబుం గడపుచు నాకశ్యపాశ్రమమందె యుండెను.

సురతమంజరీలంబకము సమాప్తము.



# పద్మావతీ లంబకము.

౧-వ తరంగము.

క. సగమేనఁ గాంతఁ దాల్చియు
మిగిలెడు నెవ్వాఁడుజగతి మేటితపసిగా
నగుణుం డయ్యును నెవ్వాఁడు
జగన్నుతుఁడు వానిఁ గొల్తు శంకరు నెపుడున్.

క. చెవితుదలకదలికల నళి
నివహంబుల నంతరాయనివహంబుల నా
నెవయం దోలెడునావి
ఘ్నవినాశకుఁ గుంజరాస్యుఁ గడు నుతియింతున్.

ఆ తీరున నయ్యసితగిరిలో కశ్యపాశ్రమమందు తపము సేయుచున్న మామచెంత వర్షాకాలమును గడపుచు మంత్రుల సంగతిని సర్వవిద్యాధరేంద్రైకచక్రవర్తి నరవాహనదత్తుఁడు ఆయావిద్యాధరాధిపులచే నుపాసితుఁడగుచు తన యిరువది యే వురు భార్యలతోఁ గూడుకొని కథలు చెప్పుచుండఁగా మహాము నులును వారి భార్యలును 'రాజా, మానసవేగుఁడు నీదేవేరిని మదనమంచుకను మాయచే హరించి కొనిపోయినప్పుడు విరహ విహ్వలుని నిన్ను ఎవరు ఎట్లు వినోదపఱిచిరో ఆవృత్తాంతమును

మాకు సవిస్తరముగాఁ జెప్పుము.' అని యడిగిరి. నరవాహన దత్తుఁ డిట్లు చెప్పందొడంగెను — ఆ పాపాత్ముఁడు పగతుఁడు మానసవేగుఁడు నాదేవిని మదనమంచుకను హరించినప్పుడు నేను పడినదుఃఖమును నిపు డేపాలు వర్ణింపఁగలను? నే నార్తుఁడనై యామెను వెదకుచు తిరుగనిది ఊరుగాని యిల్లుగాని తోఁటగాని లేదు. నామంత్రులందఱును అట్లే వెదకిరి. అంతట నేను పిచ్చియెత్తినవానివలె నొకచెట్టుక్రింద కూర్చుండఁగా సమయమెఱింగి న న్నోదార్చుచు ఈ గోముఖుం డిట్లు చెప్పినాఁడు:—'దేవా దీనతఁ బొందకు, త్వరలోనే దేవిం గలసెదవు. ఆమెతోఁగూడ నీవు విద్యాధరైశ్వర్య మనుభవింపవలసినట్లు గదా దేవతలు ఆదేశించియున్నారు. అది తప్పక యట్లే జరుగును, వారిమాట పొల్లుగాదు. ధీరులు విరహము నోర్చి ప్రియసంగముం బొందుదురు. శ్రీరామభద్రుఁడు నలమహారాజును సీతాతలును విరహము నోర్చి ప్రాణప్రియలం గూడుకొనలేదా? దేవిని పద్మావతి నెడఁబాసిన యావిద్యాధరచక్రవర్తి ముక్తాఫలకేతుఁడు మరల నామెను గలయ లేదా ? నే నాకథను వర్ణించెదను వినుము.'—ఇట్లు పలికి యీగోముఖుఁడు ఆ కథను నా కిట్లు చెప్పినాఁడు.—

## బ్రహ్మదత్తనృపతి కథ.

శాంభవమూర్తియోఁయన నాకథునిభూషిత మోక్షదాయిని వారాణసి యని లోకప్రసిద్ధ నగరి కలదు. ఆనగరి గాలికి

లేచుచుం గ్రుంకుచుండు దేవాలయధ్వజపటంబులచేత 'నిటకు రండు మోక్షముం బొందుఁడు' అని నిరంతరము జనులం బిలుచుచున్నదో యన నొప్పుచుండును ఆనగరి తెల్లని ప్రాసాద శిఖరము లొప్ప చంద్రచూడుని నివాసభూమిద్యై శైవగణం బులు ఎల్లెడలం బర్వ కైలాసాచలస్థలినాఁ జెలువొందును. అందు బ్రహ్మదత్తుఁడను రాజు శివైకభక్తుఁడు శూరుఁడు, దాత, క్షమాపరాయణుఁడు ఏలుచుండెను. ఆరాజునాజ్ఞ లోక మునం దిరుగుచు దుర్గములందు తొట్రుపడదు, ద్వీపాంతరము లను దాఁటనిది గాదు, సంద్రములందయినను మునుంగదు. ఆరాజునకు ఆహ్లాదమొసంగునది కనులతో జుత్తిత్రాఁగఁదగినది చకోరమునకుంబోలె సోమప్రభ వల్లభగా నుండెను. ఆతనికి శివభూతి యని బ్రాహ్మణుఁడు బుద్ధిలో బృహస్పతియంతవాఁడు సర్వశాస్త్రార్థవిశారదుఁడు మంత్రి.

ఒకనాఁ డారాజు చంద్రప్రాసాదమున నెజ్జలోనుండి నింగి నేతెంచిన యంచకవం గనియెను. ఆయంచలు మెఱుఁగు గల కుందనంబుగా నుండెను. వానిచుట్టును రాయంచ లనేక ములు ఉండినవి. ఆరెండును మిన్నేటితరగలు ఎగఁద్రోయఁగా క్రిందికి రాలుచున్న బంగారుతామరజంటయో యన నుండెను. అవి చూపుమేర దాఁటి పోయినంతట నారాజు అచ్చెరువడి మరల వానిం గన నుత్కంఠితుఁడై కానక దురపిల్లసాగెను. రేకటమును నిద్రింపకయే పుచ్చి తెల్లవాఱఁగానే, మంత్రి శివ

భూతితో రాత్రి తాఁ గన్నవింతం జెప్పి 'మంత్రివరా, ఆయం చలను తనివితీఱ నిరంతరము చూచుచుండ నేని, నాకు ఈ రాజ్యమేల ఈజీవితంబు నేల?' అని వచించెను. శివభూతి యిట్లనియె:—దేవా, ఇందులకు చింతిలనేల! ఉపాయము సేయవచ్చును, వినుము. విచిత్రకర్మసంబంధంబునం జేసి యీ సంసారముతో ప్రజాపతి సేయు భూతసృష్టి విచిత్రముగా నుండును. దానిలోఁతు మనము గనఁజాలము. దుఃఖమయ మయిన యీ సంసారమందు అజ్ఞానవశంబునం జేసి సుఖభ్రమం జెంది జంతువులు నివాసాహారపానాదిరసముచేత రక్తి నొంది యుండును. వానివానికి వానివానిజాతికి తగినట్లు బ్రహ్మదేవుఁడు భోజనపానాదికములను నివాసములను వేలు వేలుగా చేసి యున్నాఁడు కావున దేవా, ఇట అంచలకు నెలవుగా నొక తటాకముం ద్రవ్వించి తామరలతోను కలువలతోను నింపి పక్షుల కెవరివలనను ఏమియు బాధ కలుగకుండ కావలి యుంపుము. సదా దాని దరిని పక్షులకు ఇష్టమయిన మేఁతను వేయింపుము. అట్లు చేసిన త్వరలో నాకాదిక్కులనుండి నీటి పులుఁగులు అటకు వచ్చును. వాని నడుమ త్వరలోనే ఆపైడియంచలు గూడ రాఁగలవు. అంతట నీవు వానిని నిరంతరము చూచుచుండవచ్చును, కావున చింతల్లకుము. మహామంత్రి యిట్లు చెప్పఁగా రాజు వెంటనే అట్టి తటాక మొకటి త్రవ్వించెను.

అంతట కాలక్రమమున నందు అంచలు బెగ్గురులు జక్కవలు వచ్చి చేరినవి ఆయంచకవయు వచ్చి తామరగుబురులో చేరినది. ఆవృత్తాంతమును కావలివారు నివేదింపఁగా బ్రహ్మదత్తుఁడు తనకోరిక నెఱవేఱినందులకు ఆనందసామ్రాజ్యమునం దేలుచు కొలనిదరి కేతెంచి దూరమునుండియే యా పైఁడియంచలం జూచుచు పూజించుచు పాలు వడ్లు బియ్యంబును ఎదుట నుంచి మచ్చికపడునట్లు పిలుచుచు, కడాని యొడలు ముత్తెపుఁగన్నులు పగడపుముక్కు పవడపుటడుగులు గరుడమణి ఱెక్కకొనలుం గలిగి మచ్చికగా చెంతకు వచ్చుచుండు నాయంచలను సదా ధ్యానించుచు సంతోషంబున నా కొలనిదరినే వాసము చేసెను.

ఒకనాఁడు రాజు కొలనిగట్టున నొకచో తిరుగుచు పూవులింక వాడని పూజను కాంచి కావలివారిని ‘ఈపూజ యెవరు చేసినారు?’ అని యడిగెను. ‘మహాప్రభూ, మూఁడు సంజల యందును ఈబంగారు హంసలు రెండును ఈకొలనస్నానమాడి ఇట ప్రతిదినము పూజచేసి ధ్యానమాచరించును. ఈయద్భుత మేమో మహారాజా, మేమెఱుంగ నేరకున్నారము.’ అని కొలని కాపరులు విన్నవించిరి. అంతట అంచ లేమి, ఈయాచార మేమి? నిక్కముగా నిం దేమో కారణ మున్నది.’ అని తలపోసి రాజు ఆయంచలతత్త్వ మెఱుంగ వేఁడి తపస్సుచేయ సమకట్టెను. భార్యతోను మంత్రితోను నిరాహారుండై హరధ్యాన పరుఁడై

తపమాచరించెను. ఇట్లా రాజు పండ్రెండుదినము లుపవసించి నంతట ఆదివ్య హంసలు ఆతనికి కలలో అగపడి స్ఫుటవాక్కున 'రాజా, లెమ్ము, సభార్యునికి సమంత్రికి నీకు రేపు ప్రాతఃకాల మున విజనమందు పారణ కాఁగానే మావృత్తాంతము జెప్పె దము.' అని చెప్పి యంతర్ధాన మైనవి. రాజు మేల్కొని భార్యామంత్రిసమన్వితముగా పారణ కావించెను. భోజనానం తరము నీటి నడిమి విలాసగృహమందు భార్యామంత్రులతోఁ గూడ కూర్చున్న రాజు కడకు ఆయంచలు వచ్చినవి. రాజు వానిని పూజించి 'మీరెవ్వరో చెప్పుఁడు' అని యడుగఁగా నవి క్రమముగా నిజవృత్తాంతము నిట్లు వక్కాణించినవి.

లోకప్రఖ్యాతము మందరమని సురవిహారవిరాజమాన రత్నకాననము పర్వతరాజము కలదు గదా; పాలకడలిం ద్రచ్చినపుడు అమృతంబునం దడియుటంజేసి దానిచఱులందు పూవులు కాయలు వేరులును ముదిమిని చావును హరించు ప్రభావముం బొందియున్నవి. కైలాసమును మించి మనోహ రంబగు నా కొండకొమ్ములు నానారత్నమయములు నీలలో హితునికి క్రీడాప్రదేశము లయి యొప్పుచున్నవి. అట నొక ప్పుడు మహాదేవుఁడు విహరించి పార్వతిని దిగ విడిచి ఒకా నొక దేవకార్యమును సాధించుటకై యంతర్హితుఁ డాయెను. అంతట హరుని వియోగమును భరింపఁ జాలక పార్వతి అందు హరుని క్రీడాస్థానములనెల్ల వెదకుచు తిరుగుచుండెను.

ఆమెను ఇతర దేవతలు ఓదార్చిరి. ఇట్లుండ వసంతము రాఁగా నామె బెగ్గడిల్లి గణపరివేష్టితయై యొకచెట్టుక్రింద ప్రియుం దలఁపోయుచు కూర్చుండెను. అంత నచ్చట జయకూఁతును దేవికి వింజామర వీచుచున్నదానిని చంద్రలేఖ యనుపేరికన్యకను సాభిలాషంబుగా తన్ను తిలకించుచున్నదానిని చక్కఁదనంబునను జవ్వనంబునను సరియైనవాఁడు మణిపుష్పేశ్వరుఁ డను గణోత్తముఁడు చెంతనుండి సాభిలాషముగాఁ గన్గొనియెను. దానింజూచి పింగేశ్వరగుహేశ్వరు లను మఱియిరువురు ప్రమథులు మొగ మొగంబులు చూచి నవ్వుకొనిరి. వారి చిఱునగవుం గాంచి దేవి 'అపదంబున నెందులకై వీరు నవ్వుచున్నారు?' అని కినుకతో ఇటు నటు నరయఁగా చంద్రరేఖయు మణిపుష్పేశ్వరుండును నగుఁజూపు లొండొరుల మొగంబుపై నిగిడించుచు కన నైరి. విరహంబుచేతం జీకాకుపడియున్న దేవి కోపగించి 'మంచిది, మీ రిరువురును ప్రభువు ఎదుట లేనపుడు మంచి స్మరప్రేక్షణక మాడిరి, హాసశీలు రియ్యిరువురును దానిం గని చక్కఁగ హసించిరి. కావున నియ్యవినయమునకు కామాంధు లియ్యిరువురును మనుష్యజాతిలోఁబడి స్త్రీపురుషులుగా జనించి భార్యాభర్త లగుదురుగాక. నవ్విడు దురభ్యాసముకల ఈయిరువురును పుడమిలో క్లేశము లొందుదురు. ముందుగా దుఃఖితులు బ్రాహ్మణులు, అనంతరము బ్రహ్మరాక్షసులు, తర్వాత వరుసగా పిశాచములు చోరులు తోఁకతెగినకుక్కలు, అనంతరము నానా

విధపత్తులును అగుదురు. వీ రిరువురు స్వస్థచిత్తులై యుండియు
ఈయపరాధము చేసినారు!' అని శపించెను అంతట ధూర్జటు
డను ప్రమథుఁడు దేవితో "దేవీ ఇది, కేవల మయుక్తము,
అల్పతితప్పిదమునకు ఈగణోత్తములను ఇంత శపించుట న్యా
య్యము గాదు' అని పలికెను. అంత కోపంబున దేవి ఆతనిం
గూడ మర్త్యయోనిం బడు మని శపించెను. అంతట ప్రతీహారి
జయ చంద్రలేఖతల్లి దేవిపాదముల వ్రాలి 'తల్లీ, కరుణింపుము,
నాకాంతునకు శాపాంత మనుగ్రహింపుము. తెలియక తప్పు
చేసిన యీ నీకింకరులను అనుగ్రహింపుము.' అని ప్రార్థించెను.
గట్టురాపట్టి యిట్లనియె:—'జ్ఞానప్రాప్తివశంబున క్రమముగా
వీరందఱు నెపుడొక్కెడ కలసికొందురో బ్రహ్మాదుల తపఃక్షేత్ర
మందు సిద్ధేశ్వరుని దర్శించి యపుడు శాపము తీఱి మరల నా
కడకువత్తురు. మనుష్యత్వమందు ఈచంద్రలేఖయు, దీనికాంతుఁ
డును, ఈధూర్జటుఁడును, ఈమువ్వురును సుఖ మనుభవింతురు.
ఈయిరువురుమాత్రము దుఃఖమే యనుభవింతురు.'

ఇట్లు పల్కి దేవి విరమించునంతలో అసురుఁ డొకఁడు
అంధకుఁ డనువాఁడు హరునియసాన్నిధ్యం బెఱింగి దేవిని కోరి
వచ్చి తత్పరివారముచే దెబ్బలు తిని పోయినవాఁడు ప్రభావ
జ్ఞాతవృత్తాంతుఁడైన శంభునిచేత నిహతుఁ డాయెను. పోయిన
కార్యము తీఱి హరుఁడు రాఁగా అంబిక సంతోషించి ప్రసంగ
వశంబున అంధకాసురునిరాకం దెలుపఁగా శంభుఁడు గిరిజతో

'దేవీ, వాఁడు పూర్వము నీకుం గలిగిన మానసపుత్త్రుఁడు, వానిని నే నిపుడు సంహరించితిని, ఇఁకను వాఁడు తోలు నెమ్ములు మాత్రము మిగిలి భృంగి యను పేరం బరంగుచుండును.' అని చెప్పెను. గౌరీశంకరు లిట్లుకొండలో విహరించుచుండిరి. మణి పుష్పేశ్వరాదు లేవురును భూలోకమునం బడిరి. రాజా, అందు పింగళేశ్వరునియు గుహేశ్వరునియు దీర్ఘచిత్రచరిత్రమును ముందుగా చెప్పెదము వినుము.

ఈ భూమండలమునందు యజ్ఞస్థల మని యగ్రహారము కలదు. అందు ధనవంతుఁడు యజ్ఞసోముఁ డని బ్రాహ్మణుఁ డుండెను. ఆతనికి నడివయస్సులో ఇరువురు కుమారులు పుట్టిరి. పెద్దవాఁడు హరిసోముఁడు, చిన్నవాఁడు దేవసోముఁడు వారికి బాల్యము తీఱి యుపనయనము అయిన తర్వాత ముందు ఆ బ్రాహ్మణునికి ధనము పోయినది, తర్వాత భార్య పోయినది, అనంతర మతఁడే కాలధర్మము నొందినాఁడు. అంత నక్కుమారు లిరువురును తల్లిదండ్రులు లేక దీనులై యుండఁగా దాయాదులు వీరియగ్రహారము నపహరించినారు. కుమారు లిరువురు నిట్లు కలయఁబలికికొనిరి. 'మనకు భిక్ష యొక్కటియే గతి యైనది, అదియు నెచటను దొరకుట లేదు కాన దూర మయినను మాతామహునియింటికి పోదము; చెడి చేరినమనల నచట నెవరును సరకుసేయరు, అయినను పోదము, ఏమి చేయఁగలము, మన కొండు గతి లేదు' ఇట్లు కూడఁబలుకుకొని యక్కుమా

రులు తరలి వారిలో భైక్షజీవులై క్రమంబుగా తాతగారి యా
యగ్రహారమునకు పోయిరి. ఇలుసేరకముందే జనులవలన తాత
సోమదేవుఁడు భార్యతోఁగూడ కాలము చేసెనాఁ డని విని మంద
భాగ్యులు యజ్ఞదేవ క్రతుదేవు లనెడు తమ మేనమామల
యింటికి దారిద్యముటొడళ్లతో చనిరి. ఆ సుజనులు మామలు
ఈ చిన్నవాండ్ర నాదరించి అన్నవస్త్రము లిచ్చి అధ్యయ
నము సేయించుచుండిరి. వీరు అట నుండఁగా క్రమముగా నా
మామలకు దారిద్ర్యము వచ్చి, సేవకులు ఎడల, ఈ యల్లుం
డ్రతో మామలు ప్రీతిపూర్వకంబుగా 'ఓరి, బిడ్డలారా, మనకు
వేదజీకము కలిగినది. పసులకాపరిని పెట్టుకొన లేకున్నాము,
కాన మీరే మన పశువులను కావుఁడు' అని నియమించిరి.
మామ లిట్లు పలుకఁగా అల్లుండ్రు కన్నీరు నిండిన కంఠంబులతో
వల్లెయని యంగీకరించి దినదినము పసులను అడవికి తోలుకొని
పోయి మేపి అలసి సాయంకాలము ఇంటికి తోలుకొనివచ్చు
చుండిరి. వారిట్లు పసులఁ గాచుచుండఁగా దేవీశాపప్రభావంబున
ఒక గొడ్డును పులి యెత్తుకొనిపోవును, ఒకదానిని దొంగలు
హరింతురు. మామలు దిగులుపడసాగిరి.

ఇట్లుండ నొక పాఁడియావును యజ్ఞమునకు ఉంచుకొన్న
యొక మేఁకయు రెండును పాఱిపోయినవి, అంత నాయల్లుండ్రు
ఆభయంబునం జేసి కడమపసులను అకాలమున నింటికిం దోలు
కొని వచ్చి పలాయితులై ఆరెంటిని వెదకుచు అడవిలో కడు

లోఁతునకుం బోయిరి. అందు పులి సగము తిని విడువఁగా ఆ మేఁకసామేనుమాత్రము దొరకినది. దానిం గని యేడ్చి మొత్తుకొని యిట్లొకరొకరితో చెప్పుకొనిరి. 'ఈమేఁకను మనమామలు యజ్ఞమునకై పెట్టుకొనియుండిరి, వారికి ఇది పోయిన కోపము పట్టరాకుండును. కనుక దీనిమాంసమును వండుకొని తిని ఆఁకలితీర్చుకొని మిగతకై కొని యెటకేనియు నేఁగి భిక్షాటనము చే జీవింతము.' ఇట్లాలోచించుకొని వారు అగ్నిలో మేఁకను కాల్చుకొనునంతలో పరుగుపరుగున వెనుకప్రక్క మామగార్లు వచ్చి అల్లుండ్రిరువురు మేఁకను వండుచుంటం గాంచిరి. వారిం గనినంత నల్లుండ్రు అదలి లేచి దూరముగా నెటకో పలాయితులైరి. మామలు కోపావిష్టులై 'హా! మీరు మాంసాశచేత రాక్షసులపని చేసితిరి, కాన బ్రహ్మరాక్షసులరై పచ్చిమాంసము తినుఁడు' అని ఆయల్లుండ్రను శపించిరి. వెంటనే యాబ్రాహ్మణకుమారులు బ్రహ్మరాక్షసులై కోఱలు నిండిన నోరులును వెలింగెడు తలవెండ్రుకలును గలిగి ఆఁకటం దల్లడిల్లుచు జంతువులపైబడి మెసవుచు నడవిలోఁ ద్రిమ్మరుచుండిరి.

ఒకనాఁడు యోగనిష్ఠుఁడైన యొకతాపసుని భక్షింపఁబోయిరి. తాపసుఁడు ప్రతిహతిసేసి వారిని పిశాచములుగా శపించెను. పిశాచత్వ మొంది వారొకప్పు డొకబ్రాహ్మణుని గోవును హరింపఁబోయి యాతనిచే చండాలు రగునట్లు శాప మొందిరి. చండాలురై విలు దాల్చి తిరుగుచు ఆఁకట డస్సి

అన్నార్థులై యొకదొంగపల్లి కరిగిరి. అట ద్వారమునఁ గావలి దొంగలు వీరిం గని దొంగ లని యెంచి కట్టి కొట్టి ముక్కుం జెవులుం దఱిగి వైచిరి. అనంతర మాదొంగలు వీరిని దుద్దు గుడియలతో మోఁదుచు దొంగలరాయనికడకుం దోలుకొని పోయిరి. దొంగలరాయఁ డడుగఁగా వారు ఆఁకటిచే తమపడ్డ యాంపాట్లతోఁగూడ తమ వృత్తాంతమును వర్ణించిరి. అంతట దొంగలు కనికరించి కట్లు విప్పివేసి, 'మీ రిట నుండుఁడు భయ పడకుఁడు యథేచ్ఛముగా భుజింపుఁడు, నేఁడు అష్టమి, కొమర సామిజాతర, మీరు అతిథులు వచ్చితిరి, కావున మీకు మేము అన్నము పెట్టవలసినది.' అని వారి నోదార్చి, తాము సామిం బూజించి, ఆయిరువురను అగ్రభోక్తలం జేసిరి. భోజనమైన పిమ్మట వారిని పోనీయక వారియందు కరము ప్రీతి వహించి తమతోఁగూడ నిలుపుకొనిరి. పిమ్మట వీరును ఆదొంగలతోఁ గూడ చక్కఁగా దొంగతనము సేయుచు క్రమముగా తమశౌర్య ప్రభావంబున వారికెల్ల పెద్దదళవాయు లైరి. ఆదళవాయులు దొంగవేగులవలన ఒకగొప్పపట్టణమును శివక్షేత్రమును విని దానిని దోచుకొనుటకు ఒకరాత్రి యిరువురును దొంగల దళ ములతోడ వెడలిరి. అపశకునములను సరకు సేయరైరి. దేవ ళములతోఁగూడ ఊరెల్లం గొల్లగొనిరి. అంత నూరివారు మహేశ్వరుని శరణుఁ జొచ్చి యాక్రందించిరి. అంత నీశ్వరుఁడు కోపగించి యాదొంగలను వికలులఁగాను గ్రుడ్డివారినిగాను

చేసెను. దొంగలకు ఆకస్మికంబుగాఁ గలిగిన యాపాటుం గాంచి లోకులు శివానుగ్రహంబుగా గ్రహించి అందఱుం గూడి యా దొంగలను దుడ్డుగుదియల మోఁది జాలఁగొట్టిరి. కన్నులకుం గానరాక ప్రమథులు దొంగలను కొందఱను గోతులలో వైచిరి, కొందఱను దంచి నుగ్గుచేసిరి. ఆసేనాపతుల నిరువురను కని పట్టి జనులు చంప నుంకింపఁగా నయ్యిరువురును తత్క్షణంబ తోఁకలు త్రెస్సిన కుక్క లయిరి. అట్లయి యయ్యిరువురును పూర్వజన్మజ్ఞానము కలవారై నిర్భయంబుగా శంకరుని సన్నిధి నృత్యము చేయుచు ఆదేవునే శరణుఁజొచ్చిరి దానిం గని బ్రాహ్మణ వైశ్యాదిజనులెల్ల అచ్చెరువొంది దొంగలభయము తీఱి, నవ్వుచు ఇండ్లకేఁగిరి. అజ్ఞాన ముడిగి తెలివి గలిగి ఆకుక్కలు రెండును శాపశాంతికై తిండి మాని శివుం గూర్చి తపఁబు సల్పుచుండినవి. తెల్లవాఱఁగానే పౌరులెల్ల వచ్చి పండువుగావించి యాశ్చర్యం బూజించినవారై యాకుక్కలకు అన్నమిడినను తినక ధ్యానం బున నున్నవానిని కని యాశ్చర్యపడిరి. ఆకుక్క లట్లే పెక్కు దినములు నిరాహారంబులయి తపించుచుంటం గని ప్రమథులు ఆద్దేవదేవునితో నిట్లు విన్నవించిరి: 'దేవా, ఈయిరువురును ప్రమథులు పింగళేశ్వర గుహేశ్వరులు, దేవీశాపంబున బహుకాలము క్లేశ మనుభవించినారు, వీరియందు కరుణింపఁ గర్తవు.' శంభుం డానతిచ్చెను. 'ఇపుడు కుక్కజన్మముపోయి వీరు కాకు లగుదురు గాక.' అంత నాయిరువురును కాకులై బల్యన్నము చే

పారణ సేసి జన్మాంతరజ్ఞానము కలిగి ఏకాగ్రత మీఱ శివుని ధ్యానము సేయుచుండిరి. కాలక్రమమున భక్తవత్సలుఁడైన శంకరుని నిదేశంబున వారిరువురను మొదలు భాసములై తర్వాత నెమళ్లయిరి. అటు తర్వాత హంసలై మఱియు భక్తి దీపింప తీర్థస్నానవ్రతధ్యానపూజనంబులచే హరి నారాధించి హేమరత్నమయంబు లగుహంసలై జ్ఞానులైరి పార్వతీశాపవశంబున నానాక్లేశము లనుభవించి తుదిని హంసలయిన యాపింగళేశ్వర గుహేశ్వరులము మేమే సుమా.

నయకీర్తు నభిలషించి దేవివలని శాప మొందిన యామణిపుష్పేశ్వరుఁడవు నీవే బ్రహ్మదత్తనృపతివి. జయకీర్తురేఈనీభార్య సోమప్రభ, ఆధూర్జటుఁడే నీమంత్రి శివభూతికుఁడు. కావుననే మేము జ్ఞానము కలవారమై అంబిక యాదేశించిన శాపాంతప్రకారమును స్మరించి నీకు రాత్రి దర్శన మిచ్చితిమి. ఇట్లు ఉపాయక్రమంబున మన మెల్ల నిటం గలసికొంటిమి. మఱి మే మిరువురము మీకు ఉత్తమజ్ఞానము నుపదేశించెదము. కాన రండు మేరుమహీధరమందలి యా శివక్షేత్రమునకు సిద్ధీశ్వర మనుదానికిం బోవుదము, అచటఁ గదా మున్ను విద్యుద్ధ్వజవినాశార్థము దేవతలు తపస్సు లొనర్చిరి దేవత లాతపస్సునకు మెచ్చిన శివునియనుగ్రహమ్మున ముక్తాఫలకేతుని విద్యాధరచక్రవర్తిని సహాయునిఁగాఁ బడసి విద్యుద్ధ్వజునిం గూల్చిరి. ఆముక్తాఫలకేతుచక్రవర్తి శాపమువలనిమానిసితనమును దాఁటి

హరుని యనుగ్రహంబున నెండియుం బద్మావతిం గలసికొనెను. అట్టి యాక్షేత్రంబున కరిగి హరునికి మ్రొక్కి మనగతిని పోవుదము. ఇట్లేగదా దేవి మనకు శాపాంతము ననుగ్రహించినది.

అద్దివ్యమరాళంబు లిట్లు వాక్రువ్వంగా బ్రహ్మదత్తమహీపతి ముక్తాఫలకేతుకథను వినుటకై మిగులం గుతూహలపడెను.

---

## ౨ - వ తరంగము.

---

బ్రహ్మదత్తుం డా దివ్య మరాళంబులను 'విద్యుద్ధ్వజుని ముక్తాఫలకేతుం డెట్లు కూల్చెను, శాపమువలని మానిసితనమును దాంటి యెట్లు పద్మావతిం బొందెను? ఈవృత్తాంతము ముందుగా చెప్పుము, ప్రకృతమును తర్వాత చేసెదను.' అని యడిగెను. అంత నయ్యంచలు ఈకథం జెప్పినవి.

### ముక్తాఫలకేతుని కథ.

విద్యుత్ప్రభుండని దైత్యేంద్రుండు దేవదుర్జయుం డుండెను. అతండు పుత్త్రార్థియై భార్యతోంగూడ జాహ్నవీతీరమందు బ్రహ్మను నూఱేండ్లతపంబుచే తనియించి తద్వరంబున దేవతలచే మడియనివానిని విద్యుద్ధ్వజనాముని తనయునిం బడసెను. దైత్యరాజ కుమారుం డాతండు బాలుండయ్యును మహాబలుండై ఒకనాండు తన పురము నలుప్రక్కలను దళంబులు కావలి కాచుచుంటం గన్గొని చెలికాని నొకని 'మిత్త్రమా, ఇట సేవనివలన

భయము? ఏల యీనగరము నిట్లు వీరభటులచే కావలి కాపించున్నారు?' అని యడిగెను. వయస్యుఁ డిట్లనియెః—కలఁడు మనకు శత్రువు దేవేంద్రుఁడు. ఆతనికై యీపురరక్షణసంవిధానము. పదిలక్షలు ఏనుంగులు పదునాలుగులక్షలు అరదంబులు, ముప్పదిలక్షలు గుఱ్ఱములు పదికోటులు కాలుబంట్లును జాము జామునకును వరుసలప్రకారము ఈపురిని కాచుచుందురు, వంతు జాము ఒకమాఱు వచ్చిన యేడేండ్లకు మరల వచ్చును.' విద్యుద్ధ్వజుఁ డిట్లనియె.—'ఇసీ! ఇదేమి రాజ్యము, తన బాహువు చేతఁ గాక యన్యులబాహువులచే రక్షింపఁబడుచున్నది! కావున నేను తీవ్రతపం బాచరించి శత్రువుల నెల్ల బాహుబలంబున గెలిచి యీ వెక్కిరింత లేకుండం జేసెదను.' ఇట్లు పలికి దైత్యకుమారుఁడు వల దని వారించుచున్న యావయస్యుని నిషేధించి తలిదండ్రులకుం దెల్పకయే తపస్సు సేయ వనంబున కరిగెను. వృత్తాంత మెఱింగి తలిదండ్రులు స్నేహంబున వెంట వచ్చి 'పట్టీ, బాలుఁడవు నీ వేడ, తపఃకష్ట మేడ, సాహసము చేయకు. శత్రువు లెల్ల జితు లైనారు, కాన మనరాజ్యమునకు శత్రుభయము లేదు. ఈమూఁడులోకములందును ఇంతకన్న నెక్కుడు ఏమి కోరెదవు? వృథా నిన్ను ఇగురఁజేయుచు మమ్ము నేల నెవులుపాలు సేసెదవు?' అని నివారింపసాగిరి. 'బాల్యమందే తపోబలంబున దివ్యాస్త్రములు సాధించెదను. నిత్యము సన్నద్ధులు సైనికులు మననగరమునే కాపాడుచున్నారు, దీననే

తెలియదా మన రాజ్యమునకు శత్రువులు లేరని!' అని నిశ్చయమునుం బలికి తలిదండ్రుల వరలించి విద్యుద్ధ్వజుండు బ్రహ్మను గూర్చి తప మాచరించెను.

పండ్లు తిని మున్నూఱు వర్షంబులు, నీరు భోజనముగా మున్నూఱు, గాలి యోగికముగా మున్నూఱు, నిరాహారంబుగా మున్నూఱు, విద్యుద్ధ్వజుండు తపంబు సేయఁగా నలువ జగత్క్షోభణదక్షం బగు నత్తపం బాలోకించి వచ్చి యాతనికి బ్రాహ్మదశాస్త్రంబు లిచ్చెను. 'ఇది బ్రహ్మాస్త్రము, నూకలవడని వగు రుద్రుని పాశుపతాస్త్రంబునం దక్కఁ దక్కొంట నడంగదు. జయము కోరుదువేని నీవు దీనిని అకాలమునం బ్రయోగింపఁదగదు.' ఇట్లు చెప్పి బ్రహ్మ పోయెను. దైత్యుండును ఇంటికి వచ్చెను. అయ్యుత్సవమునకు వచ్చిన నిజబలంబుల నెల్లను దోడ్కొని తండ్రితోఁగూడ విద్యుజ్జిహ్వుఁడు ఇంద్రునిమీఁదికి దాడి వెడలెను. ఇతని రాక విని యింద్రుఁడు అమరావతికి తగినకాపు వెట్టి, తన మిత్త్రుని విద్యాధరేంద్రుని చంద్రకేతుని, అట్లే గంధర్వాధీశ్వరుని పద్మశేఖరుని, లోకపాలకులను దేవతలనుం, దోడ్కొని యుద్ధమునకు వెడలి వచ్చెను. విద్యుద్ధ్వజుండును దళములచే మింటిని చాటుసేయుచు వచ్చి యింద్రునిఁ దాఁకెను. ఆయాలంబుం జూడ బ్రహ్మరుద్రాదులు సయితము వచ్చిరి. ఇరుసేనలకును పోరారంభమాయెను. అస్త్రములు మింటం బర్వి ప్రొద్దును మఱుఁగుచేసి జగమెల్ల నంధకార మొనరించినవి.

కినుకగాలిచే కలగుం డగుచు వాహినీశత నిర్ఝరమై, గునుకు చున్న వాజి గజ గ్రాహంబులతో పోరఁగడలి యుప్పొంగు చుం డెను. దేవాసురులకు ద్వంద్వయుద్ధము పొసఁగగా ఇంద్రుని మీఁదికి విద్యుద్ధ్వజునితండ్రి విద్యుత్ప్రభుఁడు వచ్చెను. ఆయిర్వురు పురకును అస్త్రప్రత్యస్త్రయుద్ధమై అందు ఇంద్రుఁడు అసురుని యుద్రేకంబునకుం దాళఁజాలక వానిపై మగరాకైదువు విస రెను. దానిప్రేటునకు దైత్యుఁడు ఉసురెడలి కూలెను. అంతట విద్యుద్ధ్వజుఁడు కినుకరెట్టించి యింద్రుని మీఁదికి వచ్చి ప్రాణ సంశయము లేని తఱినే యాతనిమీఁద బ్రహ్మాస్త్రముం బ్రయో గించెను. ఱేఁతులును అసురోత్తములు ఱేఁటియస్త్రంబులు ప్రయోగించిరి. అంత నింద్రుఁడు ఈశ్వర దత్తమయిన పాశు పతాస్త్రమును ధ్యానించెను. అస్త్రంబు వచ్చి యెదుట నిలు వఁగా ఇంద్రుఁడు పూజించి పగతురపై వైచెను. అయ్యస్త్ర కాలాగ్ని చేత నయ్యాసురసైన్యమెల్ల క్షణములో కాలిపోయె ను. విద్యుద్ధ్వజుఁడు మాత్రము బాలుఁడగుటచే వానిని అస్త్రము కొట్టదాయెను. దాని వేఁడిమికి ఆతఁడు సొమ్మసిల్లి పడిపోయెను. ఏలన అయ్యస్త్రము బాలుని, వెన్నుచూపిన వానిని, తాఁకదు గదా. అంతట వేల్పులు జయ మొంది యం దఱును తమయిక్కల కరిగిరి.

విద్యుద్ధ్వజుండు చాలసేపటికి మూర్ఛ తేరి కుందుచుం బలాయితులై కలసికొన్న మిగతసైనికులతో నిట్లనియె:—

'మనము జయించియు ఓడితిమి, బ్రహ్మాస్త్రమును సాధించియు ఓడితిమి కావున మరల పోయి ఇంద్రునిం జేరి పోరి ప్రాణము లిచ్చివేసెదను. మూనాయన నిహతుఁడయి యుండఁగా నా యూరికి నేను పోనిచ్చగింపను.' ఇట్లు పలికిన విద్యుద్ధ్వజునిని తండ్రి మంత్రి ముసలియూతఁడు ఇట్లు మందలించెను 'నీ బ్రహ్మాస్త్రము అకాలప్రయుక్తమై శత్రుప్రయుక్తానాస్త్రములచే మందగించినది, ఇతరాస్త్రము నొల్లని శాంభవమహాస్త్రముచే నడంగిపోయినది. జయమొంది యున్న శత్రువును అకాలమందు ఆక్షేపించుట సరిగాదు. అట్లు చేసిన అతనికి వృద్ధియును తనకు నాశంబును గలుగును. ధీరుఁడు తన్ను కాచుకొని కాలమున బలముఁజెంది, వైరిమీఁద పగతీర్చుకొని లోకశ్లాఘనీయమైన యశమొందును.' అందులకు విద్యుద్ధ్వజుఁడు 'అట్లని రాజ్యరక్షార్థము మీరు పొండు, నేను పోయి విశ్వేశ్వరుని సాంబమూర్తినిగూర్చి తపస్సుచేసెదను.' అని చెప్పి అనుచరులను బలాత్కారంబున నివర్తించి, అయిదుగురనుమాత్రము మిత్రులను దైత్యపుత్రులను వెంటఁగొని కైలాసమూలమున గంగాతీరమున నెలకొని తపస్సుచేసెను. వేసవిలో పంచాగ్నిమధ్యంబునను, సీతున నీళ్లలోను, శివుని ధ్యానించుచు వేయియేండ్లు ఫలాహారుండును, వేయి మూలాశనుండును, మూఁడవవేయి వారి భక్షుఁడును, నాలవవేయి నిరాహారుండునై, తపముసేసెను. వర మిచ్చుటకై మరల బ్రహ్మ రాఁగా, 'నీవర ప్రభావము నేనెఱుం

గుదును, చాలు, వెళ్లుము.' అని పంపివేసి మరల నంతటి కాలము నిరాహారుండై తపస్సుచేయఁగా నవ్విద్యుద్ధ్వజుని శిర మునుండి గొప్పపొగ వెడలసాగెను. అంతట శంభుండు వచ్చి ఆతనిని వర మడుగు మనియె. 'ప్రభూ, నీప్రసాదంబున నేను పోర నింద్రుని చంపవలయును.' అని యసురుఁడు వేఁడెను. 'లే, చచ్చినవానికిని ఓడినవానికిని భేదము లేదు, కాన నింద్రుని పోర నీవోడించెదవు, అతనిపదంబున నుండెదవు.' అని యానతిచ్చి మహేశ్వరుఁడు అంతర్ధాన మొందెను. దైత్యుఁడును తనకోరిక నెఱవేఱిన దని తలఁచి పారణచేసి యింటికి పోయెను.

అచ్చట పౌరులును పైతృకుఁడయిన యా మంత్రియు సంతోషంబున నెదురువచ్చి విద్యుద్ధ్వజుని గౌరవించి యాతనికై మహోత్సవము సేసిరి. అందులకై యసురులెల్ల రాఁగా విద్యుద్ధ్వజుఁడు ఆసురసైన్యము నెల్ల యుద్ధసన్నద్ధము చేసి పోర సిద్ధపడు మని యింద్రునికి దూతను పంపి తానును సేనాధ్యానంపుఁబిడుగులచే చీలిక లయిన యాకాశమును టెక్కియంబులచే కప్పుచు స్వర్గ్యాపులకు నడలిడుచు తరలెను. ఇంద్రుఁడును వర మొందిన యయ్యసురునిరాకకు నడలి, గురువుతో నాలోచించి, వేల్పు మొదలను రప్పించెను. అంతలో విద్యుద్ధ్వజుండును వచ్చి చేర, నిరుసేనలకును తనవారు పగవా రను భేదము తెలియని సంకులయుద్ధము సముకొనెను. సుబా

హుండు లోనగునసురులు వాయువులతోను, పింగాక్షాదులు కుబేరులతోను, మహామాయాదులు అగ్నులతోను, అయఃకాయాదులు సూర్యులతోను, ఆకంపనాదులు సిద్ధులతోను, కొందఱు దైత్యేంద్రులు విద్యాధరులతోను, మఱికొందఱు గంధర్వాదులతోను ద్వంద్వయుద్ధ మారంభించిరి. ఇట్లు ఇరువదిదినములు మహారణము జరిగినది. ఇరువదియొక్కటవదినమున ఘోర నసురులు సురలను పగులఁగొట్టిరి. అంతట సురలు విఱిగి పాఱి స్వర్గముం జొచ్చిరి. అంత వాసవుఁడు ఐరావతము నెక్కి స్వయముగా పోరం దరలెను. అతని చుట్టును దేవసైన్యములు నడచినవి, చంద్రకేతు ప్రభృతి విద్యాధరేశ్వరులును ఇంద్రునిబలంబున నడచిరి. అంతట సురాసురసంక్షయకారియగు మహారణము పాసంగఁగా విద్యుద్ధ్వజుఁడు తనతండ్రిని చంపిన పగచే నింద్రుని మార్కొనెను. ఇంద్రుఁడు తనయస్త్రములను ప్రత్యస్త్రములచే నడంచుచున్న విద్యుద్ధ్వజుని ధనుస్సును పల్మారు బాణములతో తెగఁగొట్టెను. అంతట నసురమహేశ్వరవరముచే దుర్జయుఁడై ఇనుపగుదియం గేలఁ గొని పరువున నింద్రునిమీఁదికి వచ్చి ఐరావణముకోఱలపై క్రాల్గించి కుంభముమీఁదికి నుఱికి మావటీని త్రచ్చి, ఆగుదియతో నింద్రునిఁ గొట్టెను, ఇంద్రుఁడు రోఁకటితో దాని నడిచెను. విద్యుద్ధ్వజుఁడు వెండియు గుదియతో వ్రేసెను. ఆ వ్రేటున కింద్రుండు సొమ్మసిల్లి వాయుదేవుని రథమునం బడి

యెను వాయు వాతని మనోవేగమయిన యారథంబున నొం
డెడకుం గొనిపోయెను. విద్యుద్ధ్వజుండు వెనుకకు మరలెను.
'ఇది కాలము గాదు, పోరినుండి యింద్రుని త్వరగా గొని
పొండు,' అని ఆక్షణంబున నాకాశవాణి పలికెను. అట్లే
వాయువు రథవేగంబున నింద్రుని గొనిపోవుచుండఁగా, విద్యు
ద్ధ్వజుండు రథమెక్కి యాతనిం దఱుముకొనివచ్చెను. అంతట
నైరావణము కోపగించి నిరంకుశముగా నడ్డము వచ్చి సేనల
నెల్ల ద్రొక్కి త్రచ్చి తఱిమి యింద్రునికడ కేఁగెను. అంతట
వేల్పులదండు పోరు ఱజ్జగించి యింద్రునితోఁ బోఁగా భయా
తురను శచీదేవిని బృహస్పతి గొనిపోయి బ్రహ్మయింట నుం
చెను అంతట విద్యుద్ధ్వజుండు జయ మొందినవాఁడై పాడుగా
విడువఁబడిన యమరావతిని నిజసైన్యంబులతో సింహనాదం
బులు సేయించుచు జయభేరులు మ్రోఁగించుచుం బ్రవేశించెను.

ఇంద్రుఁడు మూర్ఛ తేరి తనకు కాలము గామి నెఱింగి
వేల్పు లందఱితోను ఆబ్రహ్మయింటికే చనియెను. 'ఇవు డిది
హరునివరప్రభావము, శోకింపకు, వెండియు నీపదవిని నీవు
పొందుదువు,' అని యింద్రుని నలు మొగంబులదేవర ఓదార్చి
బ్రహ్మలోకైకదేశంబున సమాధిస్థలం బనుపేర నొప్పు నొక్క
తావుకు సర్వసౌఖ్యావహం బగుదానిని నివాసముగనొసం
గెను. అందు దేవేంద్రుఁడు శచైరావణసంగతుఁడై నివసిం
చెను. అతని మానతిని విద్యాధరేశ్వరులెల్ల వాయులోకమున

కును, గంధర్వపతులు అప్రధృష్యం బగుసోమలోకమునకును, ఇతరులు తమతమనెలవులు వీడి ఒండులోకములకును, చనిరి. విద్యుద్ధ్వజుండును స్వర్గములో దేవతలభూమినెల్ల తనుకు కొట్టించి ఆక్రమించి నిర్మర్యాదంబుగ రాజ్యము ననుభవించు చుండెను.

ఈలోపల కథాసంధిలో వాయులోకములో చిరకాల ముండి విసిగి విద్యాధరేశ్వరుఁడు చంద్రకేతుఁ డిట్లు చింతిం చెను:—'శాపదవిం గోలుపోయి ఎంతకాలము ఇట నిట్లుం దును! మాదాయకు విద్యుద్ధ్వజుని కిప్పటికిని తపఃక్షయము లేదు, నాచెలికాఁడు గంధర్వరాజు పద్మశేఖరుఁడు సోమలోక మునుండి తపస్వియై శివపురమునకుం జనియె నని వింటిని. అతనికి పరమేశ్వరుఁ డింకను ప్రసాదము చేసినాఁడో లేదో తెలియదు. దానిని ముం దెఱింగెద, అనంతరము నే నేమి సేయ నగునో యూహించెద.' ఇట్లని తలపోయుచుండఁగా నాతనికడకు మిత్త్రుఁడు ఆగంధర్వరాజు శివునివలన వరంబులు పడసి వచ్చెను. చంద్రకేతుఁడు చెలికానిని కవుంగిలించి స్వా గతము సేసి వృత్తాంత మడుగ, గంధర్వరా జిట్లు వక్కాణిం చెను:—'నే నరిగి శివపురంబున తపస్సుచే శంకరుని మెప్పించి తిని. అద్దేవుఁడు వత్సా, నీకు ఉత్తముఁడు కొమారుఁడు కలు గును, మరల నీరాజ్యము వచ్చును, విద్యుద్ధ్వజాంతకునికి వీర పత్నియగు కన్యయు సర్వోత్తమురాలు కలుగును.' అని నాకు

వరంబు లిచ్చెను. ఈవృత్తాంతము నీకుఁ జెప్ప నే నిట కేతెంచి తిని." గంధర్వరా జిట్లు వచింపఁగా చంద్రకేతువు పలికెను.— 'నేనును ఈదుఃఖమున కంతముగా మహేశ్వరు నారాధింపఁ బోయెద, ఆయన నారాధింపక కోరికలు సిద్ధింపవు గదా.' చంద్రకేతుఁ డిట్లు నిశ్చయించుకొని భార్యను ముక్తావళిం దో డ్కొని తపస్సుకై శంభునియాదివ్యక్షేత్రమున కటుం బోయెను. పద్మశేఖరుండును తన వరవృత్తాంతమును ఇంద్రునికి చెప్పి శత్రునాశమున నమ్మకము కలిగి సోమలోకమున కేఁగెను. అల్లసమాధిస్థలంబున సురపతియు శత్రునాశమందు నమ్మకము కలవాఁడై బృహస్పతిని తలంచెను. బృహస్పతియు వచ్చెను. ఇంద్రుఁ డాయనకు మ్రొక్కి సత్కరించి యిట్లు విన్నవించెను. 'గురూత్తామా, పద్మశేఖరునితపస్సునకు మెచ్చి శివుఁడు విద్యు ద్ధ్వజునిం గూల్చువా డల్లుఁ డగునట్లు వరమిచ్చినాఁడు. కాన మన కెల్ల నీకష్టము తీఱెడును. కాని నేను ఇంత కాలము నిజ పదవింగోలుపోయి కరము నిర్విణ్ణుఁడనై యున్నాఁడను. కావున స్వామీ, శీఘ్రకారి యగు నుపాయమును తలపోయుఁడు.' బృహస్పతి యిట్లనియె.— 'ఆశత్రునికి తన చెడుచేఁతలచేత నే తపఃక్షయము సంప్రాప్తమైనది. కావున నిదే మనము జత నడపవలసినయదను. కాన, పోయి బ్రహ్మదేవుని అడుగుదము, ఆయన యుపాయము చెప్పును.' అంత నింద్రుఁడు గురుసహా యుఁడై బ్రహ్మను దర్శించి ప్రణమిల్లి తనరాకకు కారణ మెఱిం

గించెను. నలువ యిట్లానతిచ్చెను. 'ఈచింత నాకుమాత్రము
లేదా? మఱి యేమన, శంభుకృతముం దప్పింప శంభుఁడే
దంట అదేవునిం బడయఁ దడ వగును: కాన ఆయనకన్న
నన్యుఁడు గాని హరికడ కేఁగుదము రండు. ఆయన యుపా
యము సెప్పును.

ఇట్లు కలయఁబలికికొని బ్రహ్మయు నింద్రుండును సుర
గురుండును మువ్వురును అంచ నెక్కి శ్వేతద్వీపంబున కరిగిరి.
అందు జనులెల్ల చతుర్భుజులై శంఖచక్రపద్మగదాధరులై మూ
ర్తులందే గాక చిత్తంబులందును భగవన్మయులై యుందురు.
అచట నమ్మువ్వురును గొప్పరతనాలలోఁగటిలో సిరి యడుగు
లొత్తుచుండ పాపఱేనిపై పవళించియున్న హరిని దర్శించి ప్రణ
తులై ఆయనవలన యథార్హసత్కారంబు లంది, అచటి దేవ
ర్షులచే వందితులై యథోచితంబుగఁ గూర్చుండిరి. భగవం
తుఁడు కుశలం బడుగ నవ్వేల్పులు 'దేవా, విద్యుద్ధ్వజుఁ డుం
డఁగా మాకు కుశల మెక్కడిది? వాఁడు మాకొనర్చెడియొగ్గు
లెల్ల దేవర కెఱుకయే, అందులకే యీమారాక, అటుపై
దేవర ప్రమాణము,' అని చెప్పుకొనిరి. జనార్దనుం డిట్ల
నియె.—'ఎఱుఁగ కేమి! అయ్యసుర నాస్థితిని సయితము భంగ
పఱిచినాఁడు. కాని, త్రిపురాంతకుఁడు స్వయముగా చేసిన
దానిని మార్పుటకు నావలనఁగాదు, ఆయనవలననే పాపా
త్ముని కాదైత్యునికి వినాశము కలుగును. మీరు త్వరపడియెద

లేని ఉపాయం బొందు చెప్పెద వినుఁడు. సిద్ధీశ్వర మను పేర శివక్షేత్రము దివ్య మొండు కలదు. అందు హరుఁడు సదా వెలసి సుగముఁడై యుండును. ఆవిభుఁడు మున్ను నాకును అప్పటి బ్రహ్మకును జ్వాలాలింగరూపము జూపి ఈరహస్యము ననుగ్రహించెను. కావున రండు పోయి యా దేవునే తపస్సు చేసి వేఁడుదము, అతఁడే యీజగదుపద్రవము నడంచివేయును.'

హరి యిట్లు చెప్పఁగా నందఱును హంసగరుడాది యానంబుల సిద్ధీశ్వరంబునకుఁ బోయిరి. అందు జరామరణరోగంబులు లేవు, సుఖముల కెల్ల నదియే యిల్లు, అచట మృగములు పులుఁగులు చెట్టులు సయితము సువర్ణరత్నమయములు; అట్టి యాక్షేత్రమున వారు క్షణక్షణమునకును ఒక్కొక్కనికిని వెవ్వేలు రూపంబుల నగపడుచున్న శూలిని వేలు వేలురతనాల లింగంబులం గొలిచి తదేకచిత్తులై హరిబ్రహ్మేంద్ర బృహస్పతులు నల్వురును కడిందితపం బొనరించిరి. ఈ లోపల హరుఁడు విద్యాధరేశునికి చంద్రకేతునికి తీవ్రతపస్తుష్టుఁడై 'రాజా, లే లెమ్ము, నీకు మహావీరుఁడు కుమారుఁడు జనించును, మీమార్తుని విద్యుద్ధ్వజుని మడియించును; శాపవశంబున మర్త్యత్వ మొంది అందు దేవహితము సాధించి గంధర్వరాజు కూఁతు రగు పద్మావతి తపోబలంబున వెండియు నిజపదమును బొంది ఆమె చె భార్య గాఁగా తత్సహితుఁడై విద్యాధర సామ్రాజ్యమును పదికల్పము లనుభవించును.' అని వరం బొసం

గెను. అంత చంద్రకేతుఁడు సభార్యుఁడై వెండియు వాయు లోకమున కరిగెను. అనంతర మప్పరమేశ్వరుఁ డానలువురకును తపస్తుష్టుఁడై లింగములో నగపడి యిట్లనుగ్రహించెను:— 'లెండు, క్లేశము మానుఁడు, మీవాఁడు విద్యాధరేంద్రుఁడు చంద్రకేతువు నన్ను తపంబునం దనిపించినాఁడు. నాయంశమున నాతనికి వీరుఁడు కుమారుఁడు జనించును, ఆకుమారుఁడు త్వర లోనే విద్యుద్ధ్వజుని పోరం బరిమార్చును. అనంతరము వేల్పుల పనియే మఱియొకటి చక్కఁబెట్టి శాపవశంబున మనుష్యత్వ మొంది యుండు నావీరుని పద్మశేఖరగంధర్వునికూఁతురు పద్మా వతి యుద్ధరించును. ఆతఁడు గౌర్యంశంబునఁ బుట్టినదైన యప్ప ద్మావతిం బెండ్లియై విద్యాధరసామ్రాజ్య మేలి నన్నుం గల యును. కావున ఇంచుక యోరిమి గలుగుఁడు, మీకోరిక తీఱి నట్టిదే.' ఇట్లు అచ్యుతాదులకుఁ బలికి శివుఁ డంతర్ధానమాయె ను. అంతట హృష్టులై హరియు బ్రహ్మయు ఇంద్రుఁడును బృహ స్పతియు తమతమ తావుల కరిగిరి.

ఇట్లుండ చంద్రకేతువిద్యాధరేంద్రునిభార్య ముక్తావళి గర్భిణియై కాలమున పుత్త్రునిం గనియెను. ఆశిశువు దుర్ధర్షం బగు నిజతేజంబున దిక్కులెల్ల వెలిఁగించుచు జామనోపద్రవశాం త్యర్థ ముదయించిన బాలార్కుం డన శోభిల్లుచుండెను. ఆతఁడు పుట్టఁగానే 'ఓయి చంద్రకేతుఁడా, నీసుతుఁ డితఁడు విద్యు ద్ధ్వజాసురుని సంహరించును, మార్తురగొంగ యగు వీనిపేరు

ముక్తాఫలకేతువు.' అని యాకాశవాణి సోత్సవుని చంద్రకేతుం బలికి విరమించెను, దివినుండి పూలవాన గురిసినది. వృత్తాంత మెఱిఁగి పద్మశేఖరుఁడు నింద్రుండును ఇంక దాఁగియున్న కడమ సురులును అటకు వచ్చి హరునికరుణ నొండొరులతోఁ గొని యాడికొనుచు ఉత్సవ మనుభవించి తమ తావుల కరిగిరి. ముక్తాఫలకేతుఁడును క్రమముగా నెల్లసంస్కారంబులం బొంది వేల్పుల యానందముతోఁ గూడ వర్ధిల్లు చుండెను. ఇట్లుండ, పద్మశేఖరునికి పుత్త్రోత్పత్త్యనంతరము, కౌమారిత పుట్టెను. ఆ సమయమున నశరీరవాణి యిట్లు పలికెను—'గంధర్వ రాజా, నీకూఁతు రీకన్య పద్మావతీ నామధేయ, విద్యుద్ధ్వజాంత కునికి విద్యాధరచక్రవర్తికి భార్యయగును.' పద్మావతియు క్రమముగా పెరుఁగుచుండెను. చంద్రలోకంబునం జనించుటంజేసి యంటుకొని తరఁగలెగయుచున్న యమృతమో యన లావణ్య రస మామెమేన నిగ్గులువాఱుచుండెను ఆముక్తాఫలకేతుఁడు బాలుఁడ యయ్యును మహాత్ముఁడై సదాశివమయుండై వ్రతోపవాసాదికములం దపంబు సేయుచుండెను.

ఒకప్పుడు ఆకుమారుఁడు ధ్యానైకనిష్ఠుఁడై పండ్రెండు దినము లుపవసింపఁగా గిరిజావల్లభుఁడు ప్రత్యక్షమై యిట్లు వర మిచ్చెను:—'వత్సా, నీభక్తికి మెచ్చితిని, నాప్రసాదంబున నీకు సకలాస్త్రంబులును, సకల విద్యలును సకలకళలును ఆవిర్భవించును. ఇదిగో అపరాజిత మనువేరి యీకత్తిం బుచ్చుకొమ్ము,

దీనను శత్రుప్రలపనన నోటమి యెఱుంగక సామ్రాజ్యముం బొందుదువు.' ఇట్లు పలికి దేవుఁ డాతనికి కత్తి యిచ్చి యదృశ్యుఁడాయెను. వెంటనే ఆరాసుతుఁడు మహాస్త్రబలవిక్రాంతుం డాయెను.

ఆనడుమ నొకనాఁడు ఆవిద్యుద్ధ్వజమహాదైత్యుఁడు వేల్పులతాపలంబున మిన్నేటినీట జలవిహారము సల్పుచుండెను. అంతలో వల లుప్పతిల్లినవి, నీరు పుప్పొడిచే పసుపై ఏనుఁగు మదము వాసన కొట్టసాగినది. దానిం గని దైత్యుఁడు భుజబల మదంబున నుబ్బొంగుచు లెంకలం జీరి 'నాకంటె పై నెవఁడురా నీటఁ గ్రీడించు వాఁడు? పోయి కని రండి.' అని మొదల పెట్టెను. వారు ఎగువకుం బోయి కనునంత నచ్చట ముక్కంటి బసవఁడును ఇంద్రుని యేనుంగును ఈఁదు లాడుచుండినవి. కని మరలి అసురభటులు హరవృషభంబును ఇంద్రేభంబును కలసి ఎగువను జలక్రీడం దేలుచున్నవనియు, బసవని పూఁదండలచేతను ఏనుఁగుమదముచేతను నీరట్లయినదనియుం, దెల్పిరి. అంత నసురుఁడు మదంబునంజేసి శంకరునిసైతము సరకుగొనక కోపంబు దీపింప దుష్కృతపరిపాకము మూఁడఁగా బంట్లకు ఆయెద్దును ఏనుఁగును గట్టి తెమ్మని యాజ్ఞాపించెను. వారు పట్టరాఁగా నా రెండును పరువులు వాఱి సమయించినవి. చావఁగా మిగిలినవారు పోయి ఆవృత్తాంతము దొర కెఱింగించిరి. అంత నాదైత్యేంద్రుఁడు మఱియుం గనలి వానిమీఁదికి

గొప్పయసురసైన్యముం బంపెను. ఆసైన్యమెల్ల పాకశాసనుని పాకం బునం జేసి యారెంటివలన నుగ్గునూచమాయెను. ఎద్దు వారుని కడకు, ఐరావణ మింద్రునికడకును పోయినవి. ఇంద్రుఁడు ఆదైత్యుని దుర్ణయమును ఐరావణముకాపరులవలన విని, గౌరీపతిని తిరస్కరించినందున వానికి క్షయకాలము వచ్చినదని నిశ్చయించుకొని, బ్రహ్మాసుం దెలిపి విద్యాధరాధిపప్రముఖులను దేవసైన్యములను తోడఁగొని ఐరావణము నెక్కి శచీరచిత మంగళుఁడై శత్రువిజయార్థము తరలెను.



3-వ తరంగము.



హరానుగ్రహంబున నుత్సాహవంతంబులై బలంబులు కాలబలంబు నొంది తోడ్పడఁగా నింద్రుఁడు స్వర్గమునకు ముట్టడి వేసెను. అంతట విద్యుద్ధ్వజుఁడు సేనాజాలం దీర్చుకొని వెడలెను. దుర్నిమిత్తము లుప్పతిల్లినవి. వానిని సరకుసేయక యసుర చిహ్నాకు నడచెను. వాని టెక్కెయంబుపై మెఱపులు పడినవి, పైని గద్దలు సుడియఁ దొడంగినవి. గొప్పగొడుగులు చినిఁగిపోయినవి. నక్కలు అమంగళముగా ఊళవెట్టినవి. 'ఏమి ముక్తాఫలకేతువు ఇంకను రాఁడు ?' అని యింద్రుఁ డడుగఁగా చంద్రకేతుఁడు 'దేవేంద్ర, నేను త్వరపడి వచ్చుచు నాతని తోఁ చెప్ప మఱచితిని, అతఁడు తెలిసికొని త్వరగా వచ్చును,

సంశయింపంబనిలేదు' అని యుత్తరము చెప్పెను. అంతట నిం
ద్రుఁడు ముక్తాఫలకేతుం దోడితేర వాయుసారథికమయిన
మేటియరదముం బంపెను. తండ్రి చంద్రకేతుఁడు తన కుమా
రుం దెమ్మని తన ప్రతీహారుని ససైన్యుని ఆమరదము వెంటఁ
బంపెను. ఈలోపల ముక్తాఫలకేతుఁడు తనతండ్రి దైత్యుని
తో యుద్ధమాడఁ బోయిన వృత్తాంతము విని తాను ననుచర
సహితుఁడై పోయి తండ్రిం గలసికొనం గడంగి జయగజంబు
నెక్కి జనసీరచితమంగళుఁడై ఈశ్వరదత్తమయిన యాఖడ్గము
నపరాజితమును జైకొని, తనపై దివినుండి పువులవానలు
గురియ, దేవదుందుభులు మ్రోఁగ, గాలి మంగళకరముగా
వీవ, వాయులోకమునుండి తరలెను. విద్యుద్ధ్వజునివలన భీతిల్లి
అటనట వేల్పువెఱన లెల్ల దాఁగియుండిన మేఘవన మనుపేరి
గొప్పగౌరీనిలయమును దారిలో కాంచి దానిని పైనుండి దాఁ
టక భక్తిమెయి నేనుంగును దిగి దివ్యకుసుమంబులు కోసి దేవిని
పూజింపఁ దొడంగెను.

ఈలోపల గంధర్వపతిపద్మశేఖరుని కూఁతురు పద్మా
వతియు ఎలజవ్వన మొలయ సకియంగూడ కొని చని తనతల్లిని
యుద్ధగతుఁడైన భర్తమేలుకై తపస్సు చేయు చున్నదానిని
వేడుకొని యనుజ్ఞ నొంది విమానంబున చంద్రలోకంబునుండి
లేచి తండ్రికిని తాఁ గోరిన వరునికిని బవరంబున జయము గలుగు
నట్లు తపస్సు చేయునదై ఆగౌరిదేవళమునకే వచ్చెను. 'సఖి,

నీ కింక వరుఁడు నిశ్చితుఁడు కాలేదు. అట్లుండ నతనికి యుద్ధము లో జయ మన నేమి? మీనాయనమేలుకై మీయమ్మ తపస్సు చేయుచునే యున్నది. కన్యవు నీవేల తపస్సు చేసెదవు?' అని దారిలో సఖి యడుగఁగా, పద్మావతి ఇట్లనియె:—'కులకన్యలకు తండ్రియే సకలసిద్ధు లొసంగు దైవతము. మఱి, అనన్య సామాన్యగుణోత్తరుఁడు వరుఁడును నాకు నిశ్చితుఁడే. విద్యు ద్ధ్వజుని బరిమార్చుటకు పుట్టియున్నాఁడే ముక్తాఫలకేతువు విద్యాధరకుమారుఁడు అతఁడు నాపతి యని శంకరుఁడు అను గ్రహించియున్నాఁడు. ఈవృత్తాంతమును మాయమ్మ యడు గఁగా మానాయన చెప్పఁగా నేను వింటిని. ఆనావరుఁడు సం గ్రామమునకుం బోయెనో పోవునో నిశ్చయము. కావున నేను ఆయనకును నాయనకును జయముగునట్లుగా గౌరినిఁ గూర్చి తప ము సేసెదను' పద్మావతి యిట్లు వచింపఁగా చెలి 'మంచిది, తప్పక జరుగనున్నదాన నైనను ఈయర్థంబున నీకడంక కొని యాడఁదగినదే. కావున నీకోరిక నెఱవేఱునుగాత.' అని యను మోదించెను.

అంతఁ బద్మావతి గౌర్యాలయముచెంగటి గొప్పకొలని కడ కేఁగెను. ఆమెనెమ్మోమునుండా మరనుండి పర్యాజగ మెఱుంగు వలనఁ బూతగొన్నదియుఁ బోలె నక్కొలనెల్ల తామరలు కాంచనమయంబులు నిండి యుండినది. అట విమానమునుండి డిగి కొలనినుండి యమ్మవారిపూజకై తామరలం గోసి స్నానా

ర్థము దిగునంతలో, పాలతిండిపోతులు రక్కసులు దేవాసుర రణంబుఁగూర్చి యాదారిని పాలు తెంచుచుండిరి. వారిలోనుండి యిరువురు రక్కసులు కడిందికోఱలనోటినుండి వెలువడునగ్గి మంటలచే చందుర కావివన్నియం దొరసి మెఱయునిలువు తల వెండ్రుకలతో పొగనలుపు టొడళ్లతో వ్రేలాడుచనుగడుపుల తోను వచ్చి యప్పద్మావతిం గని పట్టుకొని మింటి కెగసిరి. విమా నాధిదేవుఁడు వారి నడ్డగించునంతలో, ఆమె పరిజనము మొఱ యిడునంతలో, దేవళమున ముక్తాఫలకేతుఁడు పూజ ముగించు కొని వెలువడినవాఁడు ఆమొఱ విని ఆచక్కటి కేతెంచెను. అట ముక్తాఫలకేతుఁడు కాఱుమబ్బునడిమి మెఱుపుఁదీఁగవోలె రక్కసలనడుమ దీపించుచున్న యా లోకోత్తరలావణ్యవతిం గని మహావీరుఁ డుద్దవిడి నెగసి రక్కస లిరువురను చేతి వ్రేటున నొక్కటనే చేతన యొడలించి నేలం గూల్చి పద్మా వతిని విడిపించెను. త్రివళీతరంగంబులతోడినడు మొప్పు లావ ణ్యవాహిని నప్పద్మావతిని, బ్రహ్మదేవుఁడు అమరవధూటులం జేసి యలవరించుకొన్న నేర్పున నిండుచక్కఁదనంబుల సారం బులం జేసెనో యన నున్నదానిని, గన్గొనినంత, ముక్తాఫల కేతుండు మరుశారసములకు గుఱి యై ధీరుఁడయ్యును క్షణము చిత్తరువో యన చలన మేది చూచుచుండెను. రక్కసలవల నియలజడి శమించినంత పద్మావతియు లోకులకనులపండు వును వనితాజనమునకు వెత్తె యిడువానిని ఇందుకందర్పులం

గలపి బ్రహ్మ యొక్కనిగాఁ జేసిన ట్లున్న వానిని ముక్తాఫలకేతునిం గనుఁగొని లజ్జానమ్ర వదన యై చెలితో 'ఈయనకు మేలు గలుఁగును గావుత, పరపురుషుని సమీపమునుండి పోయెదను' అనియెను. ముక్తాఫలకేతుఁడు ఆమె చెలిని 'మీసఖి యేమన్నది?' అని యడిగెను. 'ఈమె సత్కన్యక, ప్రాణము గాచిన యతనికి నీకు దీవన లిచ్చి పరపురుషుని సమీపమునుండి పోదము రమ్మని నన్ను పిలిచినది' అని సఖి పలికినది. ముక్తాఫలకేతుఁడు వేగిరపాటు దోఁప 'ఈమోహనాంగి ఎవరు ? ఎవరి కూఁతురు? ఏపుణ్యవంతునికి కీఁబడినది?' అని సఖి నడిగెను. 'సౌభగుఁడా; ఈమా చెలి పేరు పద్మావతి, ఈకన్య గంధర్వరాజు పద్మశేఖరుని కూఁతురు, ఈమెకు విద్యాధరేంద్రుఁడు చంద్రకేతుని తనయుఁడు జగదేకవల్లభుఁడు వేల్పుతేఁతోడు విద్యుద్ధ్వజవినాశకుఁడు ముక్తాఫలకేతుఁడు మగఁ డగు నని శంకరు నాదేశము. ఈమె యుద్ధములో భర్త కాతనికిని తండ్రికిని జయము వేఁడి ఇట గౌరీదేవళంబునం దపముసేయ వచ్చినది.' అని సఖి యుత్తరము చెప్పినది అంతట ముక్తాఫలకేతుని యనుచరులు రాజకుమారిని 'ఆహా, దేవీ, ఆతఁడే యీయన నీభర్త,' అని చెప్పి ప్రమోదాంబుధిం దేలించిరి. అంత నక్కన్యావరులు ఒండొరుల నెఱింగిన హర్షము నిండిన తమ యొడళ్లయందు తాము ఇముడ లేమి వింత గాదు గదా.

అట్లయ్యిరువురును ప్రేమ దొరలు సగసగంపుటార చూపుల నొండొరులం జూచుచు నయ్యెడబాలుపునకు వెఱఁగు పడుచుండునంతలో, వాద్యములమ్రోఁత వినవచ్చెను; వెంటన సైన్యము కానవచ్చెను; వాయుసారథికంబు అరదం బటుతర్వాత కానవచ్చెను; దాని వెంబడి చంద్రకేతు ప్రతీహారుండు నగ పడెను. అంత వాయుప్రతీహారు లిరువురును వినయంబున వాహనంబులు డిగ్గనుఱికి ముక్తాఫలకేతుం దఱిసి 'మహావీర, నిన్ను దేవేంద్రుఁడు పిలుచుచున్నాఁడు, మీనాయనయు కోటలనుండి ఎదురు సూచుచున్నాఁడు, ఈయరదంబు నెక్కి త్వరగా నీవు రావలయును.' అని పల్కిరి. అంతట పద్మావతి నెయ్యపుం ద్రాటఁ గట్టువడియు, ముక్తాఫలకేతుఁడు కార్యగౌరవంబునం జేసి అయ్యిరువురతోఁగూడ నయ్యరద మెక్కెను. ఇంద్రుఁ డంపిన దివ్యకవచము దొడిగి పద్మావతిని తిరిగి తిరిగి చూచుచు తరలెను. పద్మావతియు చేతియొక్కవ్రేటున నిరువురు రక్కసులం గూల్చిన యావీరుని ప్రాణవల్లభుని కంటి కగపడునంతవఱకుం జూచి అతనినే ధ్యానించుచు కొలన జలకమాడి అంబికాహరు లను పూజించి అప్పటినుండి తండ్రికిని వరునికిని జయంబుగా తపస్సు చేయుచుండెను.

ముక్తాఫలకేతుండును మంగళకరమై విజయము చెప్పిన యప్పద్మావతీ దర్శనమును తలపోయుచు ఆదేవాసుర సంగ్రామంబునకు చనియెను. చక్కఁగా సన్నద్ధుఁడై దండుతో వచ్చిన

యావీరుం గని అసురవీరులెల్ల నొక్కుమ్మడి నాతని మీఁదికే వచ్చిరి. ముక్తాఫలకేతుఁడు వారితలకాయలను అలుఁగులవానచేఁ దునిమి యుద్ధోత్సవారంభంబున దిగ్దేవతలకు బలిచల్లెను. బలం బునెల్ల నాతఁడు సమయించుచుండం గని కోపావేశతరళితుండై విద్యుద్ధ్వజుఁడు తాను స్వయముగా నతనిని మార్కొనెను. చంద్రకేతు తనయుఁడు ఆదైత్యుని మునుమున్నె బాణంబులం గొట్టినకతమున అసురసేనయెల్లనాయొక్కనినే చుట్టవేసికొనెను. దానిం గని వేల్పుతేఁడు సిద్ధగంధర్వ విద్యాధర సుర సమన్వితుండై అయ్యాసురసైన్యము మీఁదికి నడిచెను. అంతట బాణములు ఈఁటెలు ఇనుపగుదియలు అడ్డకత్తియు నివియ కానిపింప సంకుల సమరమాయెను. లెక్కలేక వీరభటులుం మడిసిరి. గజహయంబుల కాయంబులె మొసళ్లుగా, ఏనుఁగు ముత్తియంబులె యిసుముగా, వీరుల తలకాయలే గండశిలలుం గాఁగ, నెత్తురుకేఱులు ప్రవహించినవి. నల్లసుర ద్రావి మత్తిలి పొల యారగించి యట్టలతోఁ గలసి నట్టువ లాడుచున్న భూతములకు ఆపోరు పెనుఁబండువాయెను. ఆయుద్ధసముద్రములో మహోర్మిచపలయై జయలక్ష్మి క్షణ మిటు క్షణ మటు నొఱగు చుండెను.

సురాసురుల నడుమ ఇవ్విధమువున ఇరువదినాలుగు దినములు పోరు నెగడెను. చదల విమానంబులనుండి హరిహర బ్రహ్మలు పరికించుచుండిరి. ఇరువదియేనవ నాఁడు ఇరుసైన్యం

బులును పలచఁబడినవి. అంతట ప్రధానులకు ద్వంద్వయుద్ధము సమకొన, ముక్తాఫలకేతునికిని విద్యుద్ధ్వజునికిని అతఁ డరదంబునను ఈతఁడు ఏనుఁగుమీఁదనుంగా ఉద్ధిపడెను. ముక్తాఫలకేతుఁడు చీఁకటియస్త్రమును ప్రాద్యుమనస్త్రముతోను, చలియస్త్రమును వేసవియస్త్రముతోను, కొండలయస్త్రమును మగరాయస్త్రముతోను, పాముఁనస్త్రమును గరుడియస్త్రముతోను, నివారించి, దైత్యేంద్రునిమావటీని ఒక యేనుఁగునను ఏనుంగునొక్కయేల్గునను గూల్చెను. అసురుఁడు అరదమెక్కఁగా రాజకుమారుఁ డతనిసారథిని గుఱ్ఱములను చక్కాడెను. అసురమాయ యవలంబించి కంటికి కానరాక మింట నిలిచి దేవసేనమీఁద తాలును నానాస్త్రంబులను గురియసాగెను. ముక్తాఫలకేతుఁడు దేవసేనచుట్టును అభేద్యమయిన శరపంజరము కట్టెను. దానిని దైత్యుఁడు నిప్పుకవానచే నేర్చెను. అంత ముక్తాఫలకేతుఁడు సర్వలోకక్షయసుదక్షంబయిన బ్రహ్మాస్త్రమును స్మరించి దాయపైఁ బ్రయోగించెను. దాన ససైన్యుఁ డావిద్యుద్ధ్వజమహాసురుఁడు ప్రాణము లెడలి చదలినుండి క్రిందఁబడియెను. వాని సుతులు వజ్రదంష్ట్రాదులతోఁ గలసి భయపలాయితులై పాతాళంబు జొచ్చిరి.

దేవతలు నాందీవాద నానంతరము బళిబళి యని పొగడుచు ముక్తాఫలకేతునిపై పుష్పవర్షంబులు గురిసిరి. ఇట్లు శత్రువు మడియఁగా ఇంద్రుఁడు మరల స్వర్గరాజ్యముం బొంది

నవాఁడై యమరావతిం బ్రవేశించెను. ముల్లోకములందును నహీనోత్సవమాయెను. శచిం దోడ్కొని ప్రజాపతి స్వయముగా వచ్చి ముక్తాఫలకేతునికి చూడారత్నోత్తరమును కట్టెను. దేవేంద్రుఁడు తనమెడ నున్న హారమును తీసి తనకు రాజ్యప్రదాయి యగునప్పకుమారుని మెడను వైచెను; తనపీఠమునకు సరి యైన పీఠంబున నాతనిం గూర్చుండఁ బెట్టెను. వేల్పులెల్ల ఆనందపరిపూర్ణులై యప్కుమారునికి నానావిధాశీర్వాదంబు లొసంగిరి. ఇంద్రుఁడు విద్యుద్ధ్వజాసురుని వీటికి ప్రతీహారునిఁ బంపి తన్ముఖంబుగా దానిని స్వాధీనపఱుచుకొనెను. అంత నారాకొమరునికి తనతనయను పద్మావతి నీఁదలంచి పద్మశేఖరుఁడు సాభిప్రాయంబుగా బ్రహ్మదేవుని ముఖంబుం బరికించెను. బ్రహ్మయు నాతని తలం పెఱింగి 'కొంచెము తాళుము, ఇంక పని కడమ యున్నది,' అని చెప్పి నివారించెను. అనంతరము హాహాహూహూవుల పాటలతో రంభాదులయాటలతో నచట నింద్రుని విజయోత్సవము ప్రవర్తిల్లెను. అయ్యుత్సవప్రమోదముం గాంచి నలువ పోయిన తర్వాత ఇంద్రుఁడు లోకపాలప్రభృతులను సత్కరించి వారి వారి తావలమునకుం బంపివేసెను; గంధర్వరాజును పద్మశేఖరుని సమ్మానించి గంధర్వనగరమునకుఁ బోవ ననుజ్ఞ యిచ్చెను; ఆముక్తాఫలకేతుని చంద్రకేతుని సత్కరించి విద్యాధరపురమునకు ఉత్సవ మనుభవింపఁ బంపెను.

ఇట్లు లోకకంటకుని సంహరించి ముక్తాఫలకేతుఁడు పెక్కురు వెంటఁగొలువ తండ్రితోఁగూడ విద్యాధరరాజధాని కేఁగెను. తండ్రితోఁగూడ గెలుపుగొని రాజకుమారుఁడు చిర కాలమున కిట్లు రాఁగా నన్నగరి వరరత్నభూషణయు ధ్వజ పట్టాంశుకమాలినియు నై చెలువొందెను. అతని తండ్రి చంద్ర కేతుఁడు బంధు భృత్యవర్గములం దనియించి మేఘుఁడు నీరు గురిసినట్లు తాను బంగారము గురిసి పుత్త్రుని విజయోత్సవమును పెంపొందించెను. విద్యుద్ధ్వజ దమనకీర్తిం బొందియు ముక్తా ఫలకేతువు పద్మావతి లేమి నిజభోగంబులం బ్రీతి వహింపఁ డాయెను. సంయతకుఁ డను చెలికాఁడు సారెసారెకు శంభువర ప్రసాదమును జ్ఞప్తి సేయుచు ఓదార్చుచుండ ముక్తాఫలకేతుఁ డెట్లో ఆదినములను గడపెను.

## ౪-వ తరంగము.

గంధర్వరాజు పద్మశేఖరుఁడును నిజనగరము చేరి మహోత్సవము కావించెను. తనకు జయము కోరినదై గౌర్యాశ్రమమందు పద్మావతి తపస్సు చేసిన దని భార్యవలన విని కూఁతును రావించెను. తపంబునను విరహంబునను కృశించి నదై వచ్చి పాదముల వ్రాలిన కౌమారితను దీవించి తండ్రి యిట్లనియెః—'పట్టీ, నాకై కడుం దపఃక్లేశ మనుభవించితివి,

కాన విద్యాధరరాజేంద్రతనయుని విద్యుద్ధ్వజాంతకుని, లోక శరణుని విజయుని శంభుదేవుఁడు నీకు భర్తగాఁ బ్రసాదించిన వానిని శ్రీముక్తాఫలకేతుని త్వరలోనే వివాహముగమ్ము, ఇట్లు తండ్రి చెప్పఁగా పద్మావతి తలవాంచి యుండ, తల్లి ముక్తావళి రాజుతో 'ఆర్యపుత్త్రా, ఎవ్విధమున నట్టి యా యసురుఁడు త్రిలోకాభయదాయి యగు నా రాజపుత్త్రునిచేత నిహతుఁడాయెనో చెప్పుము' అని యడిగెను. రాజు ఆదేవాసుర సంగ్రామమున నా రాజసుతుని పరాక్రమమును వర్ణించెను. పద్మావతిసఖి మనోహారిక యాతఁడు రాక్షసీయుగళమును చేతియొక్క ప్రేటుచం జనిపినకథను వర్ణించెను. అంత నాతనికిని పద్మావతికిని గలిగిన ఒకరొకరిదర్శనంబును ప్రీతిని విని రాజును రాణియు కరంబు సంతసిల్లిరి. అగస్త్యుఁడు మున్నీటివెల్లిందోలె ఎవఁడు అసురసేనలమొత్తమును త్రాగివేసెనో అతనికి ఇరువురు రక్కసలేపాటి? ఆ బరవసంపుఁ బొగడ్తగాలికి పద్మావతి విరహానలము మఱియు మంట లెగయసాగెను.

అంత నా రాజకన్యక యుత్కంఠితయై తలిదండ్రులకడ నుండి అంతిపురిలోని రతనాలమేడ కెక్కెను; రతనాలకంబంబులు, ముత్యాలకిటికీలు, మణికుట్టిమంబున నిండిన మహార్హ శయ్యాసనంబులు, తలంచినమాత్రాన వచ్చు నానాదివ్యభోగంబులును, గలయామేడలో నామెకు ప్రియతమవిరహానలము మఱియు తాపము సేయఁ దొడంగెను. మేడపయినుండి చూ

డఁగా బంగారపుఁజెట్లు బంగారపుఁ దీఁగలునిండి, రతనాలఁడిగ్గి యలు సూర్యకాంతిని కనుపింపఁజేయుచున్న దివ్యోద్యాన మగ పడెను. చూచి పద్మావతి 'ఆహా, ఈమానససరస్తటసంపద చెప్ప నలవిగాక యున్నది. నాపుట్టినతావయిన యిందులోకము కన్నను నందముగా నున్నది. నందనవనమును మించిన యిట్టి యుద్యానము గల యీహిమాచలచూడామణిని నే నింతకు మున్ను కని యెఱుఁగను. కావున నింపుఁబోయి చల్లనినీడలో నొంటిపాటున ఈవిరహతాపము నించుక చల్లార్చుకొనియెదను.' అని యాలోచించి యల్లన నొంటిగా మేడ దిగి ఆయుద్యాన మునకు తరలెను. కాలినడకను పోవ వలఁతి గాక యామె చింతింపఁగా తన విభూతిప్రభావంబున పక్షులు వచ్చి వాహన ములై ఆమెను ఎక్కించుకొని ఆయుద్యానమునకుం గొని పోయినవి. అందామె అరఁటిగుబురునందు పూఁబఱపుపై దివ్య గానాదినాదంబులు వినఁబడుచుండఁ గూర్చుండెను. దాన నామె కచట మనసు సరిపడదాయెను, మరుకాఁక అతివాయెను, ప్రియుఁడు సరసను లేమింజేసి మఱియు వర్ధిల్లసాగెను. అంత నామె చిత్రరూపునందేనియు నాతనిం గాంచఁ దివిరి, సిద్ధిప్రభా వోపస్థితములను చిత్రపుఁబలకము రంగులను వర్తులను కేలఁ గొని, 'బ్రహ్మయేనియు ఎవనిసాటిమేని నింకొకటిని సృజింప వలఁతిగాఁడో, అట్టి యూతనిని ఉత్కంఠాగ్రస్తనై చేయి తేలి పోవుచున్న నేనెట్లు వ్రాయనేర్తును! అగుఁగాక నాకు వినోద

ముగా ఎట్లో ఒకవిధముగా వ్రాసెదను.' అని తలపోసి, పలక
మీఁద నాతని వ్రాసెను.

అంతలో నామెను గానక బెగ్గిలి వెదకుకొని వచ్చి సఖి
మనోహారిక తీవపొదరింట నొంటిగా చిత్రఫలకఁ గేలఁ గొని
యుత్కంఠితయై యున్న చెలిని వెనుకన యుండి కాంచెను.
'ఇచట నొంటి నీమె యేమి సేయునో చూచెదఁగాక' యని
మనోహారిక పొంచియుండెను. అంతట పద్మావతి చిత్తరువు
నందలి ప్రియునుద్దేశించి కనుఁగలువలనుండి కన్నీటిబొట్టు లురల
'దుర్జయుల నసురులను గొట్టి యింద్రుని రక్షించిన వీరుఁడవు
నీవు, మాటమాత్రాననైన నన్ను రక్షింపవేమి? అల్పపుణ్యు
లయెడ ఈవిమ్రాను సయితము పిసిఁడి యగును, సుగతుఁడు
సైతము కట్టిఁడి యగును, బంగారము సయితము ఱా యగును.
మదనజ్వర మెఱుఁగవు గాన నావెత నెఱుఁగవు, అసురులు
నొంపలేని నిన్ను పూవిలుకాఁడు ఏమి సేయనేర్చును? నిన్నన
నేల, విధి నాయెడం గుటిలుఁడు, కన్నీళ్లతో నాకనులం గప్పి
చిత్తరువున నేనియు నిన్నుఁ గన వీయకున్నాఁడు.' అని త్రె
స్సినపేరునుండి ముత్తెములు వోలె కనుఁగవనుండి యశ్రు
బిందువులు రాల, నేడ్వసాగెను. తత్క్షణము సకి మనోహారిక
ఆమె సమీపమునకుఁ బోయెను. ఆమె చిత్తరువును దాఁచి
మనోహారికను 'సఖి, ఇంతసేపు నీవు కానరాకుంటివి, ఎట నుం
టివే?' అని యడిగెను. అందులకు నవ్వుచు మనోహారిక 'సఖీ,

నిన్నే వెదకుచుఁ గడుఁదడవు తిరుగుచుంటిని. మఱి నీవేల యీచిత్రమును మూసివేయుచున్నావు? నేను చిత్రమును కననుం గంటిని వినను వింటిని.' అని పలికెను. అంతట పద్మావతి యచ్చెలిని కేలఁగొని సిగ్గునం దలవాంచి బాష్పగద్గదకంఠియై యిట్లనియె:—'సఖి, ముందే నీకు సకలము తెలిసియేయున్నది, నీవలన నాకుఁ దాఁపఱికమేల? ఆరాజపుత్త్రుఁడు నన్నిపుడు గౌర్యాశ్రమములో రక్కసమొరగలినుండి యెత్తియు వారక మంటలు పర్వ నీవిషమునారాచునిమొరగలిం బడవైచినాఁడు. ఎట కేఁగుదును? ఎవరితోఁ జెప్పుదును? ఏమి సేయుదును? అందనిదానిం గోరితిని, ఏ ముపాయము కలదు?' ఇట్లు పల్కుచున్న రాజతనయతో చెలి యిట్లనియె;—'సఖీ, నీహృదయము తగినచోటనే తగిలినది; మీయిరువురకూటమి బాలచంద్రకళా హారజటాముకుటంబుల కూటమి వోలె అన్యోన్యశోభావహంబుగ నా నీవు అధైర్యపడవలదు, నిక్కముగా నాతఁడు నీవు లేక క్షణముండఁడు. ఏమి! ఆతనిచిత్తము నపుడు నీవు కనియుండలేవా! ఎవనిరూపును వలచి చెలువలును పురుషతను గోరుకొందురో, ఆనిన్ను ఎవఁడు కోరఁడు, తుల్యరూపుఁ డాతని మాట చెప్పవలయునా! మీరిరువురును దంపతు లగుదు రని పలికిన శంకరుఁడును మిథ్యావాదియ యగునా? ఇష్టార్థము సమీపమునన యున్నను సంతుష్టి చెందవేల? కాన; ఊరడిల్లుము, నీకతఁడే త్వరలోనే పతియగును నీకు దుర్లభుఁడు లేఁడు, నీవే ఎవరికిని దుర్లభవు.'

చెలి యిట్లు చెప్పఁగా రాజకన్య వెండియు నిట్లనియె:—
'సఖి' ఎఱుంగుదునుగాని, ఏమి చేయఁగలను ? ఈనాఁడునన్ను
ఆయనం దగుల్కొని యున్నది, ప్రాణేశుఁ డతఁడు సరసను లేక
క్షణమయినను సైఁపకున్నది. మన్మథుఁడు ఓర్వకున్నాఁడు.
ఆయననే తలపోయునామనము నిముసమేనియు నెగు లెడల కు
న్నది. అంగములు సంజ్వరమునం గ్రాఁగుచున్నవి. అసువులు
ఎగసిపోవున ట్లున్నవి.' ఇట్లు పలుకుచు మోహంపుఁ బెంపున
మునింగి శిరీషసుకుమారాంగి యా రాజకుమారి చెలియొడిం
బడియెను. నెచ్చెలితనకన్నుల నశ్రులు గ్రమ్ముదేర తత్తఱపడి నీటి
చల్లుల లేయరఁటాకువీవనలను తేర్చి తామరతూండ్లం దేరులు
కడియంబులుం జేసి యిడి, చలువ గ్రమ్ము గంబురాగందంబు
పూసి, తామరాకుసెజ్జం బరుండఁబెట్టెను. అవి యెల్లను ఆమె
యొడలికాఁక సోఁకి సమదుఃఖిత నోయన నిగిరిపోయినవి అం
తట పద్మావతి సఖితో 'చెలీ, ఏల యిట్లు వృథాప్రయాసపడె
దవు ? నావెత యీ వెరపులకుం దీఱదు. దేనం దీఱునో దానిం
జేయుదు వేని మే లగును,' అని పల్కెను. వయస్య యిట్ల
నియె:—'సఖి, నీకొఱకు నే నేమి సేయను, ఏమి సేయవలయు
నో చెప్పుము.' ఆమాటకు రాజపుత్త్రి సాన దోఁప నిట్లనియె.—
'సఖి, పోయి శీఘ్రముగా నాకాంతుని ఇటకుం దెమ్ము, ఇంత
కన్న నుపశమోపాయము లేదు. నాయన కోపింపఁడు సరిగదా,
ఇట కరుదెంచిన యా మహాపురుషునికి తప్పక నన్నిచ్చి వివా

హము సేయుము' రాజపుత్రి యిట్లు పలుకఁగా మనోహారిక సోత్సాహంబుగా నిట్లనియె:—'అట్లేని నీవు ధైర్యంబుగా నుండుము, ఈపని యేపాటి? ఇదె నీప్రియుం డైన నాతనితండ్రి చంద్రకేతునిపురము చంద్రపురమునకు పోవుచున్నాను, వగవకుము, సుముహూర్తంబున నుండుము.' ఇట్లు సఖి యూఱడింప రాకొమరిత యిట్లనియెను:—"సఖీ తెమ్ము, నీదారి శుభ మగుఁగాక, త్వరగా పొమ్ము. నా ప్రాణేశ్వరు నావీరుని త్రైలోక్యరక్షకుని నామముల నిట్లు పల్కుము; 'అప్పు డట్లు గౌరీదేవళంబున రాక్షసీభయంబునం బాపియు, ఇపుడు ఈస్త్రీహంత యగు నీ హాంతకారికంతుని వ్రేటుబడుండి నన్నుఁ గావ వేమి? లోకములం గావ నంటి లగుచుమిలోట్లగా, నాథా, ఇది యేటిధర్మము, పూర్వము రక్షించినజనమును అనువృత్తమునే మరల ఆపదం బడినప్పుడు రక్షింపమి?' ఓకల్యాణీ ఆయనతో ఈవిధంబునం బల్కుము, ఇంకె, నీయిచ్ఛ వచ్చినట్లు పల్కుదువుగాక." ఇట్లు కఱపి పద్మావతి చెలిని పంపెను. చెలియు తనసిద్ధివలన వచ్చిన పక్షివాహన మెక్కి విద్యాధరపురంబునకుం జనియెను.

పద్మావతియు సింహిక యూఱడిల్లి చిత్రఫలకము కైకొని తండ్రిలోఁగిటికిం జనియెను. అచట ఊటగంపుఁ జెలువలు చుట్టుంగొలువ తనయిల్లు సొచ్చి జలకమాడి గౌరీదయితుని భక్తి మీఱఁ బూజించి విన్నవించెను. 'స్వామీ, నీయనుగ్రహంబు లేక ముల్లోకములందును, ఎవరికిఁగాని కొంచెముగాని,

గొప్పగాని కోరిక సిద్ధింపదు. కావున, విద్యాధరచక్రవర్తి పుత్త్రుని మదభీష్టుని నాకు ఫలింపజేయవేని నీమ్రోల నా ప్రాణములు వదలెను.' ఆవిన్నపము విని వగ చెంది యచ్చెరుపడియు పరివారజనము 'దేవీ, ఏమి యిట్లు ప్రాణముల సయితము అపేక్ష సేయక పలుకుచున్నావు! ఈమూఁడు లోకములలో నీకును దొరకని దొకటి యుండునా! నీవు కోరినయెడల సుగతదేవుఁడు సయితము సంయమము నజ్జగించును. ఎవనిని నీవిట్లు కోరుచున్నావో ఆతఁ డొకఁడే పుణ్యము చేసికొన్నవాఁడు.' అని యామెతో వచించిరి. అంతట సుజలబ్ధరాజకన్య 'శక్రాది దేవతల కెల్ల నెవ్వఁ డొక్కరుఁడే శరణ్యుఁడో, సూర్యుఁ డొక్కరుఁడే చీఁకటి నెల్ల విరియించునట్లు ఏవాఁ డొక్కరుఁడే అసుర బలంబు నెల్ల రూపుమాయించెనో, మనకు ప్రాణము నిచ్చిన వాఁడు, ఆతఁడు ప్రార్థనీయుఁడు గాఁడొకొ?' అని యిట్టిమాటలాడుచు ఆతని ప్రశంసయే సేయుచు ఆప్తదాసీజనంబుతోఁ గూడ నుండెను.

ఈలోపల మనోహారిక విద్యాధరేంద్రనగరము చంద్రపురమునకుం బోయెను. వేల్పులవీటిం జేసి పద్మసంభవుఁడు దృష్టిఁ జెందక ఆచంద్రపురాద్భుతమును అసామాన్యవిభూతులతో నిర్మింపఁబోలును. అట ముక్తాఫలకేతుని వెదకి కానక ఆపతీవాహానంబు మీఁదనే ఆవీటి యుద్యానమున కేఁగెను. ఊహాకందని సిద్ధివిభవంబులు, దేదీప్యమానము లగు మణిమయ

పాదపంబులు, ఎల్లజాతుల పుష్పములను పూచెడుచెట్లు, దివ్యగాన
ముల నాదములతోఁ గేరుపులుఁగులయులివులు, రతనంపురాతి
న్నియలును, గలిగిన యయ్యుద్యానంపు సొంపుం గాంచుచు
మనోహారిక అచ్చెరువడుచుండఁగా, పక్షిరూపముల నున్న
వారు ఉద్యానపాలకులు ఆమెను సమీపించి వేఁడుకొని వ్యక్త
వచనంబులం బ్రియంబు పలికి పారిజాతతరుమూలంబున గరుడ
పచ్చతిన్నియమీఁదం గూర్చుండఁబెట్టి తగినభోగంబులఁ బూజిం
చిరి. ఆసత్కారమున కానందించి మనోహారిక 'హాహా!
విద్యాధరేంద్రుల సిద్ధిభూతులు ఏమి చిత్రములు? వారల
యుద్యానంబునే ఊహా కందనిభోగంబులు దేవాంగనాగీతం
బులు పరిచారకపక్షులు వింత గొల్పుచున్నవి! ఇంక మందిరం
బుల కథ యెట్లుండునో!' అని తలంచి ఆయుద్యానపాలకులనే
అడిగి తెలిసికొని వెదకుచు ఒకచోట పారిజాతాది వృక్షముల
గుబురునకు వచ్చెను. దాని నడుమ గంధపునీటం దోఁగినపూఁ
బాన్పున పవళించియున్న యాముక్తాఫలకేతుని మనోహారిక
కల్పకంబుఁబోలెఁ గాంచి, మున్ను గౌరీదేవళంబుకడం గని
యుంటం జేసి ఆనవాలుఁగట్టి, అతని యస్వాస్థ్య మెందులకో
చాటునన యుండి యెఱుంగునదై యట్లే నిలిచెను.

ఆసమయంబున మంచుతోను గంధముతోను వీవనల
తోను తన్నుపచరించుచున్న సంయతక నామకమిత్రునితో
ముక్తాఫలకేతుఁ డిట్లనియె;—'విరహార్తునికి నాకు సంతాప-

మును పూర్తిసేయ నిశ్చయముగా మరునిచేత ఈ మంచులో నిప్పుకలు గ్రుక్కఁబడినవి, గంధములో సుముకకుమ్ము కలుపఁ బడినది, గాలిలో నెరగలి పోయఁబడినది. కాన నేల చెలికాఁడా వృథా నిస్సుం బ్రయాసపాలు సేసికొనియెదవు? ఏలన, నంద నమును మించు యీయుద్యానంబున నాయుల్లము గీర్వాణతరుణీ గీతాది వినోదంబులచేతను సెగులే పొందుచున్నది. పద్మశేఖర తనయ యప్పద్మానన పద్మావతివలనఁగాక యీ విరహజ్వరము తక్కొంటఁ దీఱదు ఈమాట యెవ్వరితోను చెప్ప సిచ్చగింప ను, నాకు నెమ్మది లేదు, తత్ప్రాప్తికి నాకు ఒకటియే యుపా య మున్నది. ఎదో క్రేఁగంటిచూడ్కులుఁగులతో త్రవ్వి నాహృదయమును ప్రియ కొనిపోయినదో ఆగౌర్యాయతనము నకుం బోయి అట గిరిజాసంగతుని శంకరునిం గూర్చి తపస్సు చేసెద. ఆదేవుఁడే నాకు ప్రియాప్రాప్త్యుపాయము నొన రించును.'

ఇట్లు పలికి రాజపుత్త్రుఁడు లేచి నుంకించునంతలో మనోహారిక పరమానందభరితయై యాతనియొద్దకు నొచ్చెను. 'చెలికాఁడా, నీకు మేలు కలిగినది, నీకోరిక నెఱవేఱినది. ఇదె చూడుము నీప్రియతముచెలి నీకడ కేతెంచినది. నీతో వచ్చి అంబికాశ్రమములో నేను ఈమెను చూచియుంటిని.' అని హర్షంబున రాజకుమారునితో సంయతయుండు పల్కెను. అంతట ముక్తాఫలకేతుఁడు ప్రియాసఖుం గని ఆనందాశ్చర్యా

త్సుకత్వంబులు పెనంగొన చెప్పనలవికాని యొకానొకయవస్థం బొందెను. కనుల కమృతంపువానగా నేకెంచినయచ్చెలిని చెంతం గూర్చుండఁజేసి కాంతయొడలినేమ మడిగెను. మనో హారిక యిట్లనియె:—"ప్రభూ, నీవు నాథుఁడ వయినవిమ్మట నాచెలికి కుశలమేగాని, యిప్రుడుమాత్రము దుఃఖమే. ఎప్రుడు ఆమె నిన్నుచూచినమాత్రాన నీవు ఆమెమనస్సును హరించితి వో, అప్పటినుండియు నాచెలి విమన యైనది, వినదు, కనదు. ఆహారము నుజ్జగించి మృణాళహారముం దాల్చినది, సెజ్జ మాని తామరాకులపై దొరలును. 'వరునికథ నేని సిగ్గుచే మును పొల్లని యీమె యిపుడు ప్రియతముఁడు దవ్వగుట నిట్టియవస్థపా లైనది,' అని ఆమెను పరిహసించుచున్నవో యన ఆమెయంగం బులు మరుకాఁక కిగిరినగందంపుమైపూఁతలకెలినిగ్గుల నొప్పు చున్నవి. సుకృతివతంసా, ఆమె నీతోనిట్లు చెప్పుమన్నది." అని మనోహారిక ఆమె కఱపినమాటలు వాక్రుచ్చెను. అది యెల్ల విని ముక్తాఫలకేతుఁడు చెత దీఱి హర్షాతిరేకంబున మనో హారికను మెచ్చి యిట్లనియె:—'అమృతముచేతనుం బోలె నీనుడువుచే నాయుల్లము తడిసినది, ఊఱట గలిగినది, ధైర్యము వచ్చినది, బడలిక తీఱినది. ఆహా! నామీఁద నివ్వడువున అల్ల యాగంధర్వరాజ తనయ తానే పక్షపాతము వహించుటఁజేసి నాపూర్వసుకృతంబులు ఫలించినవి. కాని నే నెటులేని ఈ వియోగభారమును ఓర్తునుగాక, శిరీషకోమలగాత్రి యెట్లు

సహించును! కావున, నేను ఆగౌరిదేవళముకడకే వచ్చెదను. అటకు నీవు నీసఖిం దెమ్ము. అచట మాకు సమాగమ మగును గాక. ఓ కల్యాణీ, త్వరగా పోయి ఆసఖిని ఓదార్చుము. ఇదిగో ఈచూడామణి బ్రహ్మదేవుఁడు నాయందు సంతుష్టుఁడై నా కిచ్చినాఁడు. ఇది సర్వదుఃఖహరము దీనిని నాప్రాణేశ్వరి కిమ్ము. ఈహారమును నాకు వేల్పుతేఁడు ఇచ్చినాఁడు, ఇది నీకుం బారితోషికము.' ఇట్లు వక్కాణించి రాజకుమారుఁడు శిరము నుండి చూడామణిని తీసి మనోహారికచేతి కిచ్చి మెడనుండి హారమును తీసి ఆమెమెడం గయిసేసెను. మనోహారిక సంతోషించి రాకొమారుని కెరఁగి వీడుకోలు వడసి పక్షియొక్కరింతపై పద్మావతినెలవునకుం జనియెను. ముక్తాఫలకేతుండును హర్షంబున బడలిక దీఱి సంయతకునితోఁగూడ వేగిరముగా తన నగరి కేఁగెను.

మనోహారికయు పద్మావతి పార్శ్వంబునేరి ఆమెయిచ్చు మెచ్చ ప్రియతముని మరుకాఁకను వర్ణించి ప్రణయవేళలంబుల నాతనిమాటల విన్నయట్లే చెప్పి ఆతఁడు నియమించిన సంగమ సంకేతంబుగా నాగిరిజాశ్రమంబును తెలియఁజెప్పి, ఆతఁ డంపిన యా సిగమానికంబు నిచ్చి, తన కిచ్చిన యా పసదనంపు హారంబును చూపించెను. ఇట్లు పోయినపని నెఱవేర్చుకొని వచ్చిన సఖిని పద్మావతి కౌగిటం గ్రుచ్చి సత్కరించి మదనజ్వరబాధను

మఱచెను, ఆనందబునుంబోలె సిగయుం దామానికముం గట్టె
ను, గౌరీకాననమున కరుగ సన్నాహము సేసెను.

ఈలోపల దైవవశంబున నల్ల యా గౌరీ వనంబునకు
తపోధనుం డని యన్వర్థనామంగు ముని యొకఁడు దృఢవ్రతుం
డను శిష్యునిం దోడ్కొని వచ్చెను అచట శిష్యునితో మహా
ముని 'ఈదివ్యోద్యానంబున నే నొక్కింతతడవు సమాధి గావిం
చెద, నీ విట ద్వారమునసుండి ఎవరిని లోనికి రానీయకుము,
సమాధి ముగించినతర్వాత పార్వతిని బూజించెదను.' అని చెప్పి
శిష్యుని ద్వారమం దుంచి తాను లోనికిం జని యొకపారిజాత
వృక్షముక్రింద సమాధి నాశ్రయించెను. సమాధి ముగించుకొ
నిలేచి పార్వతిం బూజింపఁబోయెను. ఆపోకను శిష్యుని కెఱిం
గింపలేదు. ఇంతలో నచటికి దివ్యకలభంబు నెక్కి సంయతకుఁ
డు తోడుగా ముక్తాఫలకేతుఁడు కై సేఁతలు దీపింప నరుదెంచె
ను. ఉద్యానంబునం బ్రవేశింపఁబోఁగా నాతని మునిశిష్యుఁడు
'రాకు రాకు, మాగురు విచట సమాధి నున్నాఁడు' అని నివా
రించెను. 'ఇందు ముని ఒకమూలనేగదా యుండును, నాప్రియ
మహావిశాల మగునీతోఁటలో నెట నేనియు నున్న నుండును.'
అని తలంచి ముక్తాఫలకేతుఁ డుత్కంఠావశంబునం జేసి యా
మునికుమారుని కగపడని ప్రక్కకుం బోయి చెలికానితోఁగూడ
మింటిదారిని ఆయుద్యానంబుం జొచ్చెను. అపుడే గురుసమాధి
నివృత్తిం గాంచువాఁడై మునికుమారుఁడును లోనికి వచ్చెను.

అతఁడు గురువును గానక సవయస్కుని రాజకుమారునిఁ గని తన్నుఁ గనుఁ భ్రామి తప్పూదారిం బ్రవేశించినకోపంబున రాకొమరుని 'సమాధిని భంగించి నాగురుని తఱిమినయీయవినయమునకు నీవు వయస్యునితోఁగూడ మానిసివి గమ్ము,' అని శపించి తాను గురువుకడ కేఁగెను. మనోరథము ఫలింపనున్న యీసమయంబున నట్లు పడిన యీతిట్టుఁబిడుగునకు ముక్తాఫలకేతుఁడు చెప్పరాని దుఃఖమునుపొలాయెను.

ఇంతలో పద్మావతి ప్రియతమసంగమోత్కంఠిత యై పక్షివాహనముమీఁద మనోహారికాది సహాయ యై వచ్చెను. స్వయంవరాగత యయ్యు శాపాంతరిత యైనయప్పియసిం గని రాజతనయుఁడు సుఖంబు నై దుఃఖంబు నైన కష్టదశావిశేషముం బొందెను. పద్మావతికి ఆసమయంబున వదక్షిణంబయై దక్షిణాక్షి అదరెను, ఉల్లము తల్లడిల్లెను. అంత నా రాజకుమారి దిగులుపడియున్న కాంతునిం గాంచి తాను మున్ను రానందులకు ఖిన్నుఁ డై యున్నాఁడో యని తలంచెను. వినయపూర్వకంబుగా నామెచెంతకు రాఁగా రాజసుతుఁడు 'ప్రేయసీ, మనమనోరథము సిద్ధమ య య్యును విధిచే భంగింపఁబడినది,' అని వక్కాణించెను 'అయ్యో! ఎట్లుభంగ మయినది?' అని యామె తత్తఱపడుచు నడుగఁగా రాజకుమారుఁడు తనశాపముం దెలిపెను. అంతట వారెల్ల శాపాంతము వేఁడ నాగురువుకడకే దేవళంబునకు వేఁగిరి. ఇట్లు వారు వచ్చి తనపాదములం ద్రెళ్లఁగా ముని

ముక్తాఫలకేతునితో ప్రీతిపూర్వకంబుగా నిట్లనియె:—'రాజకుమార, మూర్ఖుఁడు వీఁడు నాచట్టు అరయక నిన్ను శపించినాఁడు, నాకు నీవేమియు చెఱుపు చేయలేదు. నేను చక్కఁగా నే సమాధి ముగించుకొని స్వయముగానే లేచి వచ్చితిని. ఇది నీకు భవితవ్యము, ఈతఁడు హేతుమాత్రుఁడు, నీవు మానుషుఁడవై చేయవలసిన దేవకార్యము గొప్పదియున్నది, నీవు దైవయోగంబున నీపద్మావతినే చూచి స్మరసంతాపముచే మర్త్యశరీరము వదలి త్వరగా ఈశాపమునుండి విముక్తిం బడయుదువు. ఈదేహముతోనే మరల ఈప్రాణేశ్వరిని రక్షింతువు. విశ్వరక్షకునికి నీకు తడవుగ శాపము తగదుగదా. నీ బ్రహ్మాస్త్రంబున దైత్యులు బాలవృద్ధాదులు సయితము నిహతులయిన దోషలేశమే యీ శాపమునకుం గారణము.' ఇట్లు వాక్రుచ్చిన తపోధనునికి పద్మావతి సాశ్రునయనయై విన్నవించెను:—'స్వామీ, ఆర్యపుత్రునికి ఏగతియో, నాకును అదే గతిగా ననుగ్రహింపుము. ఈయనను వదలి నేను క్షణమేనియు నుండనేరను.' ఇట్లు వేఁడుకొన్న పద్మావతితో ముని యిట్లనియె. 'అట్లు జరుగదు, నీ విచటనే తపస్సుచేయుచుండుము, దాన నీతఁడు త్వరగా శాపోత్తీర్ణుఁడై నిన్నుం బెండ్లియాడును. అంత నీ వీ ముక్తాఫలకేతునితోఁ గూడ పదికల్పంబులు ఖేచరాసుర సామ్రాజ్యము నేలెదవు. ఈయన యిచ్చినయీసిగమానికము నీ తపస్సున నిన్నుం గాచును, ఇది బ్రహ్మాండమండలువునుండి పుట్టి

నది, మహాప్రభావము గలది సుమా.' పద్మావతి కిట్లు వచించిన యా త్రికాలజ్ఞుని మహామునిని ప్రణతుఁడై ముక్తాఫలకేతుఁడు 'స్వామీ, మానిసిపుట్టువునందు నాకు శంకరునియందు నిశ్చల భక్తి యుండుఁగాక, పద్మావతి దక్క మఱియొకతెపై నామ నంబు తగులకుండుం గావుత,' అని ప్రార్థించెను. అట్లే యగు నని ముని ప్రసాదించెను. అంతట పద్మావతి అతిదుఃఖంబు పట్ట లేక అపరాధిని ఆశిష్యుని 'నీవు మోహమునఁ దపంబున సార్వ పుత్త్రుని శపించినకతన మానిసిపుట్టువున నాతనికి కామరూపం బును కామచరంబునగు వాహనమవు గమ్ము.' అని శపించెను. ఆశాపమునకు విషణ్ణుఁడైన నిజశిష్యునితో నమ్మహాముని యం తర్ధాన మొందెను.

అంతట ముక్తాఫలకేతుండు పద్మావతితో 'ప్రియా, నేను నాపురమునకుం బోయెద, అట నా కే మగునో కనియెద.' అని పలుకఁగా నామె విరహగ్రస్తయై గాలిత్రోసినతీవవోలె పుష్పా భరణంబులు చెదర నేలం గూలెను. ఏడ్చుచున్న యా ప్రియ తమ నెట్లో తేర్చి ముక్తాఫలకేతుఁడు మాటిమాటికి తిరిగి చూ చుచు మిత్త్రసమేతుఁడై వెడలిపోయెను. పోఁగా శోకంబున మునింగినదై పద్మావతి తన్నోదార్చుచున్న మనోహారికతో నిట్ల నియె:—"చెలీ, నాకు ఈదినము కలలో పార్వతి యగపడి కలువదండ యొకటి నామెడలో వేయవచ్చి, 'ఇప్పు డేలలే, తర్వాత ఇచ్చెదను.' అని మానివేసినది. దాన నద్దేవి యీ

ప్రియావాప్తివిఘ్నమును నాకు సూచించినది." ఇట్లు పలికి వందురుచున్న నెచ్చెలిని మనోహారిక 'అట్లయిన దేవి నిన్నోదార్ప నాకలం గలిగించినది. మునియు నట్లే చెప్పెను, శంకరుని యాదేశంబు నట్లే గదా. కావున నూఱడిలి యుండుము; త్వరలో నీకు ప్రియతమసమాగమము కలుగును.' అని యోదార్చెను. సఖీవచనంబులచేతను చూడామణి ప్రభావంబునను పద్మావతి ధైర్య మొంది గౌర్యాశ్రమమందే యుండెను. మూఁడు సంజలను గిరిజాసంగతుని శంకరుని పూజించుచు, ప్రియునిచిత్తరువుం దెప్పించికొని దేవతాబుద్ధిగా దానిం గొలుచుచు, తపస్సు చేయుచుండెను. తల్లిదండ్రులు వృత్తాంతము విని వచ్చి సాశ్రులై 'పట్టీ, తప్పక జరుగఁగలయట్టి యీమనోరథప్రాప్తికై వృథాగా నీవు తపంబుల నలసెద వేల?' అని నివారింపఁగా నూతనుఁడు భర్త దేవనిర్మితుఁడు ఆకస్మికంబుగా నిట్లు శాపదుఃఖ మొందఁగా నే నెట్లు ఇచట సుఖముగా నుందును? కులాంగనలకు పతియే గదా పరమదైవతము. ఈపాపము తపస్సుచేఁ దొలఁగును, శంభుఁడు తుష్టి నొందును, త్వరలోనే నాకు ప్రియసంగమము కలుగును, తపస్సున కసాధ్యమే మున్నది,' అని పద్మావతి యుత్తరము చెప్పెను.

అంత నామెతల్లి కువలయావళి యామెతండ్రితో నిట్లనియె:—"దేవా, ఈకుమారి కష్టతపం బాచరించుఁగాక, పైగా మనము నేల యీమెను ఖేదపెట్టుట! ఇది యీమెకు భవిత

వ్యము. ఇందులకుం గారణము గలదు, చెప్పెదను వినుము.—
మున్ను దేవప్రభ యని సిద్ధరాజకన్య, తన కిష్టుండైనభర్తం గోరి
మహత్తర మైనతపం బొనరించుచు శివపురంబున నుండెను.
అటకు దేవునిం గన నాతోంటూశ నిప్పద్మావతి వచ్చి యక్కు
మారిం గని 'పతికొఱ కిట్లు తపస్సు చేసెదవు, నీకు సిగ్గు లేదా?'
అని పరిహాసించినది. అంత సిద్ధకన్యక కోపంబున 'మూఢు
రాలా, పసితనంబున నవ్వెదవు, నీవును పతికై కష్టమయిన తపం
బొనరించెదవు లే' అని పద్మావతిని శపించినది. ఆసిద్ధకన్యా శాప
మును పద్మావతి యవశ్య మనుభవింపవలసి యున్నది గదా.
కావున దీనిని మాన్ప నెవ్వరితరము! కాన ఇచ్ఛ వచ్చినట్లు
ఇక్కుమారి తపము సేయునుగాక." ఇట్లు రాణి చెప్పంగా పద్మ
శేఖరుఁడు భార్యం దోడ్కొని చరణానతను కూంతును ఎటో
వీడ్కొని నిజనగరంబునకుం జనియెను. పద్మావతియు గౌర్యా
శ్రమంబునకలలో హరుఁడు తెలుపంగా సిద్ధీశ్వరక్షేత్రమునకు
కమలసంభవాదినిషేవితంబునకు గగనమార్గంబునం జని నియమ
జప్యపరాయణయై యనుదినంబును హరుం గొలుచుచుండెను.

---

## ౫-వ తరంగము.

---

ఇట్లు తన్నుం బడయ నప్పద్మావతి తపస్సు చేయుచుండం
గా ముక్తాఫలకేతుఁడు తననగరము చేరి బ్రాహ్మణుని శాపంబు

నం జేసి రానున్న మానిసిపుట్టువకు వెఱచి శివుని శరణుం జొ
చ్చెను. ఆదేవుని పూజించు నవసరంబున ముక్తాఫలకేతునికి గర్భ
గృహమునుండి యీవాణి వినంబడెను:—'భద్రా, ముక్తాఫల
కేతూ, భయపడకు, నీకు గర్భవాసక్లేశము కలుగదు. మానిసి
పుట్టువునందు నీకు దుఃఖమేమియుం గలుగదు, అందు చిర
కాలము నుండవు. రాజతనయుండవుగా జన్మించి మహాబల
పరాక్రమసంపన్నుండవై తపోధనమునివలన నస్త్రపారాయణం
బందుదువు. నాప్రముఖుండు కింకరుం డనువాండు నీకు తమ్ముం
డుగా జనించును. వాని తోడ్పాటున శత్రువుల జయించి
దేవతలకార్యం బొండు సాధించి వెండి పద్మావతితోం గూడి
విద్యాధరైశ్వర్యము ననుభవింతువు.' ఆవాణిని విని తెగువ
గొని రాజసుతుండు శాపఫలము రాక నెదురుసూచు వాండువోలె
నుండెను.

ఈలోపల కథాసంధిలో, తూర్పుదిక్కున, సిరిలో దేవ
సభను గెలిచినది దేవసభమని నగర మొకటి యుండెను. దానిని
దేవాసురరణంబులందు దేవరాజునకుం దోడ్పడువాండు మేరు
ధ్వజుం డనుసార్వభౌముం డేలుచుండెను. ఆమహాత్మునికి కీర్తి
యందు లోభముగాని పరధనమందుం గాదు, తీక్ష్ణత కత్తియం
దుం గాని దండనయందుం గాదు, పాపమువలన భయముగాని
శత్రువులవలనం గాదు, కుటిలత కోపముచే కను బొమలందుం
గాని హృదయంబునం గాదు, అల్లెత్రాటికాయలచే భుజంబున

పారుష్యంబుగాని మాటలోఁ గాదు. ఆరాజు దీనారాతిరక్ష
ణంబు దూరమునం జేయునుగాని కోశంబునం జేయఁడు, ధర్మ
చర్యలయందు సక్తిం జెందునుగాని యంగనలందుఁ జెందఁడు.
ఆరాజునకు ఉల్లంబున రెండుచింతలు నాటుకొన్నవి. ఒకటి
యేమన, ఆతని కొక్కఁడేనియు పుత్త్రుఁడు కలుగఁడాయెను.
రెండవది యేమన,—పూర్వము దేవాసురమహాసంగ్రామము
నకు ముందు తనచేత హతశేషులైన యసురులు పాతాళమున
కుం బోయి దాఁగినవారు ఇపుడు అటనుండి మాటిమాటికి
ఛలముగా వెలువడి తనకు దూరమందుండువానిని తీర్థములను
ఆశ్రమములను నాశముచేసి మరల పాతాళముం జొచ్చుచుం
దురు. పాతాళంబునను ఆకాశంబునను చరించు నయ్యసురు
లను ఆరాజు పట్టఁజాలకుండెను. దానంచేసి యాతఁడు తేజు
మెఱసినవాఁడు భూలోకంబున శత్రుహీనుఁ డయ్యును నిరంత
రము చింతించుచుండెను.

ఈచింతలు మనస్సును బాధించుచుండఁగా నమ్మేరుధ్వ
జుఁడు చైత్రశుక్లప్రథమతిథియందు ఇంద్రుఁ డంపినమంచియరద
మెక్కి దేవసభకుం జనియెను. ఇంద్రుని సంవత్సరాదినాఁడు
ఎల్లవేల్పులు నాతనియోలగంబునకు వత్తురు. మేరుధ్వజమహా
రాజు ఇంద్రుని రథంబుననే అందులకేతెంచుట వాడుక. అందు
దివ్యతరుణీనృత్తగానంబులచే నెల్లవారు నుల్లంబులఁబెల్లుల్లసిల్లు
చుండఁగా, ఇంద్రుఁడు కొఱలేక సమ్మానించినను మేరుధ్వ

జుఁడు నిట్టూర్పులు నిగిడించుచుండెను. దానిం గని హృదయ మెఱింగి యింద్రుఁడు రాజుతో నిట్లనియె:— 'రాజా, నీమన స్సులోని వగను నే నెఱుంగుదును. ఇఁక వగవవలదు. నీవు ముక్తాఫలధ్వజుఁ డని శివాంశమున నొకండును, మలయధ్వజుఁ డని ప్రద్యుమ్నావతార మొకండును, ఇరువురు కొమరులు కలు గుదురు ముక్తాఫలధ్వజుఁడు సహోదరుఁడై తపోధనమునివలన విద్యలను కామరూపమగు వాహనంబును అస్త్రములనుం బడ యును, మహాపాశుపతాస్త్రంబునుసైతము బొంది యాతఁడు దుర్జయుఁడై భూమినెల్ల వశము చేసికొనును, అసురులం గెడపి పాతాళమును వశపఱుచుకొనును, నీవు ఆకాశచరములను మహాస్త్రసమన్వితములను కాంచనగిరి కాంచనశేఖరము అను నీరెండు ఏనుంగులను నావలనం గయికొమ్ము!' అట్లు వచించి యయ్యస్త్రగజంబుల నిచ్చి వజ్రి పంపఁగా సంతుష్టుఁడై మేరు ధ్వజుండు భూలోకమున నిజనగరమునకు వచ్చెను.

అద్దేనుఁగులవలన రాజు ఖేచరత్వ మొందినను ఛలాభి యోగులు అప్పాతాళాసురులు అతనికి దొరకరైరి. అంత పుత్త్రకామ్యమెయి నా రాజు ఇంద్రోక్తుఁ డైనయ త్తపోధన మునియాశ్రమమునకు దివ్యేభంబు నెక్కి పోవుదెంచెను. అందు ఋషిని దర్శించి యింద్రాదేశమును తెల్పి ఆవిషయంబున శీఘ్ర కారి యగు నుపాయము సెప్పుమని యడిగెను. త్వరితంబుగ నభీష్టము నెఱవేఱునుపాయంబుగా నమ్ముని సపత్నీకునికి మేరు

ధ్వజునికి శివారాధనవ్రతము నుపదేశించెను. ఆవ్రతంబున మేరు ధ్వజుండు ఈశ్వరు నారాధించెను. తుష్టుండై భగవంతుడు కలలో రాజుతో 'రాజా, లెమ్ము, త్వరగానే కడమయసురుల రూపుమాపం గ్రమముగా నిరువురు తనయుల బొలయుంగనివారిని బొందుదువు.' అని యానతిచ్చెను. ఆమాట విని మేల్కొని తెల్లవాఱంగానే మునితోం జెప్పి యారాజు భార్యయుం దానును పారణ గావించి తనవీటి కరిగెను.

అనంతరము కొన్ని దినములకు మహాదేవి లక్షణవంతురాలు ఋతువందెను. ముక్తాఫలకేతుడును తనవైద్యాధర దేహమును చంద్రపురంబున విడిచి దానికి బంధువులం గాపు పెట్టి తా వచ్చి యతర్కితంబుగ నమ్మేరుధ్వజునిమహాదేవిగర్భంబునం బ్రవేశించెను. విద్యాప్రభావంబున నతనితొంటియొడలు చెడకయుండెను. మేరుధ్వజుని యిల్లాలును చూలాలై మగనికి పరమానందము కలిగించెను. గర్భభారంపుంబెంపున నామెకు ఆయాసము హెచ్చిన కొలందియు రాజున కుత్సాహ మెచ్చుచుండెను. కాలంబున నద్దేవి కొమరుసామిని పార్వతివోలె బాలుం డయినను సూర్యునివలె నుగ్రతేజంబు మెఱయువానిని కొమరునిం గనియెను. మహోత్సవము భూలోకమునం దంతటనుమాత్రము గాక దేవదుందుభులమ్రోతతో దివియందును ప్రవర్తిల్లెను. వృత్తాంతము దివ్యదృష్టిచేత నెఱింగి తపోధన మునియు స్వయముగా రాజును వర్ధిలం జేయ నరుదెంచెను. రాజు

మహోత్సవపూర్వకంబుగా నామునివరుని సాహాయ్యంబున పుత్త్రునికి దేవేంద్రుండు మున్ను చెప్పినయట్లు ముక్తాఫలధ్వజుం డని పేరిడెను. మునియు నాశ్రమంబున కరిగెను

మఱుసటియేట నద్దేవియందు రాజునకు రెండవకుమారుఁడు జనించెను. అతనికిని మునుపటియట్లే హర్షాగతుఁడైన తపోధనముని సాహాయ్యంబున మేరుధ్వజుఁడు మలయధ్వజుఁ డని నామ మేర్పరించెను. తదనంతరము సంయతకుఁడు శాపవశంబున మేరుధ్వజునిమంత్రికి కుమారుఁడుగా జనించెను; మంత్రి యాపుత్త్రునికి మహాబుద్ధి యని పేరిడెను. నృపకుమారు లిరువురును సింగంపుఁగొదమలవోలె క్రమంబుగా తేజాతోను మంత్రితనయునితోను ఎదుగుచుండిరి. ఎనిమిదేండ్లయినంతట నమ్ముని వచ్చి యారాకొమరుల కిరువురకు నుపనయనంబు గావించెను. మఱి యెనిమిది యేండ్లు ఆతఁడే వారికి విద్యలు కళలు సకలశాస్త్రంబులును నేర్పెను. సకలశస్త్రాస్త్రయోధుల నాయెలజవ్వనంపుఁ గొమరులం జూచుకొని మేరుధ్వజుఁడు కృతార్థమాని యై యుండెను.

తపోధనుండు నిజాశ్రమంబునకుం బోవ సమకట్టఁగా మహారాజాతని నిష్టమైన దక్షిణ గ్రహింపు మని వేఁడెను. 'రాజా, నాజన్నపుగొంగల నసురులను నీవు సపుత్త్రుఁడవై చనుదెంచి పిలుకుమార్తు వేని అదియ నా కిష్టదక్షిణ.' అని తపోధనుండు పలికెను. 'స్వామీ, ఆకారణంబుననే నీవు

పోయి జన్నమునకుం గడంగుము, విఘ్నముసేయ నసురులు వత్తురు, ఆకాలంబునకు నేనును సపుత్త్రకుఁడనై వచ్చెదను. మునీంద్రా, ఇటకు ము న్నాదైత్యులు ఛలంబున మీా కెగ్గులు సేసి చదలి కెగసి కడలి నడికి పాతాళము చొచ్చుచుండిరి. ఇపుడు ఇంద్రుఁ డిచ్చిన యేనుఁగులు ఆకాశచరములు రెండు నా కున్నవి, వానివలనను పుత్త్రసాహాయ్యంబునను మింటనే నియు నయ్యసురులం బట్టెదను.' అని రాజేంద్రుఁడు చెప్పెను. ముని సంతసించి 'అట్లయిన, రాజేంద్రా, తగినట్లు నాజన్న మునకు సంభారంబులు సేయింపుము. దిక్కులకెల్ల వెల్లడిగా నేను నాయాశ్రమంబున యాగ మారంభించెదను. మిముఁ బిలువ శిష్యుని దృఢవ్రతునిం బంపెదను. ఇతఁడు శాపగ మనంబు మహాబలంబు నగుపక్షి యై మీాకడ కేతెంచును. ముక్తాఫలధ్వజుని కితఁడే వాహన మగును.' అని చెప్పి నిజాశ్ర మంబున కరిగెను.

అతని వెంటనే రాజు సకలసంభారములును పంపెను. జన్నము నుపక్రమించుడు దేవర్షిపరిషత్తు వచ్చి కూడుడు, వృత్తాంత మెఱుకపడి పాతాళవాసిదానవులు కలగుం డైరి. ఆ వృత్తాంత మెఱింగి తపోధనుఁడు శిష్యుని దృఢవ్రతుని శాప వశంబున పక్షీంద్రరూప మొందినవానిని దేవసభనగరమునకుం బంపెను. అట్లు వచ్చిన యాశిష్యుం గని రాజు మునిమాట తలంచి తన దివ్యగజముల రెంటిని సన్నాహము సేయించి,

ప్రధానం బయిన కాంచనగిరిపై తా నెక్కి చిన్న కొమరునికిఁ గాంచనశేఖరంబు నిచ్చెను. ముక్తాఫలధ్వజుఁడు దివ్యాస్త్రంబు లం జేకొని అదృఢప్రతఖగేంద్రమును వందిబృందముల పొగడ్తలతోఁ గూడ నెక్కెను. ముప్పురు వీరులును పుడమివేల్పుల వలన నాశీర్వచనంబు లొంది, సైన్యములను ముందు పంపి, నింగి నేఁగునవ్వాహనములపై తరలిరి. ఆశ్రమంబు సేరఁగానే వారిం గాంచి సంతసించి ముని 'ఎల్లకైవుదులకును నొవ్వని వార లగుదు,' అని వర మిచ్చెను.

అంతలో జన్నమును భంగపెట్టుటకు దానవసైన్యము వచ్చెను. దానిని మేరుధ్వజునిదండు గొప్పది మార్కొనెను. నరాసురులకు దురము సమకొనెను. అసురులు మింటనుండి నేలనున్నవారిని నరుల బాధించిరి. అంతట పక్షీంద్రవాహనుఁడు ముక్తాఫలధ్వజుఁడు చదలెక్కి అంపవానచే అసురబలంబులం జక్కునేసి తరుచఁదొడంగెను. అట్లు పక్షిరాజుపై వెలుంగుచున్న యక్కుమారుం గని నారాయణుఁ డని శంకించి హతశేషు లసురులు పలాయితులై పాతాళంబు సొచ్చి యావృత్తాంతమును త్రైలోక్యమాలి కెఱింగించిరి. అతఁడు వేగులం బంపి ఆవీరుఁడు మనుష్యుఁడు ముక్తాఫలధ్వజుఁడని వారివలనం దెలిసికొని మానిసివలన నోటమి నోర్వక పాతాళమందలి దానవుల నెల్ల నొక్కమొన గూర్చి దుర్నిరీక్షంబులకు వెనుదివియక యయ్యాశ్రమంబునకు పోరం జనియెను. అక్కడనే పొచ్చ

రికగా నున్న ముక్తాఫలధ్వజాదులు సబలంబుగ వచ్చినయద్దాన వేంద్రుని డీకొనిరి. వెండియు మర్త్యాసురులకు పెనుపోరు దొరంకొనియెను. రుద్రేంద్రాది దేవతలు విమానంబు లెక్క కన వచ్చిరి. ముక్తాఫలధ్వజునిమ్రోల నాక్షణంబున నలంఘనీయ తేజంబగు మహాపాశుపతాస్త్రము వచ్చి నిలిచెను. కోలదికి మీఁటి అగ్నిమంటలు గ్రక్కుచు మూఁడుకన్నులు నాలుగుమో ములు ఒంటికాలు ఎనిమిది చేతులుం గలిగి కల్పాంతపావక సన్నిభం బయ్యస్త్రంబు ముక్తాఫలధ్వజునితో శంకరాదేశంబున నాతనివిజయముకై తా వచ్చినట్లు తెలియఁజేసెను. అంతట రాకొమారుఁడు దానిం బూజించి కైకొనియెను. ఈ లోపల నేల నున్న మేఘస్వనాదులును అయ్యసురులు అలుఁగువాన లతో తద్దయుం బీడించిరి. దానిం గావ చిత్రయోధి ముక్తాఫ లధ్వజుఁడు దానిచుట్టును అంపపంజరము కట్టుచునే అసురులతో పోరుచుండెను. పితృభ్రాతృసమేతుని ఖేచరవాహనుని ఆ ముక్తాఫలధ్వజుని గూర్చి త్రైలోక్యమాలి నాగాస్త్రముం బ్రయోగించెను. దానినుండి లెక్కలేక వెలువడి విషాగ్నులు గ్రక్కుచు బలంబుల నెల్ల మల్లడించిన పెనుఁబాములను మల యధ్వజుఁడు గరుడాస్త్రోద్గతంబులగు గరుడులచే కండతుండె ములు సేయించెను. అంతట దైత్యేంద్రుఁడు నాతని సుతులు నేయేయస్త్రంబు వైచినను దానిదాని ముక్తాఫలధ్వజుఁడు అవ లీలగా ప్రత్యస్త్రంబున నిరాకరించుచుండెను. కినుక రెట్టించి

దేవారియు తత్పుత్త్రులును తక్కుంగల యసురులును ఒక్కు-మ్మడి నాగ్నేయాద్యస్త్రసంతతినెల్ల నక్కుమారుపై గదియించిరి. క్షణంబున ఆయస్త్రంబులెల్ల నాతనిముందఱ మండుచు సన్నిధి సేసియున్న యప్పాశుపతాస్త్రముం గాంచి భీతిల్లి పెడమొగంబై పలాయనమందినది. అంతట వెఱచఱచి దైత్యులు పలాయనము కానుంకింపఁగా వారిహృదయం బెఱింగి వీరుఁడు ముక్తాఫలధ్వజుఁడు వారిచుట్టును మింట నలుదిక్కులను వజ్రపంజరమువోలె అభేద్యంబగు నంపపంజరము కట్టి లోనన నుండి వడుచున్న యద్దానవులను పులుఁగులంబోలె తండ్రియు తమ్ముఁడునుం దానును వాఁడియలుఁగుల చెండాడెను. చేతులు కాళులు మొండియంబులు తలకాయలును దైత్యులవి కుప్పగూలెను. నెత్తురుటేఱులు వెల్లిపాఱెనవి. దేవతలు పువ్వులవాన గురిసి సాధువాదము వచింపఁగా, ముక్తాఫలధ్వజుఁడు అప్పగతురమీఁద మోహనాస్త్రముం బ్రయోగించెను. దానం బెనుమూర్ఛను మునింగి యసురులెల్ల తమ దొరతోఁగూడ చాఁపకట్టుగా నేలం గూల రాకొమరుఁ డెల్లరను వారుణాస్త్రముచే పాశబద్ధులం గావించెను.

తపోధనుఁడు మేరుధ్వజనృపతితో నిట్లనియెః— 'హతశేషము గాన ఇయ్యసురసైన్యమును వధింపఁ జనదు. దీనినే వెనుగొని దీనితోనే మీరు రసాతలముం బ్రవేశింతురు. ఈ దైత్యేంద్రుని, వీని పుత్త్రులను, వీని మంత్రులను, మహాసురు

లను, దుష్టనాగములను, ఇంక ప్రధానరాక్షసులను, కూడ కట్టికొనిపోయి దేవసభపురముచెంగటి శ్వేతశైలగుహయందు వేయవలసినది.' నా విని మేరుధ్వజుఁడు, సోదరులతో నిట్లనియె:—'వెఱవకుఁడు, మిమ్ము మేము చంపము, సభ్రాతృకుఁడు ముక్తాఫలధ్వజుఁడు నేయు శాసనమున వర్తిల్లుఁడు!' దానవులు ఆయాజ్ఞతి కలరి యట్లుండ నంగీకరించిరి. మేరుధ్వజుఁడు దైత్యేంద్రుని త్రైలోక్యమాలిని పుత్రాదిసంయుతుని కట్టి శ్వేతశైలగుహను ద్రోయించి పెద్దమావటీల దండుతో ప్రధానమంత్రిని కాపు పెట్టెను. కలను ముగిసి, ఈగిమ్రానివూవుజడి వెలిసి, విమానచారులు పోయి, జగదుత్సవము ప్రవర్తిల్లుచుండఁగా విజయి మేరుధ్వజుఁడు పుత్రులతో నిట్లనియె:—యజ్ఞరక్షకై నే నిటన యుండెద. మీ సేనలను దైత్యవిమానారూఢులం జేసి తోడ్కొని ఈ హత శేషాసురబలముతో పాతాళమునకుం జని పాతాళవాసులను ఓదార్చి వశపఱచుకొని వారిపై ప్రధానులను నియమించి మీ మేలుబడిలోనికిం దెచ్చుకొని యిట కరుదెండు.'

ఆమాటకు వారు వల్లె యని కామచరంబు లగునాదివ్యవాహనంబు లెక్కి తమ సైన్యంబు కూడ రా, దానవ సైన్యము ప్రణతమై ముందు దారిచూప, అన్నదమ్ములు ముక్తాఫలధ్వజమలయధ్వజు లిరువురును, అక్కడక్కడ దారిలో నెదుర్కొను పాతాళపుఁ గావలి దైత్యవీరులను సమయించుచుం జని పాతా

ళంబున శేషజనుల కశేషులకును అభయమని తముకు సజి
వించి చాటింపించిరి. అందలిజను లెల్ల విశ్వాసము వహించి
ప్రణతులు కాఁగా నక్కుమారులు నానారత్నమయంబు లగు
పురశతంబులతోడి యుయ్యేడు రసాతలములను స్వాధీనపఱుచు
కొనిరి. దివ్యాసనములతో నిండిన రతనాలతాపలబావులు గలిగి
ఎల్లకోర్కుల నొసంగుచున్న యచటి రమణీయోద్యానములను
వారిరువురు ననుభవించిరి. మాయాబలంబున మ్రానితొఱట
లందు డాఁగి కానరాకయ యుండి దానవాంగనలును వారి
కన్యలును అద్భుతరూపుల నక్కుమారులం గన్గొనిరి. బందియై
యున్న భర్తకు మేలుకలుగు నిమిత్తము త్రైలోక్యమాలిభార్య
స్వయంప్రభ తపం బారంభించెను. ఆమెకూఁతులు త్రైలోక్య
ప్రభ త్రిభువనప్రభ అనునిరువురు కన్నియలు తండ్రిసేమముకై
తపం బారంభించిరి. అల్లరు లడఁగి శాంతిలి స్వస్థంబుగ నున్న
యప్పాతాళవాసి జనుల నెల్ల నా రాకొమరు లిరువురును నానా
విధప్రియంబుల సత్కరించి, సంగ్రామసింహాదులను వారిపై
పాలకులనుగా నియమించి, తపోధనాశ్రమపదముంకలి తండ్రి
కడకుం జనిరి.

అప్పటి కచట నమ్మునిజన్నము సమాప్తి నొందినది.
వేల్పులును ఋషులును తమ తమ యిక్కలకుం బయనమైరి.
అంత మేరుధ్వజుఁడు పరితుష్టుని దేవేంద్రుని 'దేవా, నాయందు
తుష్టుఁడవేని నానగరమునకు విచ్చేయుము' అని వేఁడుకొనెను.

వాసవుఁడునుముని నామంత్రించి రాజుతోఁగూడ తత్పుత్ర సమేతుఁడై వారి దేవసభ పురమునకు విజయంచేసెను. ఇరులోక ముల కీశ్వరుఁడైన యా మేరుధ్వజమహారాజు దేవేంద్రుని తాఁ జేసిన యాదివ్యోపచారముల పెంపుగంజేసి నిజస్వర్గసుఖమును మఱపించెను ఇంద్రుఁడును తుష్టుఁడై సపుత్త్రుని మేరుధ్వజుని వారి వారి దివ్యవాహనారూఢులను తన దివికిం దోడ్కొని పోయెను. అందు నారదరంభాదుల సంగీతంబులు ఘూర్ణిల్ల నమ్ముప్వురను నలయిక దీర్చి పారిజాతసుమనో మాల్యంబులును దివ్యకిరీటంబులును ఇచ్చి సన్మానించి యింటికి పంపెను. వారును మరల చనుదెంచి భూలోకపాతాళలోకంబులకు రాక పోకలు సేయుచు రెండు లోకములను నేలుచుండిరి.

మేరుధ్వజుఁడు ముక్తాఫలధ్వజునితో నిట్లనియె:— 'పుత్త్రా, నాయలనెల్ల నోర్చితిమి. మీరు అన్నదమ్ములు ఇరువు రును జవ్వన మొందితిరి. రాజకన్యలు స్వాధీనులై యున్నారు. మీకై విశేషించి నేను వెదకి యున్నాఁడ, వివాహమునకు తగిన కాలమిది, కావున వివాహము చేసికొనవలసినది.' తండ్రి యిట్లు పలుకఁగా ముక్తాఫలధ్వజుఁడు 'నాయనా, నాకు వివా హముపై బుద్ధి పుట్టలేదు, నేను ఇపుడు శివునిఁ గూర్చి తపస్సు చేయ నరిగెదను నాతమ్ముఁడితండు మలయధ్వజుఁడు వివాహము చేసికొనునుగాక.' అని యుత్తరము చెప్పెను. అంతే మలయ ధ్వజుఁడు 'అన్నా, నీవు పెండ్లి చేసికొనకుండఁగా నాకు పెండ్లి

తగునా? నీవు రాజ్యములేక యుండ నాకు రాజ్యంబు తగునా? నేను నీదారిని నీవెంటఁ జనువాఁడనుగదా' అని వాక్రుచ్చెను. అంతట రాజు ముక్తాఫలధ్వజునితో నిట్లనియె:—'పుత్రా, నీ తమ్ముఁడు పల్కినమాట సరిగా నున్నది. నీ మాట సరిగాదు. ఈయెలప్రాయము తపస్సునకుఁ గాలమా, ఇది భోగకాలము గాని? నాయనా, కాలహీనమైన యీ చెడుపట్టును మానుము.' ఇవ్విధమున నెంత చెప్పినను ముక్తాఫలధ్వజుఁడు ఆపట్టు వదల నందున రాజు కాల మెదురు సూచుచు నూరకుండెను.

ఈలోపల నాపాతాళంబున త్రైలోక్యమాలి భార్య స్వయంప్రభతో నామె కొమారితలు తపస్సున నున్నవారలు ఇట్టు లనిరి.—'అమ్మా, మేము ఏడెనిమిది యేండ్లవారముగా నున్నప్పుడు మానాయన బంది యాయెను, రాజ్యంబును పోయినది. ఎనిమిదేండ్లనుండి తపించుచున్నాము, ఇప్పటికిని ఈమందభాగ్యలమీఁద శంకరుఁడు కనికరింపఁడాయెను. ఇప్పటి కిని నాయనకు కారావిమోచనము కలుగదాయెను. కావున శత్రువులన మాకు పరాభవము కలుగకమున్నే, ఈనిర్లక్షణ దేహమును అగ్నిలో హోమము చేసెదము.' కూఁతు లిట్లు పలుకఁగా తల్లి యిట్లనియె:—"నాబిడ్డలారా, ఇంచుక తడవు వేచుఁడు. మనకు మరల మంచికాలమున్నది నేను తపస్సున నుండ కలలో శివుఁ డానతిచ్చెను. 'పిల్లా, ధైర్యము గొనుము. నీపతి మరల రాజ్యము నొందును. ముక్తాఫలధ్వజుఁడును మల

యధ్వజుఁడును, నీకొమారితలకు పతులగుదురు. వీరు మానుషు లని తలంపకుము. అన్న విద్యాధరుఁడు, తమ్ముఁడు మదీయుఁడు ప్రమథుఁడు' అని. వేగుఁతజి నిట్లు కలగని మేలుకొంటిని. ఈ యాసచేతనే ఇంత మహాక్లేశమును నేను ఓర్చితిని. కావున మీా వార్త నేను మీానాయనకుం దెలిపి ఆయన యిచ్చ వడసి మీా పెండిలికై యత్నించెదను" కొమరితల ని ట్లోదార్చి యా రాణి ఇందుమతి యను వేరి ముసలిని యంతిపురపరిచారికను బిలిచి యిట్లు ఆజ్ఞాపించెను.—"ఇపుడు నీవు శ్వేతశైలగుహాలో నున్న యార్యపుత్త్రుని కడకుఁ బొమ్ము. ఆయన యడుగుల వ్రాలి నామాటగా నిట్లు విన్నవింపుము. 'ఆర్యపుత్త్రా, కఠినురాలిని నన్ను బ్రహ్మ వేఱొకఁడు సృజించినాఁడు, నీవియోగాగ్ని మంటలకు నే నిప్పటికిని కాలకుంటయే యందులకు నిదర్శనము. వెండి నిను గాంచెడు నను శాశచే నేను ప్రాణములను వదల నైతిని' ఇట్లు చెప్పి నాకు కలలో శంకరుఁడు చేసిన యనుగ్రహముం జెప్పుము. పిల్లల వివాహముంగూర్చి ఆయన నడిగి ఆయన యాజ్ఞను నాకుం గొని రమ్ము, నేను దానిని నెఱ వేర్చెదను." ఇట్లు కఱపి స్వయంప్రభ యింధుమతిం బంపెను.

ఇందుమతి పాతాళంబునుండి లేచి ఆకొండగుహావాకిటికి వచ్చెను. అచట దిట్టంపుఁగావలి యుంటఁ గాంచి కాపరుల వేఁడి లోని కరిగి అందు సంకెలలంబడియున్న త్రైలోక్యమాలిం గాంచి కన్నీళ్లు గురియుచు పాదములకు మ్రొక్కెను. ఆతఁ

డడుగఁగా కుశలము చెప్పి యిందుమతి యల్లన నాస్వయంప్రభా సందేశము నందించెను. అసురేంద్రుఁడు 'మాకు రాజ్యము వచ్చు నని కలలో శివుఁడు చెప్పినమాట అది యట్లే యగును గాక. మేరుధ్వజుని కొడుకులకు నాయాత్మజాతల నిచ్చుట యన నిది యేటిమాట! నేను ఇటనే యిట్లు చచ్చియేని పోవుదును గాని, నాశత్రువులకు మనుష్యులకు బందినై నాతనయలను కానుక యియ్యను.' అని యుత్తరము చెప్పి యిందుమతిని పంపివేసెను. ఆవృద్ధ వచ్చి యాతనిరాణికి స్వయంప్రభకు ఆ వృత్తాంతమును నివేదించినది. విని దైత్యేంద్రుని కూఁతులు త్రైలోక్యప్రభయు త్రిభువనప్రభయు తల్లితో 'అమ్మా, మాకు యౌవనభయంబునం జేసి యగ్నియే గతి, కాన ఈచతుర్దశి నాఁడు మేము అగ్నిప్రవేశము చేసెదము.' అని తమ నిశ్చయముం దెలిపిరి. అంతట తల్లియు సపరిజనముగా మరణమునకు నిశ్చయించుకొనెను. చతుర్దశినాఁడు అందఱును పాపరిపు వను పేరితీర్థములో హాటకేశ్వరుం గొలిచి సొదలు పేర్చుకొనిరి. ఆ సమయంబున మేరుధ్వజుండును భార్యాపుత్త్రసమేతుఁడై ఆ తిథియందు హాటకేశ్వరుని దర్శింప వచ్చి అనుచరసమేతుఁడై స్నానార్థము పాపరిపు తీర్థమునకు పోవుచు దూరమునుండి యాతీర్థమున అడవిలోపల పొగ లేచుచుంటం గాంచి 'ఏల యిక్కడ పొగ లేచుచున్నది?' అని యచటివారి నడిగెను. అంతట పాతాళాధికృతులు అతనివారు సంగ్రామసింహాదు

లిట్లు చెప్పిరి. 'మహారాజ, త్రైలోక్యమాలి భార్య స్వయం ప్రభ కొమరితలతోఁ గూడ నిట తపస్సు చేయుచున్నది. ఇపు డామె యింట నగ్ని కార్యము ఏమో చేయుచున్నది. ఒండె, అతితపఃక్లేశంబున నగ్ని ప్రవేశము చేయుచున్నదో!'

ఆమాట విని మేరుధ్వజుఁడు ఇతరపరివారమును నిషేధించి భార్యతోను కొమారులతోను ఆయధికారులతోను ఆతాపునకుం బోయి యచట చాటుననుండి తల్లిని ఆదైత్య కన్యలను మండుచున్న చితాగ్నిని పూజించుచున్నట్టి వారిని కనుంగొనియెను. అక్కన్నియలు నెమ్మోము మెఱుంగు మొత్తముల ప్రవాహంబులచే రసాతలంబున జాబిల్లివండల సృజించు రీతిని, చలాచలహారోదకపూరంబులతో సిండిన చనుబంగరు గిండులతో హృదయస్థునికి మదనునికి ముల్లోకముల గెల్చిన అభిషేకము నేయుకరణిని, చెలువారి, నక్షత్రమాలాలంకృతం బగు మరునేనుఁగుకుంభస్థలంబుం బోలె మొలనూలు దాల్చిన జఘనాభోగము ఏపుమీఱ, వారియందు తానుంచిన లావణ్య సర్వస్వనిక్షేపమును రక్షించుటకొఱకు బ్రహ్మ కాపువెట్టినపాఁప దొరలో యన నొప్పు కేశకలాపంబులు గలిగి, యుండిరి. అట్టి యాకన్నియలం గని రాజు ఆనోయుగంబునకు వెఱఁగుపడి 'అహో, విశ్వకర్తనిర్మాణము నవనవాద్భుతము! ఎట్లన, చక్కఁదనంబున నీయసురేంద్రకన్యలకు రంభయు సాటి గాదు. తిలోత్తమయు ఈడు గాదు!' అని తలపోయుచుండఁగా, ఆదైత్య

కన్యలలో అక్క త్రైలోక్యప్రభ అగ్నిదేవుని కిట్లు విన్నవించెను. 'దేవా, మాయమ్మ కలలోనిహరునాదేశమును నాకుం జెప్పిన యప్పటినుండి నే నాగుణనిధి ముక్తాఫలధ్వజునియందు పతిబుద్ధి యుంచితిని. కావున, స్వామీ, నాకు ఒండు పుట్టువున నతఁడే పతిగా ననుగ్రహింపుము. ఈజన్మంబున నాయన సంకెలల నున్నవాఁడు మానశాలి, అమ్మ ఆకౌమారునికి నన్నిచ్చినను, తా నీయు నంగీకరింపఁడు.' దానిని విని చెల్లెలు త్రిభువనప్రభ యట్లే మహకాళునివలన మలయధ్వజుని జన్మాంతరంబునం బతినిగా వేఁడుకొనెను. అంతట మేరుధ్వజమహారాజును ఆతని రాణియు ఆవిన్నపములు విని పట్టరానియానందము పొంది యిట్లు పలికికొనిరి. మన కొమరు లిక్కన్నియలను భార్య లనుగాఁ బడసినం గదా లోకద్వయజయఫలము ననుభవించిన వా రగుట! కావున అగ్నిలో పడకముందే పోయి వీరిని తల్లి నివారింతముగాక.' ఇట్లు దేవితో ఆలోచించుకొని రాజు వారి కడకుం జని 'సాహసము సేయకుఁడు, మీదుఃఖమును నే తీర్చెదను.' అని వాక్రుచ్చెను. వీనుల కమృతప్రవాహ మైన యారాజేంద్రువచనమును విని ఆతనిం గనుంగొని అయ్యనురాంగనలు మువ్వురును ఆతనికి నమస్కరించిరి. స్వయంప్రభ యిట్టుల నియె:—'ముక్కు మేము లోకద్వయేశ్వరుం గాంచుచుండియు మాయాచ్ఛన్నల మగుటం గానరామైతిమి, ఇప్పుడు నీ కగపడితిమి. నీకగపడినమాత్రాన నే మాకు త్వరలో దుఃఖాంతమగును.

స్వయముగా దేవర కోరినవరంబు లొసంగఁగా నీకె చెప్పవల
యునా! కావున నాసన మలంకరించి యర్ఘ్యపాద్యాదుల
గ్రహింపుఁడు. మీరుజగత్పూజ్యులరు, ఇది మాయాశ్రమము.'
అంతట రాజు నవ్వుచు 'ఏ యల్లుర కీయిరువురకు నీవు పాద్యా
ర్ఘ్యమిమ్ము? అని హెచ్చరించెను. 'వీరికి శ్రీవృషభధ్వజుఁడు
పాద్యాదిక మిప్పించును ఇప్పుడు మీరు గ్రహింపుఁడు.' అని
స్వయంప్రభ వాకొనెను. 'సర్వమును పుచ్చుకొంటిని, మీరు
ఈమరణ ప్రయత్నము మానుఁడు. మీదేశములో సర్వకామ
దంబగు నొక పురంబు చేరి యుండుఁడు, అనంతరము మీకు
కుశల మగు నుపాయము నేన చేసెదను.' అని రాజు వారిని
మందలించెను. స్వయంప్రభ వెండియు నిట్లనియె:—'దేవరమా
టచే దేహత్యాగోద్యమము మానితిమి. మాప్రభువు చెఱసా
లలోఁ బడియుండఁగా మేము ఇంట నెట్లుందుము? కావున దేవర
స్వయముగా మా కిచ్చినవరమును పాలించువఱకు, పుత్త్రా
మాత్యసమేతుని మాప్రభువును విడిపించువఱకును మే మిటనే
యుండెదము. విడుదల పొంది యాతఁడు నీయధికారిగా ఈ
రాజ్యము నేలును, నీకిచ్చియేని రాజ్యమును నీకే అర్పించును.
అట్లతఁడు నీతో నొడంబడిక గావించుకొనును, ఇందులకు
మేమును పాతాళవాసులును పూఁటకాపులము. పాతాళమునుం
డి మారత్నములం గయికొమ్ము.' నా విని 'నేనే యిది తెలిసికొని
-యెదను, మీరును మీమాటను మఱవకుఁడు" అని పలికి యా

రాజు స్నానముచేసి హాటకేశ్వరుని పూజించెను. దైత్యరాజ కన్యలు ఇట్లు తమ కగపడిన యారాజకుమారులం గూర్చి యే కాగ్రచిత్తలైరి.

అంతట ప్రణామపూర్వకంబుగా రసాతలవాసు లెల్లర చేతను త్రైలోక్యమాలి విడుదలం బ్రార్థింపఁబడుచు ధన్యుఁడా మేరుధ్వజుండు తనకీర్తివలె తెల్లని వయిన గొడుగులతో దిక్కులం గప్పుచు భార్యాపుత్త్రసమన్వితుఁడై యసురలోకము నుండి వెలువడి తన రాజధాని కేఁగెను. అచట నాతని చిన్న కుమారుఁడు మలయధ్వజుఁడు ఆదైత్యకన్యలలో చిన్నదానిని ధ్యానించుచు నిదుర గూరక కనులు మూసి వేసియమ్ములవాని కాఁకకు పాలై రాత్రి వేగించెను. ధైర్యసాగరుఁడా ముక్తాఫలధ్వజుఁడు అసురరాజకన్యను పెద్దదానిని తనయందు బద్ధాభిలాషను మునీంద్రులమానసంబున నేనియు మారవికారమును గూర్చు సొబగుకత్తెను తలపోసియు ఎలజవ్వనమువాఁ డయ్యు మునివలనం బొందిన వరంబునంజేసి డెందంబునం గలంగఁడాయెను. పెద్దకొమారుఁ డిట్లు పెండ్లి నొల్లమియు చిన్నవాఁ డిట్లు మదనాతురుఁ డగుటయు, మహాసురుఁడు కన్యాప్రదానవిముఖుఁ డగుటయుం, దలపోసి మేరుధ్వజుఁడు ఉపాయం బరయుచుండెను.

## ౬-వ తరంగము.



అనంతరము మేరుధ్వజుఁడు మదనజ్వరాక్రాంతుని కుమారుని మలయధ్వజునిఁ గాంచి భార్యతో నిట్లనియె;—'పాతాళమందు మనము చూచిన యా త్రైలోక్యమాలి తనయలు మనకుమారులకు భార్యలు గారేని నే నేమిచేసినట్లు? వారిలో చిన్నదానిం గోరి నాపట్టి మలయధ్వజుఁడు లజ్జచేత కామాగ్నిని లోపల డాఁచికొని పుటపాకంబునంబోలె వేఁగుచున్నాఁడు. కావున నే మున్ను స్వయంప్రభకు వాగ్దానము చేసియు నే నిపుడు త్రైలోక్యమాలిని విడుదల సేయకున్నాఁడను. బంధవిముక్తుఁడాయె నేని యాతఁడు అసురత్వాభిమానంబునంజేసి తనకొమారితలను మానుషులకు మన కుమారులకు ఈయఁడొండె కావున ఈవిషయము వాతనితో మనము సాంత్వపూర్వకంబుగా ప్రస్తావించుట మేలు.' భార్యతో ని ట్లాలోచించి మేరుధ్వజమహీపాలుఁడు ప్రతీహారుని రావించి యి ట్లాదేశించెను. "నీవు శ్వేతశైలగుహా కరిగి యట కట్టువడియున్న దైత్యేంద్రుని త్రైలోక్యమాలిని ప్రీతితో నామాటగా 'దైత్యనాయకా, దైవయోగంబున నీ విట చిరము క్లేశపడుచున్నావు. కావున నిపుడు నామాట నెఱవేర్చి క్లేశమును బాపుకొనుము. నాకుమారులకు తద్దగ్నసాసుర క్తలను నీకొమారితల నిమ్ము. ఇటనుండి విడుదలఁ బొంది శపథము గావించి పోయి నీరాజ్యము నేలుకొమ్ము. అని

హెచ్చరింపుము.” అంతం బ్రతీహారుఁడు పోయి రాజవచనమును దైత్యేంద్రునికి తెలిపెను. మానుషులకు నేను కన్యల నీయను, అని యసురేంద్రుఁ డుత్తరమిడెను. ప్రతీహారి మరలి వచ్చి యావార్తను రాజున కెఱింగించెను.

అనంతరము మేరుధ్వజుఁడు ఉపాయ మరయుచుండెను. దినములు గడచినవి. అంత నావృత్తాంత మెఱింగి స్వయంప్రభ పాతాళమునుండి మరల పంపఁగా ఇందుమతి యను నావృద్ధదూతి వచ్చి ప్రతీహారీముఖంబుగా దన్నుం దెలియఁబఱిచికొని మహాదేవిచెంత కేఁగి ఆదరంబు వడసి తెలచి యిట్లనియె;— “దేవీ స్వయంప్రభాదేవి నీకు విన్నవించుచున్నది. ‘మీమాటను మఱచితిరా? సముద్రములును కులగిరులును ప్రళయమున మాఱిపోవును గాని మిముఁబోంట్లమాటమాత్రము అపుడును మాఱదు గదా. మా ప్రభువు కన్యల నీయ నంగీకరింప కేమి? కారాగృహస్థుఁ డాతఁడు కన్యలను కానుక యెట్లిచ్చును? మీరు ఔచిత్య మారసి ఉపకారార్థ మాతని విడుతురేని కృతజ్ఞతావశంవదుఁడై యాతఁడు తప్పక కన్యాదానము చేత మీకు ప్రత్యుపకారము చేయును. కిందువగ స్వయంప్రభ కన్యలతోఁగూడ ప్రాణత్యాగము సేయును. దాన మీకు మాసుతలును దొరకరు. మీ సత్యమును పాలితము గాదు. కావున ఓదేవీ, ఎల్లరకును హితముగా రాజు ఒడంబడికలు శపథంబులుం జేయించి మాదొరను విడుచునట్లుగాఁ గావిం

పుము.' అని. స్వయంప్రభ పంపినదానిని ఖేచరకాన్తాదిదాయ కంబు లగు దివ్యరత్నములు పొందగియున్న యీతోడవును, కైకొమ్ము." అంత నిందుమతితో రాణి 'పనట నున్న యీ మెవలన నే నెట్లు కైకొందును?' అనియెను. 'దేవీ, దీనిని నీవు గైకోవేని, నిక్కముగా మాకు అసంతుష్టి కలుగును. గైకొందు వేని మా దుఃఖము శమించునట్లు మేము తలంచెదము.' అని యిందుమతి కడుఁకమీఱ మనవి సేసి బోధింపఁగా స్వయంప్రభను పొఱడింపుగా రాణి దానిని గ్రహించి, ఇందుమతిని రాజు వచ్చునందాఁక నచటన యుండు మని నిలుపుకొనెను.

ఇంతలో రాజును అరుదెంచెను. ఇందుమతి లేచి, తన్ను రాణి యెఱింగింపఁగా, రాజునకు మ్రొక్కెను. రాజు ఆదరించెను. విషరక్షోజరారోగహారంబగు చూడామణిని స్వయంప్రభ పంపినకానికను ఇందుమతి రాజున కర్పించెను. 'నాసత్యము నెఱపి అనంతరము దీనిం బుచ్చుకొనియెదను.' అని రాజు వచింపఁగా నాప్రోఢ యిందుమతి 'దేవా, నీవు అంటివేని నెఱవేఱినదే, దీనిం బుచ్చికొన్నచో మాకు మితిలేని యూఱట గల్గును.' అని మనవి చేసికొనెను. ఆమాటపై రాణి 'చక్కఁగా చెప్పితివి.' అని నుడిసి రాజుచేతనుండి యాసిగమానికంబుం గయికొని యాదలం దాల్చెను. అంత నిందుమతి స్వయంప్రభా వాక్యమును రాణికి నివేదించినట్లే రాజునకును నివేదించెను. రాణియు నట్లే యని పలుకఁగా రాజు 'ఇటనే యీదిన ముందు

ము, తేపు చెప్పెదను.' అనెను. మఱునాఁడు తెల్లవాఱఁగా మేరుధ్వజుఁడను రాజు తన మంత్రులను రావించి యిందుమతితో నిట్లు వక్కాణించెను. 'ఈమదీయమంత్రులతోఁగూడ నేఁగి మీదొరకు త్రైలోక్యమాలికి తెలిపి, పాతాళంబునుండి స్వయంప్రభాద్యసురవనితలను, పాతాళవాసులలోని ప్రముఖులనెల్లను హాటకేశ్వరసంబంధిని ముద్రాసహితం బగు వారికోశంబును, తెమ్ము. త్రైలోక్యమాలి భృత్యబంధుసహితముగా నెప్పుడును మావశంబున నుండవలయును. నాగములు వైరులను పొడు గావింపకుండవలయును. ఈవిషయంబున స్వయంప్రభాదులు నా మంత్రులయెదుట భర్తపాదములు తాఁకి శపథములుచేసి పూఁటకాపులు గావలయు. పాతాళవాసు లెల్లరును రాజులతోఁగూడ పూఁటకాపులు గావలయును, అందఱును తమ యపత్యములను మా కప్పగింపవలయును. అందఱును రాజులతోఁగూడ వ్రాఁత వ్రాసి యిచ్చి హాటకేశ్వరుని సర్వాంగ వారి కోశమును ద్రావవలయును. అట్లు చేసినయనంతరము నేను చెఱపాలనుండి త్రైలోక్యమాలిని విడుదలచేసెదను.' ఇట్లు వచించి రాజు ఇందుమతిని మంత్రులను వీడ్కొనియెను. ఇందుమతి మంత్రులతోఁగూడ నేఁగి యా వృత్తాంతమును త్రైలోక్యమాలికి నివేదించెను, అతఁడు నంగీకరించెను. అంత నిందుమతి పాతాళలోకమున కరిగి స్వయంప్రభాదులను కోశజలమునుం గొనివచ్చి రాజుమ్రోలి నతని.

మంత్రుల మోఁలి అంగటచేతను రాజోత్కళపథము నెల్ల చేయించెను. అంతట మేరుధ్వజుఁడు కృతప్రత్యయుని త్రైలోక్య మాలిని కారాగృహమునుండి వెలువరించి తన యింటికి రావించి సపరిగ్రహుం డాతని చక్కఁగ సత్కరించి అసురరత్న సంచయముం డాఁ గైకొని యాతని నతని రాజ్యమునకుం బంపెను. త్రైలోక్యమాలియు పాతాళమున కరిగి వెండియు రాజ్య మొంది భృత్యబాంధవులం గూడుకొని సంతసించెను. మేరుధ్వజుఁడు పాతాళోద్భవములైన యాధనరాసులతో భూలోకము నెల్ల వర్షాకాలపు మేఘుఁడు నీళ్లతో నుంచోలె నిం డించెను.

అనంతరము త్రైలోక్యమాలి భార్యతోఁ గలయఁబలికి కొని కృతజ్ఞతావశంవదుఁడై మేరుధ్వజుని కుమారులకు తన యింట తన కన్యారత్నద్వయము నిచ్చువాఁడై, తదర్థమై మేరు ధ్వజుని సపుత్త్రబాంధవుని తోడితేర వ్యయముగాఁ బాతాళ మునుండి వెడలి మేరుధ్వజునికడ కేఁగ ఆతిథ్య మొంది యిట్లు విన్నవించెను 'దేవా, అప్పుడు పాతాళముం గని కరము తనిపి యుండవు, ఇప్పుడు విజయంచేసి మాచేయు పరిచర్యలను గ్రహించుచు కనుఁగొనుము, నాకన్యారత్నముల నిరువురను నీతనయులకై గ్రహింపుము.' అంత మేరుధ్వజుఁడు భార్యను కొమరులను రావించి వారికి అసురేంద్రవచనమును కన్యా దానాంతము వాక్రుచ్చెను. అంత పెద్దకుమారుఁడు ముక్తా

ఫలధ్వజుఁ డిట్లనియె:—శంకరుంగూర్చి తపంబు సలుపక నేను పెండ్లి చేసికొనను, ఈవిషయమును నేను మున్నే తమకు చెప్పి యుంటిని, ఈయపరాధమును తమరు మన్నింపవలయును, నేను తపోర్థము వెడలినంత తమ్ముఁడు మలయధ్వజుఁడు వివాహమాడునుగాక, ఆపాతాళకన్యక లేక యితనికి సుఖము లేదుగదా.' ఆమాటకు చిన్నవాఁడు 'అన్నా, నీవు లేక అకీర్తికరము అధర్మ్యము నగు నిట్టికృత్యము నే నెట్లు సేయుదును?' అనియెను. మేరుధ్వజుఁడు ఎంత బోధించినను ముక్తాఫలధ్వజుఁడు వివాహమునకు ఒప్పుకొనఁడాయెను. దానవగం కోరియున్న మేరుధ్వజు నామంత్రించి త్రైలోక్యమాలి అనుచరసమేతముగా పాతాళమునకు మరలిపోయెను.

త్రైలోక్యమాలి యచట భార్యతోను కొమరునితోను అవృత్తాంతము చెప్పి "కనుఁడు, మనకు అవమానమే చేయ నుకట్టినవాఁడై విధి యేమి సేయుచున్నాఁడో! తొలి నన్నడిగిన నే నియ్యని నాతనూజలను ఇపుడు నేనే పోయి ప్రార్థించినను మానుషకుమారులు గ్రహింపరఁట!' అందులకు వారిరువురును 'విధి తలం పిదియ యని యెట్లు తెలియును! శంకరవచనము తప్పునా!' అని పల్కుచుండఁగా కన్యలు త్రైలోక్యప్రభా త్రిభువనప్రభలు వృత్తాంత మెఱిఁగి 'మేము పండ్రెండు దినములు నిరాహారవ్రతమున నుండెదము, అప్పటికి పరమేశ్వరుఁడు మాకు వివాహసంపదను అనుగ్రహింపఁడేని మే మిరు

పురమును కలసియే యగ్ని ప్రవేశము చేసెదము. అవమాన మునకేని జీవనార్థమేని ఈపాడుదేహములను ధరింపము.' అని నియమ మేర్పరించుకొని యిరువురును ఉమాపతిమోళిల నెలకొని నిరాహారలై జపధ్యానపరలై యుండిరి. ఆవృత్తాంత మెఱింగి వారితల్లిదండ్రులును సుతావాత్సల్యంబునం జేసి తా మును వారితోఁగూడ నట నిరాహారవ్రతులై యుండిరి. అప్పుడు వెండియు స్వయంప్రభ ఆకన్యలతల్లి ఇందుమతిని పిలిచి దానిముఖమున మేరుధ్వజమహారాజుపట్టపుదేవికి ఆ వృత్తాంతమును పంపెను ఇందుమతియుం బోయి తనదొర యింటియాసంకటమును ఆదేవికి విన్నవించెను. ఆమెవలన మేరుధ్వజుఁ డెఱింగెను. వారు ఆదంపతులును అనుసరించి తామును నిరాహారవ్రత మవలంబించిరి, వారిపుత్త్రు లిరువురును పితృభక్తిపరాయణులు తామును ఆహారము మానివేసిరి.

ఇట్లు రెండులోకములందును వేలికలయిండ్ల నిట్టిసంకటము సంభవించి యుండఁగా ముక్తాఫలధ్వజుఁడు భోజనము మాని ధ్యానంబున శివుని శరణు వేఁడెను. ఈవిధమున ఆఱుదినములు కడచినయనంతరము ముక్తాఫలధ్వజుఁడు వేకువను మేల్కాంచి తన పూర్వమిత్త్రుఁ డగుసంయతకుని యవతారమైన మహాబుద్ధితో నిట్లు వక్కాణించెను:—"మిత్త్రమా, నే నిపుడు కలలో నాకు మున్ను తపోధనముని యిచ్చిన నావాహనమును కామరూపమును మనోగతిని విమానరూపము దాల్చినదానిని

ఎక్కి చిత్తనిర్వృత్తికై మేరుతటగతమునకు గౌరీశాలయము నకుం బోయితిని. అట నొక దివ్యకన్యకను తపఃకృశను గంటిని. ఆకన్నియం గూర్చి నాతో జటాధరుఁడు ఒకానొక పురుషుఁడు నవ్వుచు 'ఓయి ఒకకన్నియనుండి నీవు పలా యితుఁడవై యిట కేతెంచితివి, ఇట నీకు ద్వితీయ ఈమె రొకతె సంభవించియున్నది, చూడుము.' అనియెను. ఆమాట విని ఆకన్యరూపుం గాంచి తనియక యే తెల్లవాఱుతఱిని మేల్కాంటిని. కావున ఆదివ్యకన్యం బొందుటకై ఆతావునకే తరలెద, అట నాచెలువం బొందనయేని చిచ్చుం జొచ్చెద. ఆ తీరున నాకు లభించిన యాదైత్యకన్యను విడిచి నాయుల్లంబు స్వప్నదృష్టయందు మసలుకొని యున్నది ! ఈవిధి కేమిసేయ నగును ! అట కేఁగిన నిక్కముగా నాకు శుభము గలదని తలంచుచున్నాను." ఇట్లు పలికి ముక్తాఫలధ్వజుఁడు తనకు తపో ధనముని యిచ్చిన యానిజవాహనమును తలంచుకొనెను. అదియు కామరూపము కోరినతావునకుం గొని పోవునది, విమానరూపమున చెంతకు రాఁగా దానిని మిత్త్రునితోఁగూడ నెక్కి యాదివ్యప్రదేశమునకు గౌరీపత్యాలయమునకు వెడ లెను. అటఁ జని కలలోఁ గన్నట్లుగావే సర్వము అట నుండం గని హర్షించెను. అట ముక్తాఫలధ్వజుఁడు ఆపథుఁ డొక్కఁడే ఇంటిపరిచారకుఁడుగా సిద్ధోదక మను వేరి తీర్థమందు స్నానా దికములు సేయ నారంభించెను.

ఇంతలో ఎటకో యాతఁడు పోయెనని యెఱింగి యతని తండ్రి మేరుధ్వజుఁడు భార్యాసుతసమన్వితుఁడై యుపవాస కృశుఁడయ్యుం బడినక్షోభము అలోకసామాన్యమై పాతాళ మందు సయితము ప్రకటమాయెను. అంతట త్రైలోక్య మాలియు ఉపవాసకృశుఁడు భార్యాసుతాసమన్వితుఁడై తానును మేరుధ్వజునినగరమున కరుదెంచి 'నేడు చతుర్దశి యగుట నాతఁడు హరు నర్చించుటకై యెటకో పోయినాఁడు, కాన నీదిన మిటనే వేచియుందము, రేపు తెల్లవాఱునంత రా డేని, అతఁ డెట నున్నాఁడో అటకు మనమే యేఁగుదము, అనంతరము ఏమి కానున్నదో అట్లగుఁ గాక.' అని ఆయందఱి తోను నిశ్చయము సేసికొనెను.

ఈలోపల మేఘవనమున నాగౌర్యాశ్రమమున నున్న యాపద్మావతియు ఆదినము తనచెలులతో నిట్లనియె:—"చెలు లారా, ఈరాత్రి కలలో నేను సిద్ధీశ్వరమునకుం జనియుంటి నట దేవళమునుండి జటాధరుఁ డొకపురుషుఁడు వెలువడి వచ్చి నన్ను 'పుత్త్రీ, నీదుఃఖము తీఱెనది, నీకు పతితోడ సమా గమము ఇప్పుడే కానున్నది.' అని పలికి పోయెను; వెంటనే మేల్కొంటిని, తెల్లవాఱినది రండు, అటకే పోవుదము." ఇట్లు పలికి యాచెలులతోఁగూడ మేరువుపార్శ్వమున నున్న గౌరీశ్వరాలయమునకు పద్మావతి యరిగి యచట సిద్ధోదక తీర్థంబున స్నానమాడుచున్న ముక్తాఫలధ్వజుని దవ్వుదవ్వులం

గాంచి యచ్చెరుపడి 'చెలులారా, కనుఁడు ఈపురుషుఁడు నా ప్రియుని వలెనే యున్నాఁడు. ఆశ్చర్యము! అతఁడే యీతఁ డగునా? కాఁడు ఇతఁడు మనుష్యుఁడు గదా.' అని పలికెను. ఆమాట విని యాతనిం గని చెలు లిట్లనిరి. 'దేవి, ఈతఁడు కేవల నీప్రాయణదయితునిపోల్కి నుంటయగాక యీతనిచెలి కాఁ డీతఁడును ఆతని చెలికాఁ డయిన యాసంయతకునిం బోలి యున్నాఁడు. నీవు వర్ణించిన యీస్వప్నముంబట్టి మే మిట్లు తలంచుచున్నాము! వాస్తవముగా వీరు శాపము చేత మనుష్య త్వముం బొందిన యాయిరువురే, దైవముచే స్వయుక్తిచే నిటకుం దేఁబడినారు, కాదేని యీ దేవభూమియందు మనుష్యు లకు ప్రవేశ మెక్కడిది?' చెలు లిట్లు పలుకగా పద్మావతి యీశ్వరుం గొలిచి తత్సమీపముననే ఆపురుషుఁ డెవఁడో యెఱుంగునదియై డాఁగియుండెను.

ఇంతలో ముక్తాఫలధ్వజుఁడుసుస్నానమై శివుని పూజించు టకై యాలయమునకువచ్చి సర్వమును పరికించి మహాబుద్ధితో నిట్లనియె:—'వయస్యా, కలలో నాకు కనఁబడిన యా దేవళము లింగాంతర్ధ్వాళ్యగౌరీశమూర్తి రత్నమయము ఇదే. దివ్యవిహంగ ములును మెఱయురతనంబుల వెలుఁగుతోడి ప్రాఁకులుం గలిగిన యాదివ్యభూములు కలలోఁగన్నవియే వే, అపుడు గాంచినకన్యను మాత్రము ఇపు డిటం గాన, అవ్వోలఁది నాకు దొరకదయేని తప్పక ప్రాణము లుజ్జగించెద' ఇట్లు పలికి ముక్తాఫలధ్వజుఁడు ఆ-

తరుణులచట డాఁగి యుండఁగా తాను లోనం జొచ్చి శివు నారాధించి వెలువడి ముష్మాలు ప్రదక్షిణించినంత నాతండును చెలికాఁడును తమతోంటిపుట్టువును స్మరించిరి. ఆహర్షంబున వా రొండొరువులకు పూర్వవృత్తాంతమును చెప్పుకొనుచుం డఁగా, పద్మావతి యత్తఱిని వారి కనులమ్రోలం దోఁచెను. ముక్తాఫలధ్వజుఁడు పూర్వజన్మవృత్తాంతమును స్మరించి పట్టరాని హర్షంబున ఆమెను గని వయస్యునితో నిట్లనియె:—'రాత్రి కలలో నేనుగన్నది నాదేవి పద్మావతియే, ఇపుడు దైవవశ మున వాస్తవముగానే దొరకినది. కాన ప్రాణవల్లభను అవిలం బితముగా గౌరవించెదను.' ఇట్లు పలికి కన్నుల నానందబాష్ప ములు రాల ఆమెం దఱిసి 'దేవీ, పోకుము, నే నీముక్తాఫల కేతుఁడను, నీవల్లభుఁడను, దృఢవ్రతునిశాపముచే మానుషుండ నైతిని, ఇపుడు పూర్వజన్మమును స్మరించితిని.' అని పట్టరాని తమకంబున నామెం గవుంగిలింపఁబోయెను. ఆమె కలగుండు వడి యంతర్ధానమై బాష్పాయమానాక్షియై యటనే యుం డెను. అంతట నతని చెలికాఁడు నెవ్వగమీఱి యాకాశముం గూర్చి యిట్లు మొఱ యిడెను! 'దేవీ పద్మావతీ, ఎవనికై యట్టి మహాతపఃక్లేశమును నీవును పూనితివో అతని నెదుట వచ్చియున్నవానిని పలుకరింపవేమి ? నీప్రియవయస్యుఁ డుండెనే సంయతకుఁడు వాఁడనే నేను. మీకై శాప మొందిన నన్ను ప్రియము పల్కవేమి ?' ఇట్లు పలికి యాతఁడు రాకొమరుని

ఉపాలంభనం జేసి యి ట్లనియెః—అనురాగము మీఱి నీకై వచ్చిన యాదైత్యరాజకన్య నొప్పరికించితివే ఆపాపమున కిది ఫలముసుమా ఆమాట విని పద్మావతి చెలులతో 'వినుఁడు, ఇతఁడు అసురకన్యలయందు ప్రవర్తిల్లఁడఁట.' అనెను. అంత సఖియ లి ట్లనిరి. 'దేవి, సర్వము కార్యాణపడుచున్నది. నీవు స్మరింపవా, శాపసమయమున నీప్రియుఁడు మనుష్యజన్మంబున తనమనస్సు పద్మావతిని వీడి మఱియొక్క చెలువమీఁదికి పో కుండుఁగావుత యని తపోధనమునిని వేఁడి వర మొందుటను? దానిప్రభావంబున నితఁడు ఇందువెలఁదులయందు అనురాగ మూనఁడు.' ఆమాటలువిని పద్మావతి సంశయాకుల యాయెను. ముక్తాఫలధ్వజుండును కనులకగపడిన ప్రేయసిని అట్లు తత్క్షణమే కోలుపోయినవాఁడై 'హా! ప్రేయసీ, పద్మావతీ, ఏమి దీనిం గనవా, విద్యాధరత్వమందు నీకై శాప మొందిననేను ఇపుడు నీకై నిక్కముగా మృత్యువునే పొందుచున్నాను!' అని యిట్లు పలుదెఱంగుల నాక్రందింపసాగెను. పద్మావతి యతని యా యాక్రందనమును విని సఖులతో నిట్లనియెః—'గుర్తులన్నియుం సరిపడుచునే యున్నవి, అయినను, ఇవి యెల్ల పరంపరావశ మున నీయిరువురును విని యెఱిఁగినవేమో యని నామనస్సు నిశ్చయముం బొందక యున్నది కావున నితనియార్త వచన మును నేను వినఁజాలను, కాన నాగౌర్యాయతనమునకే పోయెదను, నాకిపు డచట పూజాకాలముగదా' ఇట్లు పలికి.

పద్మావతి చెలితోఁగూడ అంబికాశ్రమమునకుం బోయి దేవిని పూజించి 'దేవీ, సిద్ధీశ్వరమందు నేను చూచిన యాతఁడే నా పూర్వప్రియుఁడేని, అతనితో నాకు కూటమి వెంటనే కలుగు నట్లుగా ననుగ్రహింపుము.' అని వేఁడుకొనెను. ఇట్లు కోరుకొని పద్మావతి ఎదురు సూచుచున్నంతలో ముక్తాఫలధ్వజుఁడును సిద్ధీశ్వరమం దున్నవాఁడు తన పూర్వమిత్త్రుఁ డగు సంయతకుని యవతారమైన మహాబుద్ధితో 'మిత్త్రమా, పద్మావతి తనతావున కాగౌర్యాయతనమున కేఁగిన దని నేఁ దలంచెద అటకే పోద మురమ్ము.' అని చెప్పి మనోగామి యగునావిమాన మెక్కి సవ యస్యుఁడై తానును అమ్యంబికాశ్రమమునకే వచ్చెను చద లినుండి విమానంబును దిగుచున్న యాతని దూరముననే ౘచి చెలులు పద్మావతితో 'దేవీ, ఈయద్భుతమును గనుము, ఈతఁడు దివ్యవిమానంబున నిటకును వచ్చినాఁడు, మానుషుఁ డయిన యీతనికి ఈదివ్యప్రభావ మెట్లుకలిగిది!' అనిరి. పద్మావతి యి ట్లనియె:—'చెలులారా, జ్ఞప్తిచేసికొనుఁడు, అపుడు ఇతనికి శాప మిడిన దృఢవ్రతుని నేనును శపించి యుంటినిగదా, మనుష్యుఁడుగా నవతరించు నాప్రాణవల్లభునికి నీవు ఇచ్ఛానుగతము కామరూపంబు నగు వాహనము వగుదు వని. అట్లే తనకు వాహన మయి విమానరూపముం గయికొన్న యా మునిశిష్యు నెక్కి యితఁడు నిక్కముగా స్వేచ్ఛముగా నెల్లయెడలను చరించుచున్నాఁడు.' అట్లామె

పలుకఁగా చెలులు 'దేవి, అట్లుగా నెఱుంగుదువేని ఏల యీ తని గారవింపవు, ఏమి యాలోచించుచున్నావు?' అని యడిగిరి. సఖులాడిన యీమాట విని పద్మావతి వెండియు ని ట్లనియె:— 'నేను వచించిన ట్లుండవచ్చును, కాని ఇప్పటికిని నాకు నిశ్చ యము కలుగ లేదు. ఇతఁడు సత్యముగా నా మనోవల్లభుఁడే అగునేనియు, అన్యదేహమం దున్న యీతని, నిజదేహముం దాల్పనివానిని, నే నెట్లు గూడఁదగును? కావున మనము డాఁగి యుండి యితని చేష్టితము నిచట కనుదము.' రాజపుత్త్రి యిట్లు పలికి చెలులతోఁ గూడ నదృశ్యురాలై యటనే కనుపెట్టు చుండెను. అంతలో ముక్తాఫలధ్వజుఁడు విమానము దిగి యుత్కంఠ మెయి వయస్యునితో నిట్టులనియె; ఇచట రక్కసుల కయింబడి బెగ్గడిల్లినప్రియను నేఁ గాంచితిని, ఇట మరల నుద్యానంబున స్వయముగా నన్ను వెదకికొనివచ్చిన ప్రియను నేఁ గంటిని, ఇచట శాపహతుని నన్ను అనుసరించునదై ప్రియ పద్మావతి యొట్టకేలకు తపోధనమునిచేత మరలింపఁబడినది. అట్టియాప్రేయసి, ఇపుడు, చూడుము మిత్త్రమా, నాచూపు నుండి పలాయమాన యగుచున్నది!' అతఁడు పలికిన యీ మాటను విని చెలులతో పద్మావతి 'చెలులారా, నిక్కముగా నతఁడే యితడు అయినను తొంటిదేహముం గయికొనని యీతని నేనెట్లు కూడుదును! ఈ విషయంబున నాకు ఆసిద్ధీ శ్వరుఁడే గతి. ఆదేవుఁడే నాకు స్వప్న మొసంగినాఁడు, అతఁడే

యిందుల కుపాయము సేయువాఁడు.' అని వాక్రుచ్చి ఆసిద్ధీ శ్వరక్షేత్రమునకు ససఖీజన యై పోవుచెంచెను. అచట ఈశ్వ రుని పూజించి యద్దేవునిమ్రోల 'పూర్వదేహాగతుని నావల్ల భుని నాకు నిమ్ము, ఒండె మృత్యువునేని యిమ్ము మూఁడవగతి నాకు లేదు.' అని వేఁడుకొని యటనే దేవళముముంగిటనే చెలులతోఁగూడ నుండెను. ఇంతలో ముక్తాఫలధ్వజుడు గౌర్యాశ్రమమునం బద్మావతిని వెదకి వెదకి కానక బెగ్గిలి వయస్యునితో 'మిత్రమా, చెలి యిట దొరకదాయెఁగదా, కాన ఆశంభుక్షేత్రమున కేఁగుదము ; అటను దొరకదయేని నేను తప్పక చిచ్చుం జొచ్చెద.' అని వచించెను. సఖుఁ డి ట్లనియె; 'నీకు నిశ్చయముగా మేలు కలుగనున్నది. మునివా క్యంబును శంకరుని స్వప్నాదేశంబును రిత్తగావు గదా.' ఇ ట్లోదార్చుచున్న యాచెలికానితోఁగూడ ముక్తాఫలధ్వజుఁడు ఆ విమాన మెక్కి సిద్ధీశ్వరమునకుం జనియె. అట్లువచ్చిన యాతనిం బద్మావతి కనియు అదృశ్యురాలరై యుండి సఖులను 'ఇతఁ డిటకును వచ్చినాఁడు కనుఁడు.' అని హెచ్చరించెను. ముక్తాఫల ధ్వజుఁడును దేవుని మ్రోలంజొచ్చి అప్పుడే పూజనొందియున్న యాదేవుం గాంచిన వయస్యునితో 'సఖుఁడా, చూడు, ఎవరో ఇపుడే ఈదేవుని పూజించినారు. నిశ్చయముగా నాప్రియ యిటనే యెటనో ఉన్నది, ఇది ఆచెలువ యొనర్చిన పూజయే.' అని వాక్రుచ్చి ఆమెను అచట వెదకి వెదకి కానక

విరహాతిరేకంబు భరింపలేక మాటిమాటికి 'హా! ప్రేయసీ, పద్మావతీ!' అని మొఱ యిడసాగెను. కోకిలాంగనాకూజిత ములను ఆమెపలుకులు గాను నెమలిపింఛములను ఆమె కేశపాశములు గాను నేత్రామరను ఆమె నెమ్మోము గాను భ్రమయుచు మదనజ్వరము సోఁకి ఒడలెఱుంగక యిటునటు పరువులిడుచుండెను. అంతట మిత్త్రుఁడు ఎట్టకేలకు ఓదార్చి రాజపుత్త్రుని ఇట్లు మందలించెను. ఉపవాసములు పెక్కింటిచే డస్సినవాఁడవు, ఏమి యిట్లారంభించితివి? భూలోక పాతాళములను జయించిన నిన్ను నీ వి ట్లుపేక్ష చేసెదవేమి? నీవు చెంతకు రావేని మీతండ్రి మేరుధ్వజమహారాజును మీ మామ దానవేంద్రుఁడా త్రైలోక్యమాలియు, నిన్ను గోరి నట్టిది యాతని కూఁతు రా త్రైలోక్యప్రభయు, మీతల్లి వినయ వతియు నీ తమ్ముఁడా మలయధ్వజుఁడును, చెఱుపు కలిగె నని తలంచి యందఱు నుపవాసకృశులు ప్రాణములను విడుతురు. కావున రమ్ము, పోయి వారినిరక్షింతము, పగలు ముగిసినదిగదా'. ఇట్లు పలుకుచున్న మిత్త్రునితో ముక్తాఫలధ్వజుఁడు నావిమాన మెక్కి నీవే పోయి వారి నోదార్పుము.' అనెను. సఖుఁడి ట్లనియె. 'నీ విమానము నాకెట్లు సిద్ధించును. అది శాపముచే నీ వాహన మయిన మునిశిష్యుఁడు గదా' అందులకు 'అట్లేని, మిత్త్రమా, నీవును ఇటనే యుండుము, ఇట నేమి జరుగునో చూతము గాక.' అని రాజపుత్త్రుఁడు మందలించెను. వీరి యా

లాపమును విని పద్మావతి సఖులతో 'చెలులారా, ఆనవాళ్లఁ బరికింపఁగా నితఁడు నాపూర్వవల్లభుఁడే అని యెఱుంగుదును, మనుష్యదేహాగతుఁడై యిట్లు శాపముచే నెగులొందుచున్నాఁడు. నాకును నిది సిద్ధకన్యను పరిహసించినందునం గలిగిన శాపమునకు ఫలము.' అని చెప్పుచున్నంతలో వియోగిజన మునకు దావాగ్ని యగుమృగలాంఛనుఁడు ఎఱ్ఱనితేజు మెఱయుచు నుదయించెను. లోకమెల్ల వెన్నెలతో నిండెను, మదన దహనజ్వాలతో ముక్తాఫలధ్వజుఁడు నిండెను. అంత నాసమయంపు జిక్కనయినయుంబోలె రాజపుత్త్రుఁడు ఏడ్చుచుండ, దిగులొంది పద్మావతి అస్పృశ్యయయ్యె యిట్లు హెచ్చరించెను. 'రాకుమార, నీవు ఆశాపూర్వవల్లభుఁడవయేనియు అన్యదేహస్థుఁడవు నాకు పరపురుషుఁడవుగదా, నేనును నీకు పరభార్యనుగదా; కావున ఏల మాటిమాటికిని క్రందించెదవు? ఆమునిమాట తథ్యము యేని యింక తప్పక యుపాయము కలుగును.' పద్మావతి పలికిన యీమాటను విని పద్మావతిం గానక నృపాత్మజుఁడు హర్షవిషాదవిషమం బగు దశావిశేషమున కగ్గమై యామెకి ట్లుత్తర మొసంగెను. 'నీవు పల్కినది సరియే; దేవీ, నేను తొంటిపుట్టువును స్మరించినవాఁడనై అప్పటి యానిజదేహమందే యున్ననిన్ను ఆనవాలు పట్టితిని. నీవు మున్ను నన్ను వైద్యాధరదేహమం దున్నవానిం గాంచినదానవు, ఇపుడు మనుష్యదేహాగతుని నన్ను ఎట్లెఱుంగనేర్తువు? కావున అవశ్య

ముగా నేను ఈ పాడుదేహమును త్యజింపవలసినది.' ఇట్లు వక్కాణించి యాతం డూరకుండెను. 'ఆమెయును అగపడకయే అటనే యుండెను. అనంతరము రాత్రి అధికభాగము గడచిన తర్వాత పూర్వసంయతకుఁడు మహాబుద్ధి నిద్రపోయిన తర్వాత ఆదేహము పద్మావతి పొందరాని దని తెలిసికొని ముక్తాఫలధ్వజుఁడు కొయ్యలు పేర్చి నిప్పంటించి 'స్వామీ, నీ దయచే నేను శీఘ్రముగా నాయాతొలిదేహమును పొంది నా ప్రేయసిని పద్మావతిని గూడెదఁగాక.' యని లింగమూర్తికి శంకరునికి ప్రణమిల్లి మండుచున్న యగ్నికి దేహము నాహుతి యొసంగెను. అప్పటికి మేల్కాని సఖుఁడు మహాబుద్ధి వెదకి ముక్తాఫలధ్వజునిఁ గానక మండుచున్నయగ్నిని గాంచి అందు విరహము నోర్వలేమిం దనమిత్త్రుండు దూలి మడిసె నని తలంచి ఆదుఃఖమున తానును ఆ యగ్నిలోనే దూలెను. దానిం గని పద్మావతియు దుఃఖాకులరై చెలులతో 'చీ! స్త్రీలహృదయము వజ్రాయుధముకన్నను కఠినము. ఈ దుఃఖమును గాంచుచున్న నాప్రాణములు ఎగిరి పోమియే యిందులకు నిదర్శనము. నేను మాత్ర మెంతకాల మీపాడు దేహమును ధరింతును. నాకు ఇప్పటికిని దుఃఖము తుదముట్టినది గాదు, నాపాపమునం జేసి యాముని వచనము నైతము దబ్బఱ యయినది. కావున నాకు మరణమే మేలు. ఇట పరపురుషుల నడుమ నగ్నిలో నుఱుకుట నాకుఁ దగవు గాదు.

కావున అనాయాసముగ నురిత్రాడే నాకు గతి.' అని పలికి శంకరుని మ్రోల నశోకవృక్షమున తీవతో నురి కట్టుకొనం దొడంగెను. ఆసలుగొలుపు మాటలతో నామెను సఖులు నివారించుచుండఁగా, అంతలో, నచటికి తపోధనమునియే వచ్చి 'పుత్త్రీ, సాహసము సేయకు, నావచన మనృతముగాదు, ధైర్యమువలంబింపుము, ఇప్పుడే నీకాంతుఁడు ఇచటకు వచ్చును, నీవు చూతువు. నీతపంబుననే ఆతనికి త్వరలో శాపక్షయమైనది. అట్టి నీతపంబుననే నీకు ఈయనాస్థ యెట్లు కలిగినది! వివాహము సమీపించియుండఁగా నీకు ఈ విషాదమేల? ఇది యెల్ల ధ్యానదృష్టిచే నెఱింగి నేను నీకడకు వచ్చితిని' అని వాక్రుచ్చెను. ఆమునికి నమస్కరించి పద్మావతి క్షణకాలము దోలారూఢవలె నుండెను.

అంతట మర్త్యదేహము కాలిపోఁగా వైద్యాధర దేహముం దాల్చి నవయస్కుఁడు ముక్తాఫలకేతుఁడు ఆమె కాంతుఁడు ఆతావున కేతెంచెను. అంతట క్రొత్తమొయిలుం గన్న చాతకాంగనవోలె ఉదయించిన రాగేందువుఁ గన్న తెల్లగలువతీవవోలె, విద్యాధరేంద్రతనయుని ఆకాశమున వచ్చిన వాని నాతనిం గని పద్మావతి మాటల కందనిసంతోషమును పొందిన దాయెను. ముక్తాఫలకేతుండును చిరకాలము నిర్జల దేశములో సంచరించి బడలిన బాటసారి యేటినింబోలె ఆమెను గాంచి చూపులచేతనే త్రాగివేయుచు మోదం బొందెను. ఆ

యిరువురును శాపరాత్రి నశించినంతట జక్కవలుంబోలె కూడిన వారై తపన తేజసుండగు మునియొక్క పాదములం ద్రెళ్లి తృప్తి నొందినవారైరి. మహామునియు వారిని 'మీరు శాపము తీఱి సంతసంబున వరల నొండొరుల నిటం గూడినందులకు నేను కరము సంతసించుచున్నాఁడను.' అని యభినందించెను. తెల్ల వాఱునప్పటికి భార్యా కనిష్ఠపుత్త్రసమేతుఁడై మేరుధ్వజ మహారాజును పెద్దకుమారుని వెదకుకొని యచటికి వచ్చెను. అట్లే దానవాధిపుఁడు త్రైలోక్యమాలియు తనతనయను త్రైలోక్యప్రభం దోడ్కొని సాంతఃపురుఁడు సానుచరుఁడునై విమానంబున నటకే వచ్చెను. అంత ముని అయ్యిరువురకును ముక్తాఫలకేతుని చూపి, ఎట్లు ఆతనికి శాపవశంబున దేవకార్యార్థమై మర్త్యత్వము వచ్చినదో, ఎట్లు తద్విముక్తి యాయెనో, ఆ వృత్తాంతమును వర్ణించెను. ఆవృత్తాంత మెఱిఁగి అగ్నిపతన మునకు సమకట్టి మేరుధ్వజాదు లందఱు వెండియు మునియుప దేశంబుబడి సిద్ధోదకస్నానము హరార్చనము ఇట్టిసుకృతంబులు సలిపి క్షణములో శోకరహితు లైరి. త్రైలోక్యప్రభయు తటాలున పూర్వజన్మమును స్మరించి 'ఆహా! నేను సిద్ధరాజు కొమారితను, దేవప్రభనుగదా; విద్యాధరాధినాథుఁడు నాకుం బతి గావుత మని నేను తపంబు సల్పుచుండి పద్మావతిచే పరిహాసింపఁబడినదాననై నాకోరిక నెఱవేఱుటకై చిచ్చుం జొచ్చిన దానఁగదా. అనంతరము ఈదైతేయకులంబున జనించి ఎవని

యందు వలపుగొంటినో యాతఁడీ రాజకుమారుఁడు తనతొల్లిటి
వైద్యాధర దేహమును పొందినాఁడు ; అన్యరూపుఁడయిన
యీతని నీదేహముతోఁ గూడుట సరిగాదు, కావున నీతనిం
బొరయ నీయాసురశరీరమును విడిచి యగ్నిలో వేల్చెదను.'
అని తలపోసికొని యీనిశ్చయమును తల్లిదండ్రులకెఱింగించి
ముక్తాఫలధ్వజుని వెంబడి నగ్నిలోఁ జొచ్చెను. అంత నామెను
పూర్వదేహము నర్పించిన దానిని కరుణచే నగ్నిదేవుఁడు చేతఁ
గొని ఆవిర్భవించి, స్వయముగ నిట్లనెను:—'ఓయి ముక్తాఫల
కేతూ, ఈమె నిన్నుఁగూర్చి నాయందు దేహము వదలినది,
కాన నీమెను సిద్ధరాజకన్యను దేవప్రభను భార్యఁగా గైకొమ్ము.'
ఇంతమాత్రము పలికి అగ్నిదేవుఁడు దెప్పుమొగంబు కాఁగా
ఇంద్రాదిదేవతలతోఁ గూడ నటకు బ్రహ్మదేవుఁడు వచ్చెను,
విద్యాధరేంద్రుఁడు చంద్రకేతువును, గంధర్వరాజు పద్మశేఖరుఁ
డును వచ్చిరి. అంత నెల్లవారును సభినందింప, విశ్రుతుఁ డయిన
యాముక్తాఫలకేతునికి గంధర్వరాజు హర్షవ్యగ్రయగు నిజభా
మినియుం దానును యథావిధిగా విభవోత్తరంబుగా నిజసుతను
పద్మావతి నిచ్చెను. ఆవిద్యాధర రాజపుత్త్రుఁడు సుచిరోత్సుకను
దయితను బడసి జన్మతరుఫలము సిద్ధించినట్లు తలంచెను, ఆసిద్ధ
కన్యనుంగూడ వివాహ మాయెను. మలయధ్వజుఁడును యథా
విధిగా తండ్రి యిచ్చిన దైత్యకన్యను త్రిభువనప్రభను బొంది
కృతార్థుఁ డాయెను. అనంతరము కృతార్థుఁ డామేఘధ్వజమహా

రాజు ద్వీపసహితమైన యీభూలోకమునకెల్ల ద్వితీయపుత్త్రుని రాజుగా నభిషేకించి తాను భార్యతోఁగూడ తపోవన మాశ్రయించెను. దైత్యాధినాథుఁడు త్రైలోక్యమాలి సభార్యుఁడై తన స్థానమునకుం బోయెను. ఇంద్రుఁడు ముక్తాఫలకేతునికి విద్యుద్ధ్వజుని రాజ్యలక్ష్మి నొసంగెను. 'ఈ ముక్తాఫలకేతుఁడు విద్యాధరాసురైశ్వర్యము ననుభవించుఁగాక, దేవతలు తమ తమ నెలవుల కేఁగుదురు గాక.' అని యాసమయమున ఆకసము నుండి వాక్కు వినసాయెను. దానిని విని సంతుష్టులై బ్రహ్మేంద్రాదులు యథాస్థానములకుం జనిరి. శాపవిముక్తుఁడైన నిజ శిష్యుం దోడ్కొని తపోధనమునియు నేఁగెను. ఇరువురు పెండ్లములతో వెలుఁగొందుచున్న తనయుని ముక్తాఫలకేతునిం దోడ్కొని చంద్రకేతుఁడును వైద్యాధర పదమునకుం బోయెను. చంద్రకేతుఁడు చిరకాలము కొమారునితోఁ గూడ విద్యాధర రాజ్యలక్ష్మిని అనుభవించి అనంతరము అతనిమీఁద తన రాజ్యభారమును మోపి తాను భార్యాద్వితీయుఁడై తపోవనమున కేఁగెను. ముక్తాఫలకేతుఁడును మున్నే దేవేంద్రుని వలన అసురరాజ్యమును బొందియున్నవాఁడు ఇపుడు తండ్రి వలన విద్యాధరచక్రవర్తిత్వమును బొంది మూర్తీభవించిన నిర్వృతితోసుంబోలె పద్మావతితోఁ గూడ పదికల్పములు ఉభయసామ్రాజ్య మహైశ్వర్యమును అనుభవించెను. అనంతరము భావము లెల్ల తుదిని నీరసముల యని యాలోచించు-

కొని అంతమున మునీంద్రవనము నాశ్రయించి తపంబు సలిపి పరజ్యోతిని సాక్షాత్కరించుకొని పరమేశ్వర సాయుజ్యముం బొందెను.

ఇట్లని యాదివ్యహంసయుగ్మమువలన బ్రహ్మదత్త నృపతి యీసరసామృతకథ వినిని, తద్వ్యాఖ్యానవిజ్ఞానోపదేశంబునుం బొంది, దివ్యగతిం బొందెను. ఆతండును అతని భార్యా సచివులును ఆపక్షులు రెండును సిద్ధీశ్వరమునకుం బోయి యట నాశాపదేహములను వదలి యథాపూర్వము అందఱును శివానుచరత్వముం బడసిరి.

ఓ మునులారా, ఇట్లని మదనమంచుకావిరహంబున నేను గోముఖునివలన కథను విని క్షణమాత్రము మనస్సును ధైర్యము గొల్పుకొంటిని.

ఇట్లు కశ్యపాశ్రమములో మును లెల్ల గోపాలకసహితులై నరవాహనదత్త చక్రవర్తి చెప్పిన యీకథను విని పరితోషము నొందిరి.

పద్మావతీలంబకము సమాప్తము.



# విషమశీలలంబకము.

## ౧-వ తరంగము.

క. చంద్రాననార్ధదేహుని
జంద్రాంశుశ్వేతభూతిఁ జంద్రసితాంశుక
జంద్రార్కానలలోచనుఁ
జంద్రార్ధకిరీటుఁ గొలుతు సతతము భక్తిన్.

ఆ. సిద్ధులిడెడు నాఁగఁ జెలువారు నెవ్వాని
కరము కుంచితాగ్రకంబుఁ గేలి
కొన్నమితము నాతఁ డొప్పుగా మిముఁ గాచు
గజముఖుండు [illegible]ందుకరణ మెఱసి.

అనంతరము అసితగిరియందు కశ్యపాశ్రమమున నరవాహనదత్తుఁడు ఆమునులతో నెల్ల నిట్లు వక్కాణించెను.— నన్ను దేవీవిరహంబున వేగవతి కొనిపోయి రక్షణార్థము విద్యాహస్తంబున నిడిపోయినప్పుడు నేను విరహాక్రాంతరుండను పరదేశగుఁడను ప్రాణము లుజ్జగింప సమకట్టి వనమున తిరుగుచు కణ్వమహామునిం గాంచి నమస్కరించితిని. ఆయన నన్నుఁ గాంచి యోగదృష్టిచే నావృత్తాంతము నెఱింగి దుఃఖితుని నన్ను

తన యాశ్రమమునకుం గొనిపోయి కనికరమున ని ట్లనియె. సోమవంశోద్భవుఁడవు వీరుఁడవు నయ్యును ఇట్లు మోహామునం బడెదేమి? దేవాదిష్టమై తప్పని దైన భార్యాపంగమందు నీకు ఈయనాస్థ తగునా ? సంభవింపఁ దగని సంగములు సయితము ఈలోకమునఁ నరులకు సంభవింపుచుండును. అందులకు విక్రమాదిత్యునికథను వర్ణించెదను వినుము.

యుగాదిలో విశ్వకర్మ సిర్మించినది అవంతిలో ఉజ్జయిని యని విఖ్యాత మయిన నగరి శంకరునినివాసము కలదు. ఆపురి పతివ్రతవలె పరాధృష్య, పద్మినివలె సిరికాటపట్టు, సజ్జనుల బుద్ధివలె ధర్మాఢ్య, భూమివలె బహుకౌతుక. ఆనగరమున మహేంద్రాదిత్యుఁ డని జగజ్జేత అమరావతియందు మహేంద్రుఁడువలె విపక్షబలసూదనుఁడు రాజుండెను. ఆ రాజు శౌర్యమున నానాశస్త్రాయుధుం డయ్యుఁరూపమున కుసుమాయుధుండై, ఈవియందు ముక్తకరుఁడయ్యును కత్తియందు బద్ధముష్టికరుం డై యొప్పుచుండెను. ఇంద్రునికి శచివలె, శంకరునికి గౌరివలె హరికి లక్ష్మివలె ఆరాజునకు సౌమ్యదర్శన యను పేరిది భార్య యుండెను. ఆయనకు సుమతి యను వాఁడు మహామంత్రి, వజ్రాయుధుఁ డనువాఁడు కులక్రమాగతుఁడు ప్రతీహారుఁడు. వారితోఁ గూడ నావీరుఁడు పుడమిని పాలించుచు పుత్త్రార్థము శంకరుం గొలుచుచు నానావ్రతములు సలుపుచుండెను.

ఈలోకల దేవతాగణసేవితకందరంబై అన్యదిక్కులం గెలిచినకు వేరదిక్కు నప్పుగవ్వో యన నొప్పుచున్న కైలాసనగేంద్రమందు పార్వతీసమేతముగా నెలకొనియున్న పురారిని ఇంద్రాదిదేవతలు మ్లేచ్ఛోపద్రవదుఃఖితులు దర్శించి నమస్కారానంతరము స్తోత్రము సలిపి కూర్చుండిరి. ఆగమనకారణమును దేవదేవుం డడుగఁగా నిట్లు మొఱ యిడిరి.—'దేవా, నీవును విష్ణువును ఏయసురులను సంహారించితిరో వా రిపుడు వెండియు భూలోకంబున మ్లేచ్ఛులుగా నుద్భవించినారు, బ్రాహ్మణులను చంపుదురు, యజ్ఞాదిక్రియలను ఛెడఁగొట్టుదురు, మునికన్యలను హరింతురు; ఈపాపాత్ములు ఇంక నే మేమి సేయరు! ప్రభూ, సారెసారెకు భూలోకముచేత దేవలోకము సుఖమొందును, బ్రాహ్మణులు అగ్నిలోఁ జేయుహోమము దివౌకసుల తృప్తికే గదా! భూలోకమునెల్ల మ్లేచ్ఛు లాక్రమించుటం జేసి వషట్కారమంగళములు సమసినందున యజ్ఞభాగాది విచ్ఛేదంబు కలుగ దేవలోకము క్షయించుచున్నది. కావున నిందుల కేదే నొకయుపాయ మాలోచింపుము. ఆమ్లేచ్ఛులను రూపుమాపఁగల వీరు నొకని భూలోకమునకుం బంపుము.' ఇట్లు వారు మొఱయిడఁగా ముక్కంటివారిని, పొండి మీరు, ఈవిషయమున మీరు చింతింపవలదు, సుఖ ముండుఁడు. ఇందుల కుపాయము నేను త్వరగానే చేసెదను.' అని పల్కి వారిధామంబులకుం బంపెను.

వా రేఁగినయనంతరము పార్వతీసహితుఁడు పరమేశ్వరుఁడు మాల్యవంతుఁ డను పేరి గణోత్తమునిం బిలిచి యిట్లాజ్ఞాపించెను. "పుత్త్రా, భూలోకములో మనుష్యజాతిలో ఉజ్జయినీపురములో మహేంద్రాదిత్యభూపతికి పుత్త్రుఁడవు శూరుఁడవుగా జనింపుము. ఆ రాజు నాయంశమునం బుట్టినవాఁడు, అతని రాణి అంబికాంశమునం బుట్టినది. వారియింటఁ బుట్టి దేవకార్యమును నిర్వహింపుము. నాప్రసాదంబున సప్తద్వీపేశ్వరుఁడవై భూలోకము నేలుదువు. యక్షరాక్షసబేతాళురు సయితము నీవశమం దుందురు. మనుష్యభోగముల ననుభవించి యనంతరము మరల మాకడకు వత్తువు.' పురారి యిట్లుపదేశింపఁగా మాల్యవంతుఁడు 'దేవా, నీయాజ్ఞను నేను దాఁటనేరనుగాని, మానుష్యకమందుఁ భోగము లెక్కడివి? అందు బంధుమిత్త్రభృత్యవియోగములు ఓర్వరానివి గదా; ధననాశము, ముదిమి, రోగము, వీనివలనివెత తప్పదుగదా.' అని విన్నవించుకొనెను. 'హోరా ఖో, ఇట్టిదుఃఖములు నీకు నిర్దోషునికి సంభవింపవు, నాప్రసాదంబున సర్వకాలము సుఖితుఁడవుగా నుందువు.' అని ధూర్జటి యనుగ్రహించెను.

అంతట మాల్యవంతుఁడు అదృశ్యుండై మహేంద్రాదిత్యుని యుజ్జయిని కరిగి ఆసమయమందే ఋతు వొందియున్న పట్టపుదేవి గర్భంబునం జేరెను. ఆసమయంబున చంద్రకళాధరుఁడు మహేంద్రాదిత్యనృపతికి స్వప్నమందు "ఓ రాజా,

నీభక్తికి మెచ్చితిని, నీకు సప్తద్వీపను వసుంధరను పరాక్రమముచే నాక్రమించునట్టి పుత్త్రుండు జనించును. ఆవీరుండు పాతాళాకాశములలోని యక్షరక్షః పిశాచాదులను సయితము వశకలుచుకొనును. మ్లేచ్ఛసంఘములను సంహరించును. దానం జేసి యాతనికి విక్రమాదిత్యుం డని నామము కలుగును. శత్త్రువులయందు అతండొనర్చు వైషమ్యంబునం జేసి విషమశీలుండనియు నామాంతరము కలుగును.' అని యనుగ్రహించి దివ్యమైన గం బాయెను. అంత నారాజు మేల్కొని తెల్లవారినంత తన మంత్రులకు ఆస్వప్నమును సంతోషముతో తెలియంజేసెను. మంత్రులు సంతసించి స్వప్నమందలి హరాదేశంబునకు పుత్త్రప్రాప్తి ఫల మని పల్కిరి అంతలో అంతఃపురమునుండి చేటిక పండొకటి కొనివచ్చి 'స్వప్నములో దేవేరికి సాంబమూర్తి యీపండు ఇచ్చినాఁడు' అని చూపించెను. మంత్రులు రాజును అభినందించిరి. రాజు నిక్కముగా తనకు శంకరుండు పుత్త్రు నొసంగె నని పలుమారు ప్రశంసించుచు హర్షంబున నుండెను. అనంతరము అతనిరాణి గర్భిణియై ఉదయింప నున్న సహస్రకరునిమండలంబుచే ప్రాతఃకాలంబునం బ్రాగ్దిక్కు వోలె దేదీప్యమాన యాయెను. అంత నామెకు గర్భస్థుండయిన పుత్త్రునిశోభకుం జేయంబడిన స్తన్యరక్షణముద్రలో యన కుచాగ్రములు నలు పొందెను. ఆమె కలలో యక్షరాక్షసవేతాళులచే నెల్ల వినతు లొందుచు వేదుసంద్రము-

లను దాఁటుచుండెను. కాలమున కామె తనయునిఁ గనియెను. సూర్యునిచేత నాకాశమువలె ఆశిశువుచే సూతికాగృహము చాల ప్రకాశించుచుండెను. అతని పుట్టువునకు కురియుచున్న పువ్వానయే నగవుగా, దేవదుందుభిధ్వానములే నాదములుగా, దివి తనహర్షముం దెల్లము సేసెను. ఆకాలపు టుత్సవానందమున ఆనగర మెల్ల మత్తాగొన్నదివోలె, గాలి సోఁకినది వోలె, వాతక్షోభము నొందినదివోలె, నాయెను. ఆసమయంబున నా రాజు అనవరతము బంగారము కురియుచుండఁగా సాగతులు దక్క అనీశ్వరులు వేఱులేరైరి శివుఁడియానతిబడి మహేంద్రాదిత్యభూపతి యాకుమారునికి విక్రమాదిత్యుఁ డనియు విషమశీలుఁ డనియు నామము లిడెను.

అనంతరము కొలఁదిదినములకు మహేంద్రాదిత్యభూపతి మంత్రికి సుమతికి పుత్త్రుఁడు జనించెను. ఆతనికి మహామతి యని పేరిడిరి. ప్రతీహారుఁడు వజ్రాయుధునికి భద్రాయుధుఁడు పుత్త్రుఁడు జనించెను పౌరోహితునికి మహీధరునికి శ్రీధరుఁడు సుతుఁడు జనించెను. ఆ ముువ్వురతోను విక్రమాదిత్యుఁడు తేజోవీర్యబలములతోనుం బోలె వర్ధిల్లుచుండెను. ఉపనయనమయినంతట నా విక్రమాదిత్యునికి గురువులు హేతుమాత్రభూతులు గాని విద్యలెల్ల స్వయముగానే ప్రాదుర్భవించినవి. అతఁ డేయేవిద్యను ఏయేకళను ప్రయోగించెనో అందం దెల్ల అతని యుత్కర్ష సాటిలేనిదని ఆయావిద్యను ఆయాకళను

ఎఱిఁగిన వా రెఱుంగుచుండిరి. దివ్యాస్త్రములతో ఆరాజ
సుతుఁడు పోరుచుండఁగా కాంచిన జనులు రామాదిధనుర్ధర-
కథలందును ఆదరము సడలించిరి. ఓడి శరణుఁజొచ్చిన రాజు
లర్పించిన కన్నియలను రూపవతులను ఆయాయితరుల సిరులనుం
బోలె నతనితండ్రి గైకొనుచుండెను జనప్రియుని విక్రమాధికుని
తనయుని యౌవనస్థుని రాజ్యాభిషిక్తునిఁ జేసి తండ్రి మహేం
ద్రాదిత్యనృపతి వృద్ధుఁడు భార్యాసచివసమేతుఁడై కాశికిం
బోయి మహేశ్వరుని శరణుఁజొచ్చెను. విక్రమాదిత్యుఁడును
తండ్రివలననుండి వచ్చిన యారాజ్యమును పొంది ఆకసమును
పొందిన సూర్యునివలె ప్రతాపము నెఱపఁజొచ్చెను. వంగిన
యాతని కోదండంబున గుణారోప మవ్వుటం గాంచి యాశిక్ష
చేతసుంబోలె రాజులెల్ల ఉచ్ఛిరసు లయ్యును వంగినవారైరి.
దివ్యప్రభావుఁ డారాజు చెడునడతగలవారిని బేతాళరాక్షస
ప్రభృతులను సయితము సాధించి చక్కఁగ నేలుచుండెను. ఆ
దిత్యుని వెలుఁగులు వోలె విక్రమాదిత్యునిసేనలు దిక్కులను
ప్రసాధించుచు భూలోకమునం గ్రమ్మరుచుండినవి. ఆరాజు
మహావీరుఁ డయ్యును పరలోకమువలన భీరువై, శూరుఁడయ్యు
ను అచండకరుఁడై, శుభర్త యయ్యు నంగనాప్రియుం డై
యొప్పుచుండెను. ప్రజలలో తండ్రి లేనివారికి అతఁడు తండ్రి,
బంధువు లేనివారి కాతఁడు బంధువు, అనాథుల కతఁడు నా
థుఁడు, ఏవారి కతఁ డేమి గాఁడో చెప్పఁజాలము. శ్వేతద్వీప-

మును, పాలసముద్రమును, కైలాసమును, హిమాలయమును, నిర్మించుటయందు బ్రహ్మకు సక్కమగా ఆతేనికీర్తి యుప మానముగా నొప్పెను.

ఒకనాఁ డారాజు కొలువుదీరి యుండఁగా ప్రతీహారుఁడు భద్రాయుధుఁడు ప్రవేశించి యిట్లు నివేదించెను. 'దేవా, దక్షిణా పథమును జయించుటకై ససైన్యముగా బోయియున్న విక్రమ శక్తి కడకు ఏలినవారు పంపినదూత అనంగదేవుఁడు సద్వితీయుఁ డుగా వచ్చి ద్వారమున నున్నాఁడు. హర్షవంత మాతని ముఖము శుభమును దెలుపుచున్నది.' 'రమ్మనుము' అని రాజు పలికెను. అంతట ప్రతీహారుఁడు సగౌరవముగా ననంగదేవుని ఆ రెండవవానితోఁగూడ రాజసన్నిధికిం దోడితెచ్చెను. వచ్చి సప్రణామంబుగ జయశబ్దము పలికి మ్రోలఁ గూర్చున్న యా దూతను ప్రభు విట్లు ప్రశ్నచేసెను 'సేనాపతి రాజు విక్రమ శక్తి కుశలి గదా ? వ్యాఘ్రబలాదిరాజులును సేమంబున నున్నారుగదా? ఆదండులోని కడకు రాజపుత్త్రులకును ప్రధానుల కును సేమము గదా ? ఏనుఁగులకు గుఱ్ఱములకు అరదంపుదళ ములకు కాల్బంట్లకును సేమము గదా?' ఇట్లు రాజడుగఁగా అనంగదేవుఁడు వక్కాణించెను 'విక్రమశక్తికి భద్రము, సకల సైన్యమునకును కుశలమే. పడమటిదిక్కుతోఁగూడ దక్షిణ దిక్కెల్ల యేలినవారు జయించినారు, సౌరాష్ట్రముతో సయితము మధ్యదేశంబును, అంగవంగసమేతముగా తూర్పు

దిక్కును, కశ్మీరదేశముతోఁగూడ నుత్తరదిక్కును, ఏలిన వారికి కప్పము కట్టునట్లు చేయఁబడినవి. మ్లేచ్ఛసంఘములు రూపుమాసినవి, ఇతరులెల్ల లోఁబడినారు, వారు వారందఱు విక్రమశక్తికటకములో ప్రవేశించినారు ప్రభూ, రాజులతో నెల్ల విక్రమశక్తియు వచ్చి యిటకు రెండుమూఁడు మజిలీలలో నున్నాఁడు.' ఇట్లు మేలు వచించిన యాదూతను విక్రమా దిత్యుఁడు వస్త్రాలంకారగ్రామములతో నిండించెను. వెండియు మహారాజు దూతను 'అనంగదేవ, నీవు ఇటనుండి పోయి యేయేదేశములు విలోకించితివి, ఎక్కడెక్కడ నేమేమి వినోద ములం గంటివి, చెప్పుము భద్రా.' అని యడిగెను. అనంగదేవుఁ డిట్లు పలికెను.

దేవా, నేను ఏలినవారియాజ్ఞచే నిటనుండి తరలి క్రమ ముగా విక్రమశక్తికడకు అనేనాసముదయమునకుం బోయితిని. శిబిరము మిళితానంతనాగేంద్రనక్రకహారిశోభితంబును సపక్ష క్ష్మాభృదాశ్రితంబును విస్తీర్ణంబునై సముద్రముం గ్రేణిసేయు చుండెను. నేను పోఁగానే ప్రభువుకడనుండి వచ్చితిని గదా యని నన్ను విక్రమశక్తి ప్రణామపూర్వకంబుగా నత్యంతము సత్కరించెను. ఆవిజయస్వరూపమును విచారించుకొనుచు నే నున్నంత నటకు సింహళేశ్వరునికడనుండి దూత వచ్చి యిట్లు తెలిపెను. "అయ్యా, మారాజు మీ కిట్లు విన్నవించు చున్నాఁడు:—'రాజునకు హృదయభూతుఁ డనంగదేవుఁడు

వచ్చియున్నాఁడని నీకడకు వచ్చి మరలి యేతెంచిన నా దూతలు నాకుం దెల్పినారు. కావున ననంగదేవుని త్వరగా నాకడకుం బంపుము, ఆతనితో కల్యాణ మను నొక రాజకార్యమును తెలియఁజేసెదను.' ఇదె మా ప్రభువు విన్నపము" ఇట్లని యా సింహళేశ్వరునిదూత, నా యెదుట విక్రమశక్తితో విన్నవింపఁగానే, విక్రమశక్తియు నన్ను సింహళేశ్వరునికడకుం బోయి నాతో నాతఁడు చెప్పఁగల యావృత్తాంతము నెఱుంగుమని వెంటనే పయనము చేసెను.

నే నాదూతతోఁ గూడ సముద్రమార్గమున ఓడలో సింహళద్వీపమున కేఁగి యందు రాజధానిని విచిత్రరత్నప్రాసాదము హేమమయము నై యమరావతివోలె వెలుఁగొందుచున్నదానిం బ్రవేశించి అందు క్రమముగా సురలచే పరివేష్టితుఁడయిన యింద్రునింబోలె వినీతులగు సచివులచే పరివృతుఁడయినవానిని సింహళేశ్వరుని వీరసేనుని దర్శించితిని. అతఁడు నన్నాదరించి ప్రభుక్షేమ మడిగి అధికసత్కారముతో నన్ను విశ్రమింపఁజేసెను. మఱునాఁ డా రాజు ఆస్థానమునకు నన్ను రావించి మీయందు భక్తిం దెలుపుచు తన మంత్రులసన్నిధిని నాతో నిట్లనియె. 'ఆర్యా, నాకు మర్త్యలోకైకసుందరి కూఁతు రొకతె కలదు. దానిపేరు మదనలేఖ, మీరాజునకు దాని నిచ్చెద, ఆయనకు అది తగినభార్య, ఆయన దానికి తగినపతి. ఇట్లు మీస్వామికై దానిని గ్రహించుటకై నిన్నిచటికి రావించి

తిని. ఇఁక నీవు నాదూతం దోడ్కొనిపోయి యీవృత్తాంత
మును స్వామి కెఱింగింపుము. నేను వీరారు పోయిన యనంత-
రము త్వరలోనే నాతనయం బంపెదను.' ఇట్లు వచించి యా
రాజు ఆస్థానికి నిజతనయను రూపలావణ్యయౌవనములచే ఆభ
రణాభోగము నలంకరించుచున్నదానిని రావించి యొడిం
గూర్చుండఁబెట్టుకొని చూపి నాతో 'నీకొరకై యీమె నిచ్చి
తిని కైకొమ్ము' అనియెను. నే నారాకొమరితం గాంచి యా
రూపమున కాశ్చర్యపడి మోదంబున 'ఈమెను మారాజుకై
గ్రహించితిని.' అని వచించితిని. ఇట్లు తలపోసితిని. 'ఆహా!
వింతలు సృజియించుటయందు బ్రహ్మ తనియఁడు గదా. ఏలన
తిలోత్తమను సృజించియు నుత్తమను ఈమెను సృజించి
నాఁడు.'

అనంతరము నే నారాజువలన సత్కారము లొందిన
వాఁడనై యాతఁడు పంపిన దూత ధవళసేనునితో ఆదీవినుండి
తరలి ఓడ యెక్కి కడలిని వచ్చుచుండఁగా అంతలో ఆకస్మిక
ముగా మాకు కడలినడుమ ఇసుకతిన్నె యొకటి గొప్పది యగ
పడెను. దాని నడుమ నద్భుతరూపలు ఇరువురు కన్యక
లుండిరి; ఒకతె ప్రియంగుశ్యామాంగి, రెండవది చంద్రామల
ద్యుతి వా రిరువురుం దనతనవర్ణమునకుం దగిన వస్త్రాభరణ
ములం దాల్చి యొప్పుచు రత్నకంకణముల మ్రోఁతతోఁగూడ
హస్తతాళములు చఱచుచు ఒక యాటలేటిపిల్లను మ్రోల

ఆడించుచుండిరి. అది రత్నచిత్రితమై జాంబూనదమయ మ య్యును సజీవమై యుండెను. దానిం గని మేము ఆశ్చర్యమున నొండొరులతో 'ఏమి యీయాశ్చర్యము! ఇ దేమి కలయో? మాయయో? లేక మతిభ్రమయో? సముద్రములో ఆకస్మిక ముగా ఇసుకతిన్నె బయలుపడుట యెట్టిది, అది దిట్టి యీకన్యక లేమి? వీరికి రత్నచిత్రాంగము సజీవము ఈలేడిపిల్ల యేమి?' అని పలికి కొనుచున్నంతలో గాలి రేగి సముద్రమును తల క్రిందు సేయసాగెను. దాన మాయోడ కంపిలుచున్న యల నెత్తికెక్కి పగిలెను. అందలి జనులు మునిఁగి మొసళ్లకు మేఁత యైరి. మమ్ము ఆకన్యలిరువురును వచ్చి బాహువులం బట్టికొని యెత్తి మొసళ్ల వాతం బడనీయక యిసుకతిన్నెం జేర్చిరి. ఆ యొడ్డును అలలు ముంచుచుండఁగా బెగ్గడిల్లిన మమ్ము ఓదార్చి వారు ఒక గుహాగర్భమునకు గావలయుఁ గొనిపోయిరి. అందు మేము నల్గడలుం బరికించునంతట సముద్రమును లేదు. గట్టును లేదు, లేడిపిల్లయు లేదు, ఆకన్యలును లేరు, మఱి యేమన నానాద్రుమశోభిత మొక దివ్య కాననము కానఁబడియెను. 'ఏమి యీ యాశ్చర్యము! ఇది నిక్కముగా ఏదో మాయ,' అని పలికికొనుచు మేము సంచరించుచుండ నొక మహాసరోవర ము గానఁబాయెను. ఆసరోవరము మహాత్ముల యాశయము వోలె స్వచ్ఛగంభీర విస్తీర్ణంబై మూర్తిదాల్చిన నిర్వాణమో యన తృష్ణాసంతాపశమనం బై యొప్పుచుండెను. అచట

సాక్షాద్వనలక్ష్మియో యన స్నానార్థము వచ్చిన యొకవరాంగ
నను సపరివారం గాంచితిమి. ఆమెయు పల్లకి దిగి కమలములు
కోసి సరస్సున జలకమాడి పురారిని స్మరించెను. అంతట మా
యబ్బురముతోఁగూడ సరస్సునుండి యుద్భవించి లింగాకృతి
శివుఁడు సాక్షాత్తుగా ఆమె చెంగటి కరుదెంచెను. దివ్యరత్న
మయుఁ డాశివుని ఆమె తన విభవమునకుం దగిన యుపచారభోగ
ములతో నర్చించి వీణాసేవ సేయం దొడంగెను! దక్షిణామార్గ
ము నవలంబించి స్వరతాళపదములతో నాసుందరి అవధాన
ముతో చక్కఁగా పాడుచు వాయించుచుండెను. ఆగానమును
విని దానిచే నాకర్షింపంబడి చదలిదారిని అట కేతెంచిన సిద్ధా
దులు సమితము నిశ్చేష్టులై చిత్తరుబొమ్మలు వోలె నొప్పు
చుండిరి. ఆమె సంగీతము నిలిపి శంకరుని ఉద్వాసించెను. దేవు
డును అటనే కొలనిలో మునింగెను. అంత నాలేడికంటి తానును
లేచి పల్లకి యెక్కి పరివారముతోఁ గూడ చనసాగెను. ఈమె
యెవ రని పలుమారు సనిర్బంధముగా మే మడుగుచు వెంటఁ
జనుచున్నను తత్పరిజను లెవ్వరును మాకు ఉత్తర మొసంగ
రైరి. అంతట నేను సింహళేశ్వరదూత కితనికి నీప్రభావమును
ఎఱుకపఱుచువాఁడనై యామె నిట్లు బిగ్గరగా పలుకరించితిని.
'ఓ కల్యాణీ, నీ వెవతెవో నాకుం దెలుపకయే పోయెదవేని
నిన్ను శ్రీవిక్రమాదిత్య పాదసరోజమును దాఁకి శపించెద.'
ఆమాట విన్నమాత్రాన నామె పరివారమును తొలఁగించి

పల్లకి దిగి నాకడకు నడిచి వచ్చి మధురవాక్కుల నిట్టు లనియె. 'ఆర్యా, శ్రీవిక్రమాదిత్యదేవునికి కుశలముగదా, నిన్న డుగ నేల యనంగదేవా, సర్వము నాకే విదితము; ఆతేనికార్య మునకై నిన్ను ఈమాయపన్ని యిటకుం దెచ్చితిని. ఆయన నాకు పూజ్యుండు, నన్ను మహాభయమునుండి కాచినవాండు. కావున నాయింటికి గమ్ము, నే నెవతెనో, నా కారాజు ఏల పూజ్యుండో, ఆతని కార్యమ దేదో, సర్వమును అట నీకు వచింతెదను!' ఇట్లు పలికి యామె [illegible] పల్లకి మాని పాద చారిణియై మమ్ము తన పీఠకిం గొనిపోయెను. నానారత్నవిచిత్రమై హేమరచితమై ద్వారములందు నానారూపధరులు నానా యుధులు వీరపురుషులు కాచుచుండ నావీడు స్వర్గోపమమై విరాజిల్లుచుండెను. అచట నామె మమ్ము మూర్తీభవించిన దివ్య సిద్ధులో యన నద్భుతరూపలై యున్న వరాంగనలచే స్నానానులేపన సద్వస్త్రభూషణములతో సమ్మానింపించి విశ్రామ మొందించెను.



## ౩-వ తరంగము.



ఇట్లు వక్కాణించి యనంగదేవుండు వెండియు స్వస్థాన గతునికి విక్రమాదిత్యునికి వాక్రుచ్చుచున్నాండు. భోజన

పైనతర్వాత యామె చెలుల నడుమనుండి నాతో నిట్లనియె.—
అనంగదేవా, నీ కిప్పుడు సర్వమును దెలిపెద వినుము. నేను
కుబేరుని తమ్మునికి మణిభద్రునికి భార్యను. యక్షరాజునకు
దుందుభికి కొమారితను, నాపేరు మదనమంజరి. నేను నా
భర్తతోఁగూడ నదీతీరములయందును కొండలందును ఉద్యాన
వనములందును యథాసుఖము విహరించుచుండి, ఒకనాఁడు
వల్లభసమేతనై యుజ్జయినియందలి మకరందాఖ్యోద్యానము
నకు విహారార్థము పోయియుంటిని. అట దైవవశంబున వేకు
వను ఖండకాపాలికాఖ్యుఁ డొకఁడు విహారఖేదసుప్తోత్థితను
నన్నుం గాంచి కామపరవశుఁడై పాపాత్ముఁడు నన్ను భార్య
నుగా సాధించుటకు మంత్రపూర్వకముగా హోమకర్మ
మారంభించెను. ఆ వృత్తాంతమును నేను నా ప్రభావంబున
నెఱింగి నాభర్తకుం దెలిపితిని. ఆయన తనయన్నకు కుబేరుని
కెఱింగించెను. కుబేరుఁడు పోయి బ్రహ్మతో చెప్పుకొనెను.
బ్రహ్మదేవుఁడు ధ్యానదృష్టిచే నెఱింగి ఇట్లు వెరవు చెప్పెను.
'నిక్కము, నీతమ్ముని భార్యను ఆ కాపాలికుఁడు హరింప
నున్నాఁడు. యక్షసాధనమంత్రముల శక్తి యట్టిదిగదా.
మంత్రప్రభావము ఈడ్చుకొని పోవుచున్నప్పుడు ఆమె విక్రమా
దిత్యమహారాజును ఆక్రందింపవలసినది, ఆతఁడామెను రక్షిఁ
చును.' బ్రహ్మ చెప్పిన యీయుపాయమును ధనదుఁడు తమ్ము
నితో చెప్పెను, ఆతఁడు నా కెఱింగించెను. ఇంతలో క్రమ-

సిద్ధ మయిన మంత్రంబున నాఖండ కాపాలికుండు శ్మశానంబున హోమము గావించి మంత్రముచే న న్నాకర్షించెను. నేను మంత్రాకృష్ట నై భయ మొంది నెమ్ముబుం బునుకలు నిండి భూతగణసేవితమై భైరవాభంబైన యాశ్మశానముం జొచ్చి తిని. అచట మండలమందు శవమును వెదకిలవేసి, అగ్ని యందు హోమము చేసియున్న యాపాపాత్ముని కాపాలికుని నేఁ గంటిని. కాపాలికుండు తనకృత్యసిద్ధించి యట్లువచ్చిన నన్నుం గని గర్వాంధుఁడై దైవవశంబున చెంగటియేట నీరుద్రావ నరి గెను. అంతలో నేను బ్రహ్మావచనమును స్మరించి 'ఆహా, ఆ మహారాజును విక్రమాదిత్యుని ఏల నే నాక్రందింపఁగూడదు, ఒకవేళ నాతఁ డిట రాత్రి తిరుగుచుండునేమో!' అని తల పోసి బిగ్గరగా 'హా! మహారాజ, విక్రమాదిత్య నన్నుఁ గావుము; ఓజగద్రక్షామణీ, ఇదె చూడుము, నీరాజ్యములో ఈకాపాలికుఁడు బలాత్కరించి సాధ్విని కులవధువును ధనాఢ్య తుని తమ్ముఁ డగు మణిభద్రుని యిల్లాలిని దుందుభికూఁతును యత్నాంగనను మదనమంజరీనామధేయను నన్ను ధ్వంసింప జతనపడియున్నాఁడు.' ఇట్లు నే నాక్రందించినంతనే దీప్తిమం తుఁడు జ్వలించుచున్నాఁడో యన నొప్పుచున్నవాఁడు కృపాణ పాణి యావిక్రమాదిత్యమహారాజు నాకడకువచ్చి యిట్లనియె 'కల్యాణీ, భయపడకు, స్వస్థముగా నుండుము, నిన్ను నే నీ కాపాలికునివలననుండి రక్షించెదను. నారాజ్యములో ఇట్టి

యధర్మము సలుప నెవ్వఁడు దంట?' ఇట్లు భయము దీర్చి యామహారాజు అగ్నిశిఖనాము నొక వేతాళుని పిలిచెను. వాఁడును కన్నుల నిప్పులురల నున్నతుఁడు ఊర్ధ్వశిరోరుహుఁడు వచ్చి 'ఇదె వచ్చితిని, నే నేమి చేయవలయునో చెప్పుము.' అని రాజు నడిగెను. అంతట రాజు వేతాళునితో 'ఇదె యీ కాపాలికుని పరదారాపహరణోద్యుక్తుని పాపాత్ముని నీవు చంపి భక్షింపుము.' అని యాజ్ఞాపించెను. అంత నా వేతాళుఁడు పూజామండలమునందున్న యాశవములో ప్రవేశించి లేచి చేతులు సాఁచి నోరు దెఱచుకొని కాపాలికుని నీరు ద్రాగి వచ్చిన వానిని తన్నుం గని పలాయనపరాయణుం డయినవానిని వెంటఁ దఱిమి పిక్కలం బట్టుకొని మింట గిఱగిఱం ద్రిప్పి తటాలున నేలం గొట్టి ఒక్కటన వాని దేహమును మనోరథమును రెంటిని చూర్ణీకరించెను. కాపాలికుఁడు చావఁగా మాంసగృధ్నువులగు భూతములు వచ్చి కూడినవి. వానిలో యమశిఖుఁ డను వేతాళుఁడు పొగరుఁబోతు వచ్చి తటాలున ఆకాపాలికకళేబరమును పుచ్చుకొనియెను. అంత నగ్నిశిఖుఁడు తొలివేతాళుఁడు వానితో 'ఓరీ, శ్రీవిక్రమాదిత్యదేవుని యాజ్ఞచే ఈ కాపాలికుని నేఁ జంపితిని, దురాచారుఁడా, వీని కళేబరమునకు నీవెవ్వఁడవురా?' అనెను. అంతట యమశిఖుఁడు 'అట్లైని, ఆ రాజుప్రభావ మెట్టిదో చెప్పుము.' అనెను. అంత నగ్నిశిఖుఁ డిట్లు చెప్ప సాగెను.

ఆయన ప్రభావము నెఱుంగవేని యిదె వినుము. ఈ నగరములో డాకినేయుఁడని దిట్టఁడు జూదగాఁడొకఁడుండెను. ఒకప్పుడు జూదరులు మాయజూదముచే వాని సకలధనమును హరించి ఎక్కువ యోడించి యా యెక్కువకై వానిని కట్టిరి. లేమిచే వాఁడీయనందున వానిని దుడ్డుకఱియలు లోనగు సాధనములతో మోఁది, రాతివలె నిశ్చేష్టుఁడై చచ్చినట్లు పడి పోయినంతట, ద్యూతకారకునితోఁ గూడ జూదరులెల్లను పాపాత్ములు వానిని ఒకవేళ వాఁడు బ్రతికెనా తమకు ప్రత్యప కారము సేయు నని వెఱచి మోచికొనిపోయి యొక కటికచీఁకటి నూతిలో పాఱవైచిరి. కడులోఁతైన యానూతిలో పడి ఆ జూదరి డాకినేయుఁడు అందు భయంకరమూర్తుల నిరువురను పురుషులను గాంచెను. అట్లుపడి భయపడుచున్న డాకినేయుని వారు కని మంచిమాటల 'ఎవరవు నీవు, ఏల ఈనూతిలోఁ బడితివి, చెప్పుము.' అని యడిగిరి. అంత నూఱడిల్లి జూదరి తన వృత్తాంతముచెప్పి వారిని 'మీరెవరు, మీరేల యిటనున్నారు?' అని యడిగెను, అందులకు నోతిలోని యాపురుషులు చెప్పం దొడంగిరి. "మంచివాఁడా, మేము ఈనగరమున శ్మశానములో బ్రహ్మరాక్షసులము. మేము ఈనగరములోనే ముఖ్యమంత్రి కూఁతును, ముఖ్యవణిజుని కూఁతును కన్యలను పట్టుకొంటిమి. ఈలోకములో ఎంతటిమాంత్రికుఁడును ఆకన్యలను మావలన నుండి విడిపింపనేరఁడాయెను. తంత్రశుబమైత్రి యుక్తి మాకన్న

లిరువురును కలసి యొకచోటనే యుండిరి. విక్రమాదిత్యమహా రాజు ఆతండ్రులమీఁది యనురక్తిచే ఆకన్యలకడకు రక్షకుఁడుగా వచ్చెను. ఆతనిం గని యాకన్నెలను వదలి మేము పలాయన మొనరింప జతేనపడియు అతని ప్రభావంబువంచేసి అవలికి పోనేర మైతిమి. ఆయన తేజస్సుచే దిక్కులెల్ల వెలుంగుచుండుటను గాంచితిమి. అంత నారాజు మమ్ముఁ గని తనప్రభావంబున కట్టివేసెను చావునకు వెఱచి దీనులమై యున్న మమ్ముం గని యాప్రభువు 'ఓరి పాపులారా, ఒకసంవత్సరము చీఁకటి నూతిలో నుండుఁడు. అనంతరము విడుదల నొంది మీరు మఱి యిట్టికృత్యములు సేయఁగూడదు, చేసుదురేని నేను మిమ్ము దండింతును.' అని యాజ్ఞాపించి మమ్ము ఈచీఁకటినూతిలోఁ ద్రోచెను, కనికరము గలవాఁడై చంపక వదలెను. ఇఁక నేని మిదిదినములు మాకు ఈనూతివాసము. అంతటితో సంవత్స రము నిండును, మాకు విడుదల కలుగును. కావున ఈదినము లకు మాకే మేని భోజన మిడ నొడంబడుదువేని, ఈనూతి నుండి యెత్తి నిన్ను బయల వదలెదము. ఒప్పుకొని వెలువడి భోజనము ఇయ్యక పోదువేని, మేము ఇందునుండి వెలువడి వచ్చినప్పుడు నిక్కముగా నిన్ను భక్షింతుము." అట్లు బ్రహ్మ రాక్షసులు పల్కఁగా డాకినేయుఁ డొడంబడెను, వారును వానిని నూతినుండి వెలువరించిరి. వాఁడు వెలువడి వారి కోర్కిం దీర్చుటకు ఉపాయాంతరము కానక మహామాంసము

విక్రయించుటకు రాత్రి శ్మశానమున కరుదెంచి 'ఇదిగో
మహామాంసమును విక్రయించెదను, ఎవ్వఁడేని కొనుఁగాక,'
అని యఱచుచుండెను. ఆసమయమున నే నటనుండి విని కని,
'ఇదె నేఁ గొనియెద, ఏమి వెల యడిగెదవు?' అని యడిగితిని.
'నీరూపప్రభావములను నా కిమ్ము.' అని వాఁ డడిగెను. 'వీరు
డా, వానితో నీ వేమి చేయుదువు?' 'నీరూపప్రభావంబులచే
నాశత్రువులను ఆజాదరులను సభికులతోఁ గూడ ఆకర్షించి
నూతిలోనియా బ్రహ్మరాక్షసులకు ఆహారముగా నిచ్చెదను.'
ఆమాట విని వానిధైర్యమునకు సంతసించి వానికి ఏడుదినము
లకు నారూపప్రభావముల నొసంగితిని. వానిచేత నాతఁడు
ఆయపకారుల నాకర్షించి వరుసగా ఏడుదినములును నూతి
లోనికిఁ ద్రోచి బ్రహ్మరాక్షసులకు ఆహారము చేసెను. అనంత
రము నేను నారూపప్రభావములను కైకొనఁగా భయాకు
లుఁడై డాకినేయుఁ డిట్లనియె. 'ఈయెనిమిదవనాఁడు ఆబ్రహ్మ
రాక్షసులకు నేను భోజన మొసంగనైతిని, కాన వారు వెలు
వడి వచ్చి నన్ను భక్షింతురు. ఈయిక్కట్టునకు నే నేమి సేయ
నగునో చెప్పుము. నీవు నాకు మిత్త్రుఁడవు గదా.' అంత నేను
పరిచయప్రీతిచే నతని కిట్లు చెప్పితిని. 'ఓయీ, అట్లయినయెడల
నీవు ఆరాక్షసులచే అజాదరులను తినిపించితివి గదా, నేను
నీకై ఆరక్కసుల నిరువురను తినివేసెదను, వారిని నాకుం
జూపుము మిత్త్రమా' అ ట్లనఁగానే డాకినేయుఁడు నన్ను తత్క్ష

ణము ఆరాత్రిసు లున్న నూతికడకుం దోడ్కొనిపోయెను. అట నేను నిశ్శంకముగా తల వంచి నూతిలోఁ బరికించునంత నా జూదరి డాకినేయుఁడు నన్ను అర్ధచంద్రప్రయోగముతో నూతిలోనికి త్రోసివేసినాఁడు. నేను బావిలోఁ బడఁగానే భక్ష్యమని తలంచి యారక్కసు లిరువురును నన్నుం బట్టుకొనిరి. అంతట వారికిని నాకును బాహుయుద్ధ మారంభమైనది. నా దెబ్బలను మీఁజాలేక వారు పోరాటము మాని నీ వెవరవని నన్నడగిరి. నేను డాకినేయునివృత్తాంతమును వర్ణించితిని. అంతట వారు నాతో చెలిమిచేసి యి ట్లనిరి:—ఆహాహా! నీకును మాకును ఆదుర్భ్యాతకారులకును ఆపాపాత్ముఁడు జూదగాఁడు ఇట్టి యవస్థను కలిగించినాఁడు! ఎవ్వారికి చెలిమిగాని, కనికరముగాని, ఉపకారస్మరణగాని యుండదో, వంచనయే విద్యగాఁ గల యా జూదరులయందు నమ్మక మున నెట్టిది? సాహసమును నిరపేక్షతయు జూదరులకు నైసర్గికములు. ఇందులకు ఠింఠాకరాళుని కథను వినుము.

ఈయుజ్జయినీ నగరమందే పూర్వము ఠింఠాకరాళుఁడను జూదమాడించువాఁ డొకఁడు విటుఁడు అన్వర్థనాముఁడు ఉండెను. వాఁడు నిత్యము జూదమున ఓడునట్లు కొందఱను గెలుచునట్లు కొందఱను చేయుచుండెను. అందు గెలిచిన వారు వానికి ప్రతిదినము నూఱుగవ్వలు ఇచ్చుచుండిరి. వానికి వాఁడు బాజారున సాయంకాలమున గోదుమపిండి కొని ఎట

నేని కుండ పెంకులో నీళ్లతో మెదిపి రొట్టెలు చేసికొని వల్లకాట నొదనిప్పులో కాల్చుకొని మహాకాళదేవుని సన్నిధికి వచ్చి యతని దీపంపునేయి చమురుకొని భక్షించి యటనే మహాకాళుని దేవళంబున ముంగిట ఎడమచేయి తలగడగా పెట్టుకొని నేలను రాత్రి నిద్రపోవుచుండును. ఒకరాత్రి యా దేవళంబున వాడు కనుచుండఁగా మంత్రశాస్త్రిక్య ప్రభావంబున మాతృమండలయక్షాదిప్రతిమలు కదలసాగినవి. దానిం గన తింతాకరాళుని కీతలంపు వొడమెను. 'ఇక్కడ ధనలాభార్థము ఏమేని యుపాయము ఏల చేయరాదు? సిద్ధి కలిగెనేని మేలే గదా, గలుగదేని, నాకు దీనం జెలు వేమి?' ఇట్లాలోచించుకొని వాఁడు ఆదేవతలను 'ఓదేవతలారా, రండి, మీతో నేను జూద మాడెదను. ఇట ఆడించువాఁడను నేనే, ఆడు వాఁడను నేనే, గెలిచినధనమును వెంటనే యిచ్చునట్లు సమయము' అని జూదమునకు పిలిచెను. ఆ పిలుపు వినియు దేవతలు బదులు పల్కక యూరకయుండఁగా తింతాకరాళుఁడు పందె మేర్పరించి చిత్రవర్ణములగవ్వలను వైచెను. పాచికలను వేయునపుడు వల దని నిషేధింపని జూదగాఁడు ఆజూదమునకు ఒప్పుకొన్నట్లుగా జూదరులమర్యాద; దానం జేసి తింతాకరాళుఁడు ఆదేవతలవలన విస్తారము బంగారము గెలిచి వారిని ఒడంబడికప్రకారము 'నాకు గెలిచిన ధనము నిండు.' అని యడిగెను. ఇట్లు పలుమారు అడిగినను వారు పలుకక యూర

కుంటం గని శింతాకరాళుఁడు కోపగించి యి ట్లనియె. 'మంచిది, మాట లేక యూరకుండు రేని యుండుఁడు. ఓడినపండెమియ్యక - రాతివలె నుండు జూదగాండ్రకు ఏమి సేయుదురో అదే మీకు చేసెద; అనఁగా జమునికోఁ జూనలవలె వాఁడియగు అంపముతో ఒకలిం గోసెద. నా కేమియు శంక లేదు.' ఇట్లు పలికి వాఁడు అంపమును గొని పరువున రాఁగా దేవతలు వానికి వాఁడు గెలిచిన యాధన మెల్ల నొసంగిరి. ప్రాతఃకాలమున ఆ ధనమును కోలుపోయి వెండియు నట్లే రాత్రి హతద్యూతం బున వాఁడు మాతృగణమువలన ధనము గెలిచి కైకొనుచుం డును. ఈతీరున వాఁడు ప్రతిదినము సేయుచుండఁగా ఒకనాఁడు చాముండాదేవి ఖిన్నమానసలై యున్న మాతలతో ని ట్లనియె. 'ఓమాతృదేవతలారా, జూదమునకు పిలిచినపుడు ఈజూదము నుండి నేను వెలువడితిని అని ఎవఁడు పలుకునో వానిని వదలి వేయవలసినది' అని జూదంపు మర్యాద. కావున ఈ మాట వాఁడు జూదమునకు పిలువఁగానే అట్లు పలికి వానిని తొలఁ గించుకొనుఁడు' చాముండ యిట్లు పలుకఁగా ఆదేవత లందఱు అట్లే చేయ నిశ్చయించుకొనిరి. రాత్రి వాఁడు వచ్చి జూదము నకు పిలువఁగా దేవత లందఱును 'ఈజూదమునుండి మేము వెలువడితిమి.' అని పల్కిరి వారిచే నిట్లు నిరాకృతుఁడై శింతా కరాళుఁడు వారిప్రభువును మహాకాళునే జూదమునకుపిలిచెను. హతద్యూతమున వానిని లబ్ధావకాశునిఁగా నెఱింగి ఆదేవుఁడు

'ఈజాదమునుండి నేను తొలంగితిని' అని పల్కెను. అక్షీణ ఘోషంబును విషముంబును నిష్ఠాని ష్ఠభయ రహితుండును నగు దుర్జనునికి దేవతలు సయితము అశక్తులవోలె భయపడు దురు. ఇట్లు దూతమర్యాద చేత జిక్కి చెడి తింతాకరాళుండు మనస్సున తలపోసెను. 'అహో, ఈదేవతలు దూత మర్యాదను నేర్చి నన్ను నిరాకరించినారు; కావున నీదేవదేవునే యిపుడు శరణుచొచ్చెదను.' ఇట్లాలోచించుకొని మహాకాళుని పాదములు గట్టిగా పట్టుకొని తింతాకరాళుండు స్తోత్రపూర్వక ముగా నిట్లు విన్నవించుకొనెను. 'ఓస్వామీ, దేవి జూదమున ఇందు వృషభకుంజరచర్మములను గెలుచుకొనఁగా మోఁకాళ్ల మీఁద చెక్కిళ్లు మోపుకొని దిగంబరముగా నీవు కూర్చున్న విధమును నమస్కరించెదను. ఎవనియిచ్ఛామాత్రమున దేవ తలు ఆయావిభూతుల నొందుదురో, ఎవఁడు స్వయము ఆశ లేనివాఁడై జటాభస్మకపాలైకపరిగ్రహుఁడై యున్నాఁడో, ఆనీవు ఇపుడు మందపుణ్యుఁడ నగు నా విషయంబున నిట్లు లోభివై నాఁడవు, ఎట్లనఁగా రవంతధనమును కోలుపోవ ప్రాలు మాలి నన్నిట్లు వంచింపఁ గడఁగితివి. నిక్కముగా అధన్యుల కోరికను కల్పవృక్షము సయితము తీర్పదు. విశ్వమునెల్ల భరించు నీవు, ఓనాథా, భైరవా, నన్నుమాత్రము భరింపవు. ఓ స్వామీ, నేను నిన్ను శరణుఁజొచ్చితిని, కష్టవ్యసనాపన్నుఁడను నేను జేసిన యపరాధములను క్షమింపఁగదవు. నీవు త్ర్యక్షుఁ

డవు, నేను అట్టిఁడనే; నీకు నొడల బూడిద కలదు, నీవు పునుక యందు భుజింతువు, నేనును అట్లే; నాయందు కనికరింపుము. మీతో మాటలాడి నేను వెండియు నెట్లు జూదరులతో పలుకఁ గలను, కావున నాపన్నుని న న్నుద్ధరింపుము' ఈవిధమున నాజూదరి భైరవునికి కనికరము గలుగువఱకును స్తోత్రము చేసెను. అంతట భైరవుఁడు 'ఓరి ఠింఠాకరాళుఁడా, నీయందు తుష్టి నొందితిని, భయపడకు, నీకు భోగము లొసంగెదను, నీవు ఇచటనే నాకడనే యుండుము' అనెను భైరవాజ్ఞచే తత్ప్రసాదలబ్ధము లయినభోగముల ననుభవించుచు నాజూదరి అటనే యుండెను.

ఒకనాఁడు మహాకాళతీర్థంబున రాత్రి దేవాంగనలు వచ్చి స్నానము సేయుచుండఁగాఁ గాంచి భైరవుఁడు ఠింఠాకరాళుని కిట్లాజ్ఞ యిచ్చెను. 'ఓరి, స్నానార్థము ఈయచ్చరలు గట్టున విడిచిపెట్టుకొనిపోయిన వస్త్రముల తటాలున కొని రమ్ము. వీరు నీకు ఈకళావతిని అచ్చరకన్నియను ఇచ్చువఱకు వీరివస్త్రములను ఈయకుము.' ఆప్రకారమే ఠింఠాకరాళుఁడు జలక మాడుచున్న యామృగాక్షుల వస్త్రములనెల్ల నపహరించెను. 'మావస్త్రములను వదలు, మమ్ము దిగంబరలం జేయకు.' అని వారుపలుకఁగా నాతఁడు హరప్రభావంబున వారితో 'ఈ కన్యను కళావతిని, నా కొసంగెదరేని మీ వస్త్రములను మీ కిచ్చెదను, ఒండువగ నీయను.' అని పలికెను. వానిమాట

విని, వాఁడు దురాధర్షుఁడని తెలిసికొని, కళావతికి అట్టిశాపము ఇంద్రదత్తము ఉంటం దలంచుకొని, వారు అట్లు అంగీకరించిరి; యథావిధిగా కళావతిని అలంబుషాతనయ నతని కొసంగిరి. వస్త్రముల నిచ్చి తింతాకరాళుఁడు అచ్చరలు పోయిన యనంతరము, భైరవేచ్ఛావినిర్మిత మయిన మందిరంబున కళావతితోఁగూడ సుఖముండెను. కళావతి పగలు దేవేంద్రుని గొలువఁబోవుచుండును, రాత్రి భూలోకమునకు వచ్చి తనపతిని తింతాకరాళుని కూడియుండును. ఒకనాఁడు కళావతి తింతాకరాళునితో 'ప్రాణేశ్వరా, ఇంద్రశాపము నిన్ను పొందుటకుం బలిం చేయుటచేత నాకు వరమే గదా అయినది. అని ప్రీతితో నుడివెను. అంతట తింతాకరాళుఁడు ఆశాపమునకుఁ గారణ మడుఁగఁగా, "ఉద్యానమందు దేవతలుండఁగాఁ గాంచి మర్త్య భోగములను స్తుతించితిని, కన్నులకు మాత్రము పండువు సేయున వైనదేవభోగములను నిందించితిని; దాని నెఱిఁగి యింద్రుఁడు 'పో, మర్త్యునికి భార్యవై మర్త్యభోగములను అనుభవింపుము.' అని శపించెను. దానంజేసి మనకు అన్యోన్య సమ్మత మయిన యీసంయోగము కలిగినది. రేపు. స్వర్గమునుండి నేను వచ్చుటకు విలంబ మగును, నీవు దిగులు పడనలదు. ఇంద్రునిమోలి రంభ యొకక్రొత్తయాట యాడనున్నది. వల్లభా, అది ముగియువఱకు నే మటనుండవలయును." అని బదులు పల్కినది. అంతట తింతాకరాళుఁడు, అనురక్తి పెంపున దుండ

గొంటై 'నేను ను అన్యత్యకృముం గాంచెదను, నన్ను గుప్తముగా నటకుం గొనిపొమ్ము. అని యడిగెను. 'ఈపని నే నెట్లు సేయ నగును, ఇంద్రుండెఱింగె నేని కోపగించును.' అని కళావతి నిషేధించెను. ఆతండు వినక బలవంత పెట్టఁగా స్నేహావశం వదయై కళావతి యాతని కొనిపో నంగీకరించెను.

తెల్లవాఱఁగానే కళావతి యాతనిని తనప్రభావము వలన తన చెవికలువలో డాఁచి మహేంద్రభవనంబునకుం గొనిపోయెను. ద్వారముకడ నైరావణంబును చెంత నందనో ద్యానంబును వెలుఁగొందుచున్న యాదేవేంద్రమందిరంబుం గని ఠింఠాకరాళుఁడు తాను నొకదేవత యని తలంచుకొని కరము సంతోషించెను. లోపల నానాదేవతలతోడం గొలువు తీరియున్న యింద్రుని యాస్థానంబున అచ్చరల సంగీతముతోడి రంభానృత్యోత్సవాద్భుతమును ఠింఠాకరాళుఁడు గాంచెను, నారదాదులు వాయించిన నానావాద్యములను వినెను పర మేశ్వర ప్రసాద ముండఁగా దొరకని దేమున్నది! ప్రేక్షణకము ముగియఁగా మేకరూపున నున్న దివ్యభండుఁడు దివ్యభంగుల నర్తింపం దొడంగెను. ఠింఠాకరాళుఁడుకని అనవాలుపట్టి 'ఆహా! ఉజ్జయినిలో ఈ పశువును నేను కనుచుందును. ఇట నింద్రుని మోలిల నిది యీరీతిని భండనర్తనము సేయుచున్నది, ఇదేవో యూహా కందనిది విచిత్రమయిన దివ్యమాయ.' అని మనం బునం దలపోయుచుండ భాగభండునినృత్యము ముగిసి యిం

ద్రుని యోగము నివర్తించెను. అంతట కళావతి సంతోషించి తనచెవికలువయం దున్న యాతింతాకరాళుని భూలోకమున వానికావునకు నల్లే కొనిపోయెను. తింతాకరాళుఁడు మఱు నాఁడు ఉజ్జయినియందు మేకరూపున ఆదేవభండుఁ డగపడఁగా గర్వము మెఱయ నిట్లు పలుకరించెను. 'ఓరీ, ఇంద్రునిమోలిల నెట్లు నృత్యమాడుదువో అట్లు నాయెదుట నృత్యము సేయుము, చేయవేని నిన్ను నేను క్షమియింపను, కావున ఓరి భండా, ఆనృత్యమును ఇపుడు చూపుము.' ఆమాట విని యాశ్చర్య పడి మేక యూరకయ యుండెను; 'ఏమి యిది, వీఁడు మను ష్యుఁడు న న్నెఱుంగును!' అని తలపోసెను. ఎంత బలవంత పెట్టినను మేక ఆడకుండఁగా తింతాకరాళుఁడు దానిని దుడ్డు కఱ్ఱయతో తలం గొట్టెను. అంతట నామేక నెత్తు రోడుచున్న తలకాయతో నింద్రునికడ కేఁగి యావృత్తాంత మంతయు మొఱ పెట్టుకొనెను. ఇంద్రుఁడు యోగదృష్టిచేత కలావతి రంభానృ త్యమునకు తింతాకరాళుని గొనివచ్చుటయు, అట్లు వాఁడు అప రాధి ఛాగనృత్తమును కనుటయు నెఱింగినవాఁడై కళావతినే రావించి యిట్లు శపించెను. 'నృత్తము చూడఁగోరి ఎవఁడు ఛాగభండునికి ఈయవస్థను కలిగించెనో వానిని మానుషుని రాగంబున ఇటకుం దెచ్చితివి గాన, ఆయపరాధమునకు నీవు నాగపురంబున నరసింహరాజు కట్టించిన దేవళంపు స్తంభంబున సాలభంజికవు గమ్ము.' ఇంద్రుఁ డిట్లు శపింపఁగా కళావతియు

తన్నాత యలంబుసయు నింద్రునిపాదముల వ్రాలి క్షమవేడిరి. ఎట్టకేలకు జాలిగొని యింద్రుఁడు 'ఆదేవళము కట్టుటకు పెక్కు వర్షములు పట్టినవి, ఎప్పుడు శిథిలమై నేలతో సమముగా నాశమై పోవునో అప్పటికి ఈశాపము తీఱును.' అని శాపాంత మను గ్రహించెను. కళావతి భూలోకమునకు వచ్చి తంతాకరాళునితో ఆయింద్రశాపమును తదంతమును వక్కాణించి వానిదోష మునుం దెలిపి, వానికి తనయాభరణము లిచ్చి యంతర్ధానమై పోయి నాగపురమున దేవళములోని స్తంభముమీది నున్న బొమ్మలో ప్రవేశించెను. తంతాకరాళుఁడు ఆవియోగవిషము సోఁకి కనఁడు వినఁడు, కేవలము నేలఁబడి దొరలును మూర్ఛ ల్లును. తెలివి వచ్చినప్పుడు 'అయ్యో! ఎఱిఁగియు మూఢుఁడనై నేను రహస్యము బయలుపుచ్చితిని. ప్రకృతిచపలు లగునాబోం ట్లకు వాఙ్నిగ్రహ మెక్కడిది! కాన నిపుడు ఈదుస్సహ వియోగము నాకుం బ్రాప్తించినది.' ఇట్టిరీతుల పనవుచు క్షణ ములో నిశ్చయము నొందెను. 'ఇది నాకు దిగులుపడుటకు కాలము గాదు, ధైర్యమూని కళావతికి శాపము ముగియునట్లు చేయ నేల యత్నింపరాదు.'

ఇట్లాలోచించుకొని ఆమోసగాఁడు అక్షమాలికయు అజినంబును జడలును దాల్చి సన్న్యాసివేషం బలవరించుకొని నాగపురమునకుం బోయెను. అట అడవిలో ఊరివెలుపల నాలుగుదిక్కులందును భూమిలో కళావతిభూషణకలశములను

నాలుగింటిని పాతి, మహారత్నములతో నిండియున్న యేనవ డానిని రాత్రి వేళ ఊరిలోనే దేవునియెదుటిబజాఋలో పాఁతెను. ఇట్లు కావించి యాతఁడు ఏటియొడ్డున పర్ణశాల వేయించుకొని అందు మాయతపస్సు చరించుచు, మాయయధ్యయనము మాయజపము సేయుచు, దినమునకు మూఁడు మాఋలు స్నానముసేయుచు, భిక్షాన్నమును తాటిమీఁద నీళ్లతోఁ గడిగి భుజించుచు, ఉండి, మహాతాపసుఁ డని ప్రసిద్ధి పొందెను. క్రమక్రమముగా రాజు ఆతనివృత్తాంతము విని పిలిపింపఁగా నతఁడు పోఁడాయెను. అంతట రాజు తానే యాతనికడకు వచ్చి చాలసేపు మాటలాడుచుండి సాయంకాలమున ఇంటికి లేచునప్పుడు ఆకస్మికముగా దూరమున నక్క కూసెను. దానిని విని తాపస వేషుఁడు జూదగాఁడు నవ్వసాగెను. ఇదేమని రాజడుగఁగా, నీకేమి పని దీనితో, అని కితవుఁడు బదులు పల్కెను. రాజు నిర్బంధముసేయఁగా, ఆమాయికుఁడు " రాజా, 'ఈ యూరికి తూర్పున అడవిలో రత్నాభరణపూర్ణము కలశము ఉన్నది, వచ్చి దానిం గయికొమ్ము' అని నన్నుఁ గూర్చి నక్క కూసినది. దానిభాష యెఱుఁగుదును గాన నాకు తెలిసినది." అని వచించెను. అంతట రాజు ఆవింతం గనఁ గుతూహల పడఁగా, మాయికుఁడు రాజుం దోడ్కొని పోయి నేలను త్రవ్వి కలశము నెత్తి యిచ్చెను. రాజు ఆభరణములం గైకొని నమ్మకము కుదిరినవాఁడై ఆతాపసుని జ్ఞానినిగాను నిఃస్పృహుఁ

గాను సత్యవచనునిగాను తలంచెను. రాజు తాపసుని ఆశ్రమము చేర్చి మరల పాదములకు మ్రొక్కి తాను మంత్రిసమేతుఁడై యాతనిగుణములం బ్రశంసించుచు నిజమందిరమున కేఁగెను. ఈవిధమున దినదినము రాజు వచ్చుచుండ సాధుధూర్తుఁడు రత మిషంబున కడను మూఁడుదిక్కుల నున్న యా మూఁడుకలశ ములను అతని కందఁజేసెను. దానంజేసి యా రాజును అతని మంత్రులును రాణులును పౌరులును ఆతాపసునియందు కేవల భక్తులై తన్మయులై యుండిరి. ఒకనాఁడు రాజు వానిని దేవళము చూడం దోడ్కొనిపోవుచుండఁగా దేవళము మోలి బాజా టులో వాఁడు కాకికూఁత విని రాజుతో "దేవా, వింటివా ఈ కాకివాక్కును? 'ఇటనే బాజాటులో దేవునియెదుట మంచి రత్నములు నిండినకలశ మొకటి పాఁతఁబడియున్నది, దానిని గూడ నేల కైకొనవు?' అని యిది కూయుచున్నది. అని వచించి రాజును ఆకలశ మున్న తావునకుం గొనిపోయి నేలనుండి త్రవ్వి యెత్తి యాకలశమును అతని కిచ్చెను. అంత నత్యంత పరితోషం బున రాజు ఆకపటజ్ఞానిచేయి తనచేతం బట్టుకొని దేవళము సొచ్చెను అచట సాధుధూర్తసన్న్యాసి స్తంభంబున కళావతి ప్రవేశించియున్న సాలభంజికను గాంచెను. అట్లు బొమ్మరూపున నున్నకళావతి తనపతిని శంఠాకరాళుని గాంచి దుఃఖితయై యేడువఁ దొడంగెను. దానిం గని రాజు ఆశ్చర్యపడి నెవ్వ లొంది 'స్వామీ! ఇ దేమి? అని యాజ్ఞానాభాసుని అడి

గను. అంతట దిగులును భ్రమయుం జెందినవానివలె సాధూ ర్తుఁడు నటించి 'రా, నీమందిరమునకు, చెప్పఁగూడని దైనను ఈవిషయము అచ్చట చెప్పెదను.' అని వచించి రాజును రాచ నగరికి తరలించి యచట నిట్లు వక్కాణించెను. 'రాజా, కాని కావున కానిముహూర్తంబున ఈదేవళమును నీవు కట్టించితివి, కావున నిప్పుం గని కంబములోనిబొమ్మ యేడువసాగినది. కావున, రాజా, నీప్రాణము నీకు వలయునేని ఇపుడే యీదేవ ళమును పడఁగొట్టి నేలమట్టమునకు సమము చేయుము. మంచి కావున, మంచిముహూర్తమున మఱియొకచోట దేవళము కట్టుము, దాన ఈయపళకునము తొలఁగును గాక, నీకును నీప్రజలకును క్షేమ మగునుగాక.' ఇట్లు వాఁడు పలుకఁగా రాజు భయపడి ప్రజలను ఆజ్ఞాపించి ఒకదినములోనే ఆదేవళ ము నేలకు సమముగా రూపుమాపించెను, మఱియొకచోట వెండియు దేవళముం గట్ట నారంభించెను. ఆహా! ధూర్తులు మాయలచే ఈశ్వరులను నమ్మించి వంచింతురుగదా! ఇట్లు తన కార్యము నెఱవేఱఁగానే తంతాకరాళుఁడు సన్న్యాసివేషమును మాని అటనుండి పలాయితుఁడై యుజ్జయినికిం బోయెను. కళావతియు నాన్నృత్తాంత మెఱింగి శాపముక్తయై వచ్చి వానిని దారిలోనే కలసికొని యూఱడించి యింద్రునిఁ గాన స్వర్గము నకుం బోయెను. ఇంద్రుఁడును ఆశ్చర్యపడి కలావతివలన తత్పతి

జూదగాఁడు ఠింఠాకరాళుఁడు చేసిన మాయాప్రతియోగమును విని నవ్వి సంతోషించెను

అపుడు చెంగటనున్న బృహస్పతి ఇంద్రునితో నిట్లనియె. అయ్యా! విచిత్రమాయలు జూదరులు ఎప్పుడును ఇట్టివారే, అందులకే కథ విను. కడచినకల్పమందు ఒకనగరంబున కుట్టినీకపటుఁడను పేర మాయాద్యూతకోవిదుఁడు జూదరి యొకఁడుండెను. వానిని పరలోకగతుని ధర్మరాజు 'ఓరీ జూదరీ, నీకు నీపాపములవలన ఒకకల్పము నరకవాసము ఏర్పడియున్నది. దానవశంబునంజేసి ఒకదినముమాత్రము నీకు ఇంద్రత్వము కలుగును, ఒకప్పుడు నీవు ఒక బ్రహ్మవేత్తకు ఒకవరహా ఇచ్చియుంటివి, కావున వచింపుము, ముందుగా నరకము ననుభవించెదవా, ఇంద్రత్వము ననుభవించెదవా?' అని యడిగెను. 'ముందుగా ఇంద్రత్వమునే అనుభవించెదను.' అని జూదరి పల్కెను. అంతట వానిని ధర్మరాజు స్వర్గమునకుం బంపఁగా దేవతలు ఇంద్రుని తొలఁగించి ఒకదినము వానికి పట్టాభిషేకము చేసిరి. ఇట్లు ఇంద్రాధికారము రాఁగానే ఆజూదరి భూలోకమునుండి తనచెలికాండ్రను జూదరులను తనవేశ్యలను ఇంద్రలోకమునకు రప్పించి యాధిపత్యముచే దేవతల నిట్లాజ్ఞాపించెను. 'ఇపుడే, మమ్మెల్ల క్షణములోఁ గొనిపోయి సప్తద్వీపగతము లయిన దివ్యభౌమతీర్థము లన్నిటం జేర్పుఁడు, ఇపుడే భూలోకమందలి రాజు లందఱియందును చొచ్చి మానిమిత్తముగా నిరంతరము

మహాదానము లిండు.' ఇట్లు వానిచేత ముదలవొంది దేవతలు సకలమును అట్లే నిర్వర్తించిరి. అంత నాతఁడు ఆపుణ్యకర్మలచే నిష్పాపుఁడై శాశ్వతముగా నింద్రత్వ మనుభవించెను స్వర్గమునకు వాఁడు రావించిన యాచెలికాండ్రును వేశ్యలును నిష్పాపులై దేవత్వము నొందిరి. మఱునాఁడు చిత్రగుప్తుఁడు ధర్మరాజుతో ఆజూదరి తనమతివిభవంబున దేవరాజ్యము తనకు స్థిరము చేసికొనియెనని విన్నవించెను. అంతట ఆసుచరితమును ఎఱింగి ధర్మరాజు 'ఆహా! జూదరి మనలను మోసము చేసెఁగదా!' అని పల్కుచు ఆశ్చర్యపడుచుండెను. జూదరు లిట్టి ప్రజ్ఞావంతులు సుమా.

ఇట్లు కథ చెప్పి బృహస్పతి విరమింపఁగా, ఇంద్రుఁడు కలాపతిచేత తింతాకరాళుని దివికి తెప్పించి, వానిబుద్ధిధైర్యములకు మెచ్చి వానికి కళావతి నిచ్చివేసి వానిని తనకు పార్శ్వస్థునిఁగాఁ జేసికొనెను. వాఁడును ధీరుఁడు అమరుఁడుంబోలె కళావతిం గూడి శంకరానుగ్రహంబున స్వర్గమున సుఖముండెను.—ఇట్టిది సుమా జూదగాండ్ర మాయాసాహసముల ప్రకారము కనుక, ఓయి అగ్నిశిఖభేతాళుఁడా, ఆజూదరి డాకినేయుఁడు నిన్ను మాయచే నూతం ద్రోచుట యేమి వింత! ఇఁక ఇందునుండి నీవు బయలువెడలుము. మిత్రమా మేమును వెడలివచ్చెదము.

ఇట్లు బ్రహ్మరాక్షసులు పలుకఁగా నేను ఆగోతినుండి వెలువడి రాత్రి ఈనగరంబున ఆకటఁ గ్రాఁగుచు బాపనబాట పారి నొకనిం బరువునం బోయి పట్టుకొని భక్షింప దొరంకొంటిని. అంతట నాబాపఁడు శ్రీవిక్రమార్కమహారాజును వేఁడుకొని మొఱయిడెను. ఆమొఱ విని విక్రమాదిత్యమహారాజు అగ్నివోలె తేజరిల్లుచు వెలువడి వచ్చి 'ఓరిపాపాత్ముఁడా, బ్రాహ్మణుని చంపకురా' అని నన్ను దూరమునకు త్రోసివైచి నాప్రతిమను వ్రాసి ఆప్రతిమతలకాయను ఛేదింపసాగెను. దాన నాకంఠమున గాయమై నెత్తురులు కురియసాగెను. అంతట నేను బ్రాహ్మణుని విడిచి మహారాజుపాదముల వ్రాలఁగా నాతఁడే నన్ను చంపక రక్షించెను. విక్రమాదిత్యమహారాజనఁగా నిట్టి ప్రభావవంతుఁడుసుమా. ఆతనియానచే నే నీఖండకాపాలికాధముని చంపితిని. కావున ఓయి యమశిఖవేతాళుఁడా, నాభక్ష్యమును వీనిని నీవు విడిచిపెట్టుము.—ఇట్లు అగ్నిశిఖుఁడు చెప్పినను గర్వాతిరేకంబున యమశిఖవేతాళుఁడు ఆకాపాలికకళేబరమును చేత నొడిసి హరించెను. అంతట విక్రమాదిత్యుఁడు అచట వారికగపడి నేలను పురుషప్రతిమను గీచి దానిచేతిని కత్తితో నఱికి వేసెను. దాన యమశిఖునిచేయి తెగి నేలవ్రాలెను. అంతట వాఁడు ఆశవమును బడవైచి భయంబునం బలాయితుఁడాయెను. అంతట అగ్నిశిఖుఁడు

ఆకాపాలికకళేబరమును భక్షించెను. నేను రాజప్రభావంబునం జేసి భయమెడలి దాని నెల్లం గంటిని.

ఇట్లు నీప్రభావమును వర్ణించి యక్షాంగన మదనమంజరి వెండియు నాతో నిట్లనియె. అనంగదేవుఁడా, అనంతరము నన్ను ఆయుమహారాజు మధురవాక్కుల 'యక్షీ, కాపాలికునివలననుండి విడుదల నొందితివి గదా, ఇక నీభర్త యింటికిం బొమ్ము.' అని హెచ్చరించెను. అంత నే నామహారాజునకు నమస్కరించి, ఆతనియాయుపకారమున కేమి బదులుసేయుదునా యని చింతించుచు ఇటకు నాయింటికి వచ్చితిని. ఈతీరున నీప్రభువు నా ప్రాణములను కులమును భర్తను నాకిచ్చినాఁడు. ఈకథను నీ వాయనతో చెప్పినచో అపుడు ఇదే మని ఆయనవలన నీకుం దెలియును. ఇపుడు ఆప్రభువునకు సింహాళరాజు తనకూఁతును త్రైలోక్యసుందరిని స్వయంవరను ఇచ్చినాఁడనియు, ఆమెను హరింప రాజులెల్ల కలయఁబలికికొని తద్రక్షకుని సామంతుని విక్రమశక్తిని గూల్ప నండలును కలసికొనియున్నా రనియు నాకు తెలియవచ్చినది, కావున నీవు ఈవృత్తాంతమును పోయి విక్రమశక్తికి తెలియఁజెప్పుము. దాన నతఁడు జాగరూకుఁడై వారికి ప్రతీకార మొనర్ప సిద్ధపడియుండును గాక, నేనును విక్రమాదిత్యదేవుఁడు ఆశత్రువులను గూల్చి జయమొందునట్లుగా ప్రయత్నము చేసెదను. నిన్ను నామాయచే నిటకు నే నేల తోడితెచ్చితి ననఁగా. ఈలా జెప్పిన హెచ్చరికను రాజునకు

నసాయంతునికి చెప్పుదువుగాక యని. నీప్రభువు నాకు చేసిన మహోపకారమున లేశమునకు ప్రత్యుపకారముగా నొక కానికం బంపెదను.—ఇట్లని యామెపలికినంతలో లేడితోడి యాయిరువురుకన్యలును తొలుత మేము సముద్రమునం గన్న వారు, ఒకతె చంద్రునివలె తెల్లనియొడలిది, రెండవది ప్రియంగులతవలె శ్యామలవర్ణమునదియు, సముద్రమును సేవింపవచ్చిన గంగాయమునలువోలె వచ్చిరి. వారు కూర్చుండఁగానే నేను ఆయమ్మని 'దేవీ, ఈకన్యలెవ్వరు ? ఈబంగారులేడి యేమి ?' అని యడిగితిని. ఆమె యిట్లుత్తరము చెప్పెను. "అనంగదేవుఁడా, నీకు కుతూహలమేని చెప్పెదను వినుము. పూర్వము బ్రహ్మ సృష్టి కావించుచుండఁగా ఇరువురు దానవులు దేవదుర్జయులు ఘుంటనిఘుంటాఖ్యులు విఘ్నము సేయ వచ్చిరి. వారిని నాశముచేయువాఁడై బ్రహ్మదేవుఁడు లోకోన్మాదనోద్దామరూపశోభలనీయిరువురం గన్యకల సృజించెను ఈయద్భుతరూపలం గాంచినమాత్రాన నామహాసురులు హరింప సమకట్టి ఒండొరులతో పోరి యిరువురును లయమొందిరి. అంతట బ్రహ్మదేవుఁడు తగినవరుని కిమ్మని ముదలవెట్టి యాకన్యలను కుబేరుని కప్పగించెను. కుబేరుఁడు తనతమ్మునికి నాభర్తకు ఆవరకారణముతోనే వీరి నిచ్చెను. అట్లే నాభర్తయు నా కిచ్చెను. నేను దేవావతారుని శ్రీవిక్రమాదిత్యుని వీరికి తగినవరునిగా నిశ్చయించుకొంటిని. ఈకన్యలవృత్తాంత మిది. ఇఁక నీలేడి

కథను వినుము ఇంద్రునికి జయంతుఁడని ప్రియపుత్త్రుఁడున్నాఁడు. ఒకనాఁ డాతఁడు పసిబాలుఁడు సురాంగనలతో ఆకసమున సంచరించుచు క్రిందఁ భూలోకమున రాజకుమారులు లేడిపిల్లలతో ఆడుకొనుచుండఁ గాంచెను. అంత నాతఁడు బాలభావంబునం జేసి ఏకరుఁదనంబున స్వర్గమున కేఁగి తండ్రి మ్రోల ఆటలేడిపిల్లకై యేడ్వసాగెను. అంతట నాతనికొఱకు ఇంద్రుఁడు విశ్వకర్మచే హేమరత్నమయమును మృగమును చేయించి అమృతము సల్లి ప్రాణము గలిగించెను. దానితో నాడుకొనుచు జయంతుఁడు సంతోషించియుండెను. ఆహరిణ పోతము స్వర్గమున సంచరించుచుండెను. కాలక్రమమున రావణ పుత్త్రుఁడు ఇంద్రజిత్తు సార్థకనాముఁడు ఆమృగమును దివి నుండి హరించి తనలంకాపురికిం గొనిపోయెను. అనంతరము సీతాహరణక్రోధంబున రామలక్ష్మణులు రావణేంద్రజిత్తులను కూల్పఁగా, లంకారాజ్యమునకు పట్టాభిషేకమొందిన విభీషణుని యింట నాహేమరత్నమృగము ఉండెను. ఒకప్పుడు పండువు నందు విభీషణుఁడు పతిబాంధవ్యంబున నేను చూడఁబోఁగా నామృగమును సమ్మానపూర్వకముగా నా కొసంగెను. ఇట్లు ఈదివ్య మృగశిశువు ఇపుడు నాయింట నున్నది. నేను నీ ప్రభువునకే దీనిని కానికయిడెదను." ఇట్లని యతఁడు పలుకుచుండఁగా సూర్యాస్తమయ మాయెను. అంతట ఆమె యేర్పఱచిన

యింట సంధ్యావిధ్యనంతరము సింహళరాజుదూత యీతండును నేనును ఇరువురము శయనించితిమి.

సూర్యోదయసమయమున మేము మేలుకొని చూచు కొనునప్పటికి, మహారాజ, నీసామంతుఁడు విక్రమశక్తి నడపు చున్న యీదండుకడ నుంటిమి, ఆశ్చర్యపడితిమి. ఆతఁడు మమ్ముం జూచుచునే సమ్మానించి కుశల మడిగి, సింహళేశ్వ రుని సందేశము నడుగఁ దలంచుచుండఁగా, అంతలో యక్షిణి వర్ణించినయాదివ్యకన్య లిరువురును ఆదివ్యమృగంబుతో యక్ష సేనాపరివృతలై వచ్చిరి. వారిం గని దుష్టభూతాదికములో యని శంకించి సంశయంబున విక్రమశక్తి ఇదే మని నన్నడి గెను. అంత నేను విక్రమశక్తితో సింహళరాజు కార్యంబును యక్షిణీ న్యాయుగళమృగవృత్తాంతంబును చెప్పినవాఁడ నై యక్షిణి హెచ్చరించినవిధంబున శత్రువులెల్ల నైకమత్యంబున మహారాజునకు అహితము నొనర్పనున్నవృత్తాంతమును వచించి తిని. అంత నాతఁడు మమ్మును ఆదివ్యకన్యలను సమ్మానించి సంతసంబున తనసేననెల్ల యుద్ధమునకు సన్నద్ధముగాఁ జేసికొ నెను. ఆక్షణంబుననే, మహారాజ, సైన్యవాద్యమహాధ్వని వినఁ బడెను, పైక్షణంబుననే మ్లేచ్ఛసంయుతము విరోధిరాజుల మహాసైన్యము కనఁబడెను. మనసైన్యంబును శత్రుసైన్యం బును ఒకటి నొకటి గాంచి క్రోధావేశంబున నెదుకు(?)పఱచించి పోరం దొడంగెను. అంతట యక్షి పంపినయక్షులును వారి

మిత్రులగు యక్షులును మనసైనికుల నావేశించి యందఱును శత్రుబలమును నాశముచేసిరి. సైన్యరేణుగణాకీర్ణంబును ఖడ్గధారానిరంతరంబును సహూరగర్జితంబునై సమరదుర్దినము ఘోరముగా నేచుచుండెను. తెగి యెగురుచు క్రిందఁబడుచునున్న తలకాయలచేత జయశ్రీ బంతియాట యాడుచున్నట్లొప్పారెను, క్షణములో భగ్నసైనికులయి హతశేషు లయిన రాజులెల్ల నీసామంతుని శిబిరమున నాతని నమస్కరించి శరణుఁజొచ్చిరి. ఇక్ష్వాకువంశ, సార్వభౌమా, నీవు ద్వీపములతోఁగూడ నాలుగు దిక్కులను గెలిచి మ్లేచ్ఛులను మాల్పఁగా, తనభర్తతో గూడ యక్షిణి మాకన్నుల కగపడి విక్రమశక్తితోను నాతోను ఇట్లు పల్కినది. "నేను మీావారకు చేసిన యీసేవామాత్రమును ఆయనకు మీారు నివేదింపవలయును, పైగా నామాటగా ఆనుహారాజుతో 'దేవనిర్మితల నీకన్యలను నీవు వివాహమాడవలయును, వీరిని ప్రభువు దయాపూర్వకముగా నేలవలయును, ఈలేడిపిల్లను ప్రభువు లాలింపవలయును.' అని మీారు విన్నవింపవలయును." ఇట్లు చెప్పి యక్షాంగన ఇదిగో నాకానిక యని రత్నరాశి నిచ్చి భర్తతోను అనుచరులతోను అంతర్ధాన మాయెను. మఱునాఁడు గొప్పపరివారముతోను మహావిభవముతోను సింహళరాజుకూఁతురు మదనలేఖ వచ్చి కలసికొనెను. ఆమెను విక్రమశక్తి యెదురుపోయి నమస్కరించి మహాహర్షముతో స్కంధావారంబునం బ్రవేశ

పెట్టెను. రెండవనాఁడు విక్రమశక్తి మదనలేఖను ఆదివ్య కన్యలను త్రిజగన్నేత్రకౌతుకం బయిన యాహేమరత్నమృగ మునుం దోడ్కొని యేలినవారి పాదములం గన రాజులతోఁ గూడ తరలెను. దేవా, ఆతఁడు సమీపముననే వచ్చి యున్నాఁడు. వృత్తాంతము ఏలినవారికిఁ దెలుపుటకుఁగాను ముందుగా నన్నుం బంపినాఁడు, కావున, ఓమహారాజ, సింహాళేంద్రునిమీఁదను ఆయక్షిణిమీఁదనుగల యాదరంబునం జేసి, ఆకన్యలను ఆలేడిని, రాజులను ఏలినవారు ఎదురుకోలు గావించుట యుచితము.

ఇట్లు అనంగదేవుఁడు పలుకఁగా విక్రమాదిత్యమహారాజు యక్షిణి తనకు చేసిన యుపకారముముందఱ తాను పూర్వము యక్షిణికి చేసిన యుపకారమును దుస్సాధ్యమునే తృణప్రాయముగానేని సరకుగొనఁడాయెను మహానుభావులు తాముసేసిన యుపకృతి యెంతగొప్పదైనను స్వల్పముగానే తలంతురు. ఈశుభవార్తకు సంతసించి విక్రమాదిత్యమహారాజు వెండియు నాయనంగదేవుని సింహాళరాజదూతను హస్త్యశ్వగ్రామరత్నములతో నిండించెను. ఆదినము గడపి మఱునాఁడు ఉజ్జయినినుండి సైన్యగజాశ్వవాహానసమేతముగా మహారాజు సింహాళరాజతనూజకును ఆబ్రహ్మనిర్మితకన్యలకును ఎదురుసనందరలెను. జయవర్ధనునికి మంచియేనుఁగు అంజనగిరియు, రణభటునికి మదపుటేనుఁగు కాలమేఘంబును, సింహపరాక్రము

నికి ఏనుగు సంగ్రామసిద్ధియు, వీరునికి విక్రమనిధికి కుంజరము రిపురాక్షసనును, జయకేతునికి ఏనుఁగు పవనజవంబును, వల్లభశక్తికి సముద్రకల్లోలంబును, బాహుసుబాహువులకు గుఱ్ఱములు శరవేగగరుడవేగములును, కీర్తివర్మకు కొంకణదేశము దిగోడిగ కువలయమాలయు, సమరసింహునికి మేలిగోడిగ తెల్లనిది గంగాలహరియు, అని విక్రమాదిత్యునితోఁ గూడఁ దరలు రాజులకై ఏనుఁగులను గుఱ్ఱములను విభజించు దండాధికారులవాక్కులు మ్రోఁగుచుండినవి. ఆమహారాజు సకలద్వీపాధినాథుఁడు పయనము నడచుచుండఁగా, భూమి యెల్ల సైన్యమయిగాను, దిక్కులెల్ల సేనాకలకలముగాను, మిన్నెల్ల నడతెంచుచున్న రాణువదుమారముగాను, సంభాషణ లెల్ల తదీయాద్భుతప్రభావ మహిమ కథన మయముగాను ఒప్పారెను.

---

## 3-వ తరంగము.

అనంతరము విక్రమాదిత్యుఁడు తనసేనానాయకుఁడా విక్రమశక్తి నడపుచున్న యాజయసైన్యమును సమీపించెను. అంతట విక్రమశక్తి రాజసమూహముతోఁగూడ ఔత్సుక్యంబున ఎదురువచ్చి నమస్కరింపఁగా వారితోఁగూడ మహారాజు తనదండునం బ్రవేశించెను. అట కొలగంబున ప్రతీహారుఁడు వరుసఁగా 'మహాప్రభూ, ఇతఁడు గౌడుఁడు శక్తికుమారుఁడు,

ఇతఁడు కర్ణాటుఁడు జయధ్వజుఁడు, ఇతఁడు లాటుఁడు విజయ వర్మ, ఇతఁడు కాశ్మీరుఁడు సునందనుఁడు, ఇతఁడు సింధురాజు గోపాలుఁడు, ఇతఁడు భిల్లుఁడు వింధ్యబలుఁడు, ఇతఁడు పారసీకుఁడు నిర్మూకుఁడు, మీకు నమస్కరించుచున్నారు,' అని నివేదింపఁగా ఆయాయి రాజులను సామంతులను సైనికులనుం గూడ విక్రమాదిత్యుఁడు సమ్మానించెను. అట్లే విక్రమశక్తిని సింహళేశ్వరకన్యను ఆదివ్యకన్యలను ఆదివ్యహారిణమును యథార్హముగా మహాప్రభువు సమ్మానించెను. అనంతరము ఆదందంతయుం గూడ రా విక్రమాదిత్యుఁడు కృతార్థుఁడు తనరాజధాని నుజ్జయినికిం బోయి చేరెను. అచట రాజులనెల్ల సమ్మానించి తమతమ దేశంబులకు పంపివేసెను.

ఇట్లుండ లోకానందనము వసంతసమయోత్సవము వచ్చెను. ఆసమయంబున తీవియలు పూఁదోడవులతో కైసేసికొనుచున్నట్లుండెను, తేఁటిబోటులు ఝుంకారములచే సంగీతము సేయునట్లుండెను, అడవివరుసలు గాలిం గవుంగిలించినవై నృత్యము సల్పుచున్నట్లుండెను, కోకిలలు కలనాదంబుల మంగళములు పాడుచున్నట్లుండెను. అట్టియావేరుటామనిలో విక్రమాదిత్యుఁడు శుభదినంబున ఆసింహళేంద్రకన్యను ఆదివ్యకన్యాయుగళమును వివాహమాయెను. సింహళేశకన్యకు ఆమెయన్న సింహవర్మ ఆమెతోఁగూడ వచ్చి వివాహవేదికయందు గొప్పరత్నరాశి నొసంగెను. ఆసమయంబున యక్షిణి మదన

మంజరియు వచ్చి ఆదివ్యకన్య లిరువురకు లెక్కలేనిరత్నరాసు లిచ్చెను. 'ప్రభూ, నీవు చేసిన మహోపకారమునకు ఋణము తీర్చుకొనుటకు నేను సమర్థురాలనా ! మఱి నాభక్తిని చూపుటకు కొంచెమును ఏమియుం గానిదానిని చేసితిని. ఈకన్యలందును ఈహారిణియందును ప్రభువు దయయుంపవలయును.' అని యిట్లు పలికి మదనమంజరి రాజుచే సత్కృతుల వడసి యంతర్ధానమాయెను. ఇవ్విధమున ఆభాగ్యలను సద్వీపను భూమినిం బడసి విక్రమాదిత్యుఁడు నిష్కంటకముగా రాజ్యమేలుచుండెను. వసంతంబున నుద్యానభూములయందును, వేసవిని సరోవరజలంబులందును కేళాకూళులయందును, వర్షాకాలంబున మృదంగనాదమనోహరంబు లగు నంతిపురంబులయందును, శరత్సమయంబున చంద్రోదయాపానరమ్యంబు లయినహర్మ్యతలంబులయందును, హేమంతంబున రాణివాసంబులతో మేలిపాన్పులు వెలుఁగ కాలాగురుపరిమళంబులు గదంబించుచున్న పడుకటిండ్లయందును విక్రమాదిత్యమహారాజు విహరించుచుండెను.

ఇట్లున్న యారాజునకు నగరస్వామి యనువేరిచిత్రకరుఁడొకఁడు విశ్వకర్మను మీఱినవాఁడు నూఱుగ్రామముల సంబళము వాఁడు రెండేసిదినముల కొకప్రతిమను వేఱువేఱురూపభంగుల వ్రాసితెచ్చి కానికయిచ్చుచుండెను. ఒకప్పుడు వాఁడు ఉత్సవవశంబున ప్రతిమను వ్రాయమఱచి కానికదినము వచ్చి

నంతట జ్ఞప్తియై 'అయ్యో, నేఁడు ప్రభువునకు ఏమియుపాయన
మిత్తును!' అని దిగులుపడసాగెను. అంతలో దూరాగతుఁ
డొకబాటసారి ఆకస్మికముగా వచ్చి యీతనిచేత నొకచందుగ
నుంచి వెంటనే యెటకో పోయెను. చిత్రకరుఁడు కుతూహ
లంబున దానిం దెఱచినంతట అందు పటమునందు చిత్రించిన కన్యా
మణి యొకటి యుండెను. అంతట అద్భుతరూప నా ప్రతిమను
గాంచి యాతఁడు దిగులుతీఱి పైగా ఆదినము తనకు అంత
మంచి ప్రతిమ దొరకినందులకు పట్టరానిహర్ష మొందినవాఁడై
దానిం గొనిపోయి ప్రభువునకుం గానిక యిడెను. రాజు
దానిం గన్నమాత్రాన ఆశ్చర్యమగ్నుఁడై చిత్రకరునితో 'ఓయి,
ఇది నీవ్రాఁత గాదు, ఇది విశ్వకర్మ వ్రాఁత, ఇట్టి యీరూప
మును వ్రాయ మనుష్యుని కెట్లు లలవి యగును!' అనియెను.
ఆమాట విని చిత్రకరుఁడు వాస్తవవృత్తాంతమును రాజునకు
నివేదించెను. అదిమొదలు రాజు అన్యమును కనక సర్వదా
ఆప్రతిమనే కాంచుచుండెను. రాత్రి కలలో ఆరూపమేగల కన్య
నొకతెను ద్వీపాంతరమునం గనియెను. ఉత్కంఠితుఁ డాతఁడు
ఉత్కంఠిత యగు నామెతో సంగమము పొందనుండి వేకువను
గస్తివానికేకచే మేలుకొనెను. అట్లు ఆవరకన్యతోడి సమాగమ
సుఖము భగ్నము కాఁగా రాజు కోపంబున ఆగస్తివానిని పట్ట
ణమునుండి తఱిమివైచెను. 'బాటసారి యేమి! అందు కన్నియ
చిత్తరు వేమి! సఱివను ఆకన్నియను కలలోఁ గాంచుటయేమి!

కాన ఆకన్య వాస్తవముగా కల దని ఈదైవఘటన తెలుపు చున్నది. కాని, ఆద్వీప మేదో నే నెఱుఁగను, ఆసుందరి నెట్లు పొందుదును!' అని తలపోయుచు నారాజు ఎల్లవిషయంబులం దును అరతి పొడమినవాఁడై పరివారము దిగులుపడునట్లుగా మదనజ్వరముచే వేఁగసాగెను. అతనిని కాఁకలకుం గారణ మును ప్రతీహారుఁడు భద్రాయుధుఁడు ఏకాంతమున నడిగెను. మహీపాలుఁడు ఇట్లు ఉత్తర మొసంగెను.—

వినుము చెలికాఁడా, నాకు చిత్రకరుఁడు నగరస్వామి ఆకన్య ప్రతిమ నిచ్చిన వృత్తాంతమును నీ వెఱుంగుదువుగదా. ఆచిత్రకన్యను ధ్యానించుచు నేను నిద్రించి కలలో సముద్ర మును దాఁటి అతిసుందరము నొకనగరముం జొచ్చితిని. అందు పలువురు కన్యలు ఆయుధహస్త లుండిరి. వారు నన్ను మొగిలం గన్న మాత్రాన కొట్టు కొట్టుఁ డని బిగ్గరగా కోలాహలము చేసిరి. అంతట తొట్రుపాటుతో నొకతాపసి వచ్చి నన్ను తన యింటిలోనికిం గొనిపోయి సంక్షేపముగా నిట్లులనియె. 'పుత్త్రా, ఇదె రాజపుత్త్రి మలయవతి పురుషద్వేషిణి యిచ్చవచ్చినట్లు తిరుగుచు ఇటకు వచ్చియున్నది. కంటి కగపడినమాత్రాన పురు షునెల్ల నామె యీకన్నియలచే చంపించును. నిన్నుం గాచు టకై నే నిటం బ్రవేశపెట్టితిని.' ఇట్లు పలికి ఆతాపసి తత్క్షణమే నాకు స్త్రీవేషము వైచెను. కన్యకలను పరిమార్చుట తగవుగా దని నేనును ఆవేషమున కంగీకరించితిని. అంతలో నారాజకన్య

కన్యకాపరివృతయై యటకే వచ్చినది. ఆసుందరి చిత్తరువున నేఁ గాంచిన యావరకన్యయే, అందులకు నే నాశ్చర్యపడి 'ఆహా! నేను కృతార్థుఁడను, చిత్తరువున నీప్రాణేశ్వరిం గాంచి యిట్లు వెండియు సాక్షాత్తుగాఁ గనుచున్నాను!' అని తల పోయుచుంటిని. ఆ రాజపుత్త్రి కన్యకాసమేత ఆతాపసితో 'ఇట నిపు డెవ్వఁడో పురుషుఁడు ప్రవేశింపఁగా మేము కంటిమి?' అని పల్కెను. 'పురుషుఁ డెక్కడ? నా చెల్లెలికూఁతు రిదే యిపుడే నన్నుఁ జూడ వచ్చినది.' అని తాపసి నన్నుం గాని పించెను. అంత నా రాజకన్య నన్ను స్త్రీరూపునైనను కాంచి పురుషద్వేషము మఱచి మదనపరవశయై గగుర్పాటుని ఏమో ఆలోచించుచున్నదియుంబోలె నిశ్చలయై లబ్ధావకాశుఁ డైన మదనునిచేత ఒక్కట నెల్లయమ్ములతోను కీలితయుంబోలె చూప ట్టెను. క్షణములో తెలివి తెచ్చుకొని రాజకన్య తాపసితో 'అవ్వా, అట్లైన నీకు చుట్టమైనది నాకుమాత్రము చుట్టము గదా! ఈమెను మాయింటికిం గొనిపోయి, సత్కరించి పంపె దను.' అని పలికి నన్ను చేయిపట్టుకొని తన మందిరమునకుం దోడ్కొనిపోయెను. నేను ఆకన్నియచిత్తము వడసి వల్లె యని కూడఁబోయితిని. ముదితాపసియు విదగ్ధురాలు నాపోక కంగీక రించెను. అట రాజకన్య నన్నుం గూడ నుంచుకొని కన్యకలతో నన్యోన్యవివాహాదివినోదంబులం గ్రీడింపసాగెను. రాకుమరిత నన్ను క్షణమేనియు తనపజ్జనుండి విడువదాయెను, నామీఁద నే

సహా కన్నులు గ్రుచ్చివైచెను, నేను లేనిది ఏదియు ఆసుందరికి
రుచింపదాయెను, అంత నాకన్యలు రాజకన్యను పెండ్లికొమ
రితం జేసి నన్ను పెండ్లికుమారునిం జేసి మాకు క్రీడార్థము
వివాహము గావించిరి; వివాహానంతరము రాత్రి మమ్ము
పడుకగదిలోఁ బ్రవేశపెట్టిరి. అంత నట రాజకన్య నిర్భయముగా
నన్ను మెడం గవుంగిలించెను. ఆసమయమున నేను నన్నుం
బ్రకటించికొని రాసుతం గవుంగిలించితిని. తనకోరిక నెఱవేఱి
నందులకు సంతుష్టయై రాకొమరిత నన్నుం గని క్షణము
లజ్జావనతవదనయై యుండెను. ఆమోహాంగిని నాస యొడ
లించి నేను కామక్రీడకుం దార్చునసమయంబున నిట గస్తివాఁడు
పాపాత్ముఁడు అఱచి నాకలకు భంగ మొనర్చెను. కావున భద్రా
యుధుఁడా చిత్తరువులోను కలలోను కన్నయామలయవతి లేక
యిప్పుడు నేను జీవితము నొల్లను.—

ఇట్లు రాజు పలుకఁగా ప్రతీహారుఁడు భద్రాయుధుఁడు
ఆకల సత్యమైనదిగదా యని యెఱింగి యాతని నోదార్చుచు
నిట్టు లనియె.—'దేవా, సకలము నీకు స్మృతియందుం గలదేని
ఆనగరము నెల్ల పటములో వ్రాసియిమ్ము. అటుపయి నేనుపాయ
మూరసెదను.' అని హెచ్చరించెను. అంతట రాజు క్షణ
ములో ఆనగరమును ఆవృత్తాంతమును సర్వమును పటమున
వ్రాసి యిచ్చెను. ఆచిత్తరువుం గొనిపోయి ప్రతీహారుఁడు
అప్పుడే క్రొత్తగా నొకమఠము కట్టించి అందు దాని వ్రేలఁ

గట్టించెను. ఆసమయంబున సత్త్రమున దూరదేశమునుండి వచ్చిన
వందల కొల్ల షడ్రసాహారంబులు దోవతులజోడును బంగా
రంబును ఒసంగునట్లు కట్టడ చేసెను. 'ఈవిత్తరువులోని పట్ట
ణము నెఱిఁగినవాఁడు ఎవఁడేని వచ్చినచో వానిని నాకుం దెలు
పుఁడు.' అని సత్త్రాధికృతుల కాజ్ఞచేసెను.

ఈలోపల మల్లెలనెత్తావిబుగులుకొనుమారుతంబును,
నీడల నేసదేఱుబాటసారులును, పూచినపాటలంబులును, గలి
గిన వేసవికాననమునకు అంబుదశ్యామము గంభీరగర్జితము
కేతకోద్దామదర్శనంబు వర్షాకాలమత్తగజము ఏతెంచెను. ఆ
సమయంబున విక్రమాదిత్యమహీనాథుని విరహదావానలము
ఆతూరుపుగాలికింబోలె వృద్ధినొందెను. అంత నాతనియాడి
గంపువారాంగనలలో 'ఓసీ, హారలతా, మంచు చల్లవే,
చిత్రాంగీ, ఒడల చందనం బలందవే, పత్త్రలేఖా, తామరాకు
సెజ్జను చలువగొలుపవే.' అని వాక్కులు వినవాయెను.
కొంతవడికి మెఱపులచే విషమం బయిన యామొగిలుకారు
శమిల్లెను గాని విరహజ్వాలతోఁడి తేనిమదనజ్వరముమాత్రము
శమిల్లదాయెను. 'పాంథులారా, దారి పట్టుఁడు, దయితలు
దయితులకు వార్తలు పంపుదురుగాక, వారికిని సమాగమము
లగునుగాక.' అని కలహంసరుతమిషంబున ఆజ్ఞాపించుచు విరిసిన
తమ్మినెమ్మోముది తెల్లఁబువ్వనవ్వది శరత్తు వచ్చెను. ఆసమ
యంబున దూరదేశమునుండి వచ్చిన యొకవంది ప్రతీహారకృత

మైన యామమతమునకు తక్ష్యాత్రి విని భోజనమునకు వచ్చెను. అతని పేరు శంబరసిద్ధి ఆతఁడు మఠములో భుజించి దోవతుల జోడు పుచ్చుకొని గోడయందు ఆచిత్రపటమును గాంచి అందలి యానగరముం బరికించి యాశ్చర్యపడి 'అయ్యా, ఈపురమును ఎవరు వ్రాసినారు! దీనిని కన్నవాఁడను నే నొకఁడను, దీని నెవఁడు వ్రాసినాఁడో ఆతఁడు రెండవవాఁడు, మఱి మూఁడవ వాఁడు దీనిం గని యుండుంగఁడు!' అని యడిగెను. ఆమాటను గొనిపోయి మఠజనులు భద్రాయుధునికి నివేదించిరి. అంత నాతఁడు స్వయముగా వచ్చి యానందిని రాజుకడకుం గొనిపోయెను. 'నీవు వాస్తవముగా ఆనగరమును కంటివా?' అని రాజడుగఁగా శంబరసిద్ధి "దేవా చూచినాఁడను, నేను భూమిం ద్రిమ్మరుచు మలయపుర మను పేరి యామహానగరమును సముద్రమునకు అవతల దీవి నడుమ. ఆనగరమున మలయసింహుఁ డని రాజు ఏలుచున్నాఁడు. ఆయనకు సాటిలేని సౌందర్యవతి మలయవతి యని కూఁతు రున్నది. ఆమె పురుషద్వేషిణిగా నుండి ఒకప్పుడు కలలో వివాహార్థము వెలువడినదై యొకానొకమహాపురుషుం గాంచెను. ఆతనిం గన్నమాత్రాన భయముగొన్నదియుఁబోలె ఆ పురుషద్వేషదురాగ్రహము ఆమె మనస్సునుండి యెటకో పలాయనమాయెను. అంత నాతనిని కలలోనే తనయింటికిం గొనిపోయి వివాహమాడి యామె తనపడుకటింట నతనితోఁ బ్రవేశించినది. అట నాతనితో నామె మదనక్రీడోత్సవము

పొందనున్నంత పడుకటింటి నున్నదాసి వేసవను ఆమెను మేలు కొలిపెను. అంత నామె కోపంబున ఆదాసిని వెడల నడిచి, కలలో తాఁ గాంచిన యాప్రియతముని తలంచుకొనుచు విరహాగ్నిచేఁ గ్రాఁగుచు మదనుని బారి కగ్గమై ఉపాయమేమియుఁ గానక లేచిలేచి మరల సెజ్జయందే అడంగుచుండెను. మూఁగవలె, గాలి సోఁకినదానివలె, చీఁకటిలో భ్రమం జెందినదానివలె నుండెను. అడిగినజనమునకు ఏమియు బదులు పల్కదాయెను. అంత నావృత్తాంత మెఱింగి తల్లియుం దండ్రియు కడు నిర్బంధంబుగ నడుగఁగా ఆప్తసఖిచే వారికి తన స్వప్నవృత్తాంతము నామె చెప్పించెను. అంతట తండ్రి యోదార్పగాఁ నాకన్య 'ఆఱుమాసములలోఁ గనుక నాతనిం బొందనేని నేను చిచ్చుం జొచ్చెద.' అని ప్రతిజ్ఞ చేసినది. ఇప్పటికి అయిదునెలలు గడచినవి, ఇఁక నామెకు ఏమి కాఁగలదో ఎవ రెఱుఁగుదురు ? ఇది యాపురమున నేనెఱింగిన వృత్తాంతము." అని యుత్తరము చెప్పెను. ఇట్లు శంబరసిద్ధి తార్కాణగా చెప్పఁగా రాజు నిక్క మెఱింగి సంతోషించెను. భద్రాయుధుం డిట్లనియె. 'దేవా, కార్యము నెఱవేఱినది. ఆదేశము దానిరాజుతోఁ గూడ నీవశములోనిది. కావున ఆఱవమాసము ముగియక ముందే అచటికి పోవలసినది ?

ఇట్లు ప్రతీహారుఁడు పలుకఁగా శంబరసిద్ధిని మహాధనములతో సత్కరించి విషయము దెలిపి నుంచుకొని విక్ర

మాదిత్య మహారాజు తన సంతాపమును సూర్యకిరణముల యం
దును, పాండిమను మేఘములందును, కార్శ్యమును ఏటి
నీళ్లయందును, విసరివైచెనో యన నైె తత్క్షణము నిరాతంకుం
డై, ప్రాణవల్లభంగూర్చి అలంకరించుటకుం దరలెను. సముద్ర
మును దాటి యానగరముం జేరంగానే ఆయన కోలాహ
లాకుల మయిన మహాజనసంఘముం ఎదుటం గని కత మడిగి
'ఇదె రాజపుత్త్రి మలయవతి షాణ్మాసికావధి నిండిపోంగా
దయితుండు రామింజేసి అగ్నిప్రవేశము సేయుచున్నది.' అని
యుత్తరము విని, అతివేగంబున ఆసౌధ యున్నతావునకుం జని
యెను. అతనిం గాంచి యట జనసంఘము దారి తొలంగంగా
నట రాజకన్యక నేత్రముల కరాలామృతవర్షంబు నా మహా
రాజుం గాంచెను. అంత నామె 'ఇతండె కలలో నన్ను పెండ్లి
యాడిన ప్రాణేశ్వరుండు వచ్చినాండు, ఇటనే ఈక్షణమే మా
నాయనతోం జెప్పుండు.' అని సఖులను ఆజ్ఞాపించెను. వారునుం
బోయి వెంటనే ఆవృత్తాంత మామెతండ్రి కెఱింగింపంగా ఆ
రాజు వెతదీఱి పట్టరానిహర్షంబున వినయంబున విక్రమా
దిత్యునికడ కేతెంచెను. ఆసమయంబునందు శంబరసిద్ధి యవ
సరజ్ఞుండు ఖావాలువెత్తి బిగ్గరగా నిట్లు పఠించెను:—'నిజతేజ
స్సాధితభూతగణుండా, మ్లేచ్ఛారణ్యదావాగ్నిజయ సప్తసాగర
సీమమహీమానినీనాథా, దేవా, జయ. విజితసకలరాజ వినత

శిరోధారితశాసనా, విక్రమవారినిధీ, వినయశీల మహీపతీ విక్రమాదిత్యుఁడా, జయ.' ఇట్లని వంది పఠింపఁగా మలయసింహమహీపతి, ఆవచ్చిన యల్లుని విక్రమాదిత్యునిగాఁ నెఱింగి యాతని పాదములం బట్టికొని అతిథిసత్కారములు గావించి తన మందిరమునకు మృత్యుముక్త యయిన కూఁతురు మలయవతితోఁ గూడం దోడ్కొనిపోయెను. అట నారాజు తాను కృతార్థుఁ డని సంతసించి విక్రమాదిత్యమహారాజునకు ఆకన్యను యథావిధిగా నిచ్చి వివాహము చేసెను. విక్రమాదిత్యమహారాజు, చిత్తరువున నెట్లో కలలోను అట్లే, కలలో నెట్లో తన యొడిలో అట్లే సాక్షాత్తుగానున్న యాప్రియంగాంచి, ఆయద్భుతము ఉమాపతిప్రసాదంపుఁ గల్పవృక్షంపుఫల మని తలంచెను. అనంతరము రూపుదాల్చిన నిర్వృతింబోని యా మలయవతిం దోడ్కొని సుదీర్ఘ విరహ ంబుంబోలె సోత్కలికం బయిన వారినిధిని దాఁటి దారి పొడవునను నానోపాయనహస్తు లగురాజుల మ్రొక్కులందుచు విక్రమాదిత్యమహారాజు తన నగరికి ఉజ్జయినికిం బోయెను. చిత్తరువునం గన్నదానిని తన యిచ్ఛవచ్చినట్లు నిజము చేసిన యారాజు ప్రభావమునకు అచట రాజధానియందు ఆశ్చర్యపడని వా రెవరు, సంతసింపనివా రెవరు, మహోత్సవము చేయనివా రెవరు!

## ౪-వ తరంగము.

అనంతరము విక్రమాదిత్యునిరాణులలో నొకతె కళింగ సేన యను నామె సవతులతో నొకప్పుడు మాటలవరుసను ఇట్లు వచించెను.—ఇతఁడు నాయొక్కగల ప్రతిమను చూచి మదనపరతంత్రుండై బలాత్కారంబునం బట్టి తెచ్చి నన్ను వివాహమాడలేదా! దీనివిషయ మయిన కథను దేవసేనుఁడను కార్పటికుఁడు నాతో వక్కాణించినాఁడు, మీకు చెప్పెదను వినుండు. నన్ను అవిధిగా రాజు వివాహమాడె నేమి యని దుఃఖితురాలనై యున్న నన్ను ఆకార్పటికుఁడు ఓదార్చి 'దేవీ, వందురకుము, నిన్ను మహారాజు అతిశ్రద్ధతో మహా సంరంభంబున వివాహమాడెను. ఆకథను ఆమూలముగా వినుము.' అని యిట్లు చెప్పెను—నేను కార్పటికుఁడనుగా నీసామిని కొలుచుచు ఒకప్పుడు అడవిలో దవ్వునందు కోఱలు నిండిననోరు గలిగి చీఁకటిమ్రాఁకువలె నల్లనైన యొక గొప్ప వరాహమును రూపుదాల్చి చంద్రకళను భక్షించుచున్న కృష్ణపక్షమో యన నొప్పుదానిని గాంచి వచ్చి, దేవీ, మహా రాజున కెఱింగించితిని. అంతట రాజు కుతూహలంబున వేటకు దరలెను. మృగములకానకుం బోయి పులులను లేళ్లను తయి మొందించుచు మహారాజు నేఁ దెల్పిన వరాహమును దవ్వులం గాంచెను. కని యచ్చెరువొంది, ఏదో కారణసూకరము గాని, సామాన్య సూకరము గాదని తలంచి, ఉచ్చైఃశ్ర

వము పిల్లను రత్నాకర మను పేరిగల యిత్తడిని నెక్కెను. నడి పగ
లింట ప్రతిదినము సూర్యుఁడు ఒకనాఁడు హాయార్తమున మింట నిలిచి
యుండును. ఆసమయమున అనూరుఁడు సూర్యాశ్వములను
స్నాన పానములకై వదలును. ఒకప్పుడు ఉచ్చైఃశ్రవమును వద
లఁగా, సూర్యరథమునుండి అది వచ్చి అడవిలో తిరుగుచున్న
విక్రమాదిత్యునిగోడిగం గాంచి దానింగూడి యీరత్నాకరా
శ్వమును పుట్టించినది ఆవాతాశ్వము నెక్కి తేఁడు వరాహ
మును వేగము మెయి నతిదూరప్రదేశమునకుం దఱుముకొని
పోయెను. అట నాసూకరము రాజుకంటి కగపడక యెటకో
పోయెను. ఉచ్చైఃశ్రవము కొడుకయిన యాగుఱ్ఱము వేగమున
కంటెను ఆపంది వేగము ఎక్కువ యాయెను. దానిం గనిపట్ట
నేరక రాజు తనపరివారము ఎక్కడనో వెనుకఁ జిక్కఁగా,
వెంట వచ్చుచున్న నన్నుం గాంచి 'మనము ఎంతదూరము
వచ్చితిమో ఎరుఁగుదువా?' అని యడిగెను. ఆమాటకు దేవీ,
నేను 'మహారాజా, మనము మున్నూఱు ఆమడలు వచ్చినా
రము.' అని బదులు పల్కితిని. 'అట్లయిన నీవు కాలినడ నెట్లు
వచ్చితివి?' అని ప్రభువు అచ్చెరువడి యడిగెను. నేని ట్లుత్తరము
చెప్పితిని. 'దేవా, నాకడ పాదలేప మున్నది. ఆవృత్తాంతమును
చెప్పెదను వినుము పూర్వము భార్యావియోగము చేత నేను
తీర్థయాత్రకై తరలి దారిలో సాయంకాలమున ఉద్యాన
సహితము నొక దేవళమును చేరితిని. అచట ఆరాత్రి గడుపఁ

గోరి లోనం జొరంగా అం దొక స్త్రీ యుండి నా కాతిథ్య మొసంగెను. రాత్రి యామె ఒక పెదవి మింటను రెండవ పెదవి నేలనుగా నోరు దెఱచి ఇట్టికోటిని నీవెందేని కంటివా యని నన్నడిగెను. అంత నేను కత్తి దూసి బొమలుముడిచి కొంకు లేక 'నీ వెందేని యిట్టిపురుషుని గంటివా?' అని యడి గితిని. అంత నామె సౌమ్యరూపము దాల్చి నాతో 'ఓయి, నేను చండి యనుపేరి యక్షిని, నీధైర్యమునకు మెచ్చితిని. కావున నిపుడు చెప్పుము నీకేమి ప్రియ మొనర్తును?' అని పలి కెను. అందులకు నేను 'వాస్తవముగా నీవు నాయందు సం తుష్టి వహించితివేని, ఏయుపాయమున నేను సకల తీర్థములను క్లేశము లేకుండ సేవింతునో ఆయుపాయము కావింపుము.' అని యక్షిని అడిగితిని. అంతట నాయక్షి నాకు పాదలేప మొసంగినది. దాన నేను సకల తీర్థములను సేవించితిని, ఇపుడు నీవెంట వచ్చితిని; దాని ప్రభావంబుననే నేను ప్రతిదినము ఈ కానన ప్రదేశమునకు వచ్చి పండ్ల యోగిరము భుజించి వెండియు నుజ్జయినికి వచ్చి నిన్నుం గొలుచుచుందును.' ఇట్లని, దేవీ, నేను ప్రభువునకు విన్నవించితిని. తేని ప్రసన్నదృష్టులచేత న న్నాతఁడు యోగ్యతగల యనుచరునింగాఁ దలచిన ట్లగపడినది. నేను వెండియు ప్రభువుతో 'దేవా ఏలినవారు భుజింతురేని మంచి రుచిగల పండ్లం దెచ్చెద.' అని విన్నవించితిని. ప్రభు వి ట్లనియె 'నేను భుజింపను, నా కిప్పుడు అక్కఱ లేదు. నీవు

బడలియున్నాఁడవు, కాన నీవు ఏమేని భుజింపుము.' అంత నేనట నొక దోసకాయను బడసి భక్షించితిని, భక్షించిన మాత్రాన నజగరమ నయితిని. దేవీ, అట్లాకస్మికంబుగా నజగరమ నయిన నన్నుం గాంచి విషమశీలమహారాజు విషాదాశ్చర్యములపా లయి, ఒంటరియై, భూతకేతు నామధేయుని వేతాళుని తలంచు కొనెను; మున్నాతనిని మహారాజు తాఁ గంటం జూచినమాత్రాన నేత్రరోగమును కుదిర్చి వశుఁజుచుకొనెను. ఇప్పుడు తలఁచిన మాత్రాన నా వేతాళుఁడు వచ్చి సవినయంబుగ 'మహాప్రభూ, నన్నుం దలఁచితివే, ఏమి సేయవలయునో ఆనతిమ్ము.' అని విన్నవించెను. ఓయి మంచివాఁడా, నా కార్పటికుఁ డీతఁడు ఆకస్మికముగా అజగర మయినాఁడు, ఇతనిని తొంటిస్థితిం బొందింపుము.' అని రాజు ఆజ్ఞాపించెను. అంతట వేతాళుఁడు 'దేవా, నాకట్టి శక్తి లేదు. శక్తులు నియతములు, నీరు మేఘుంపుఁజిప్పు నార్పునా?' అని విన్నవించెను. 'అటయిన మిత్రమా, ఈ పల్లెకుం బోవుదము, అట నొకవేళ బోయలవలన నిందుల కేదే నుపాయము అలవడవచ్చును.' అని పలికి మహారాజు వేతాళునితో పల్లెకుం బోయెను.

అట ఆభరణవంతుని రాజుం గాంచి దొంగలు చుట్టవేసికొని అంపవానం గురియసాగిరి. వారిని అయిదువందల మందిని వేతాళుఁడు భూతకేతుఁడు రాజాజ్ఞచే భక్షించెను. మిగిలినవారు పలాయితులై తమ సేనాపతికి ఏకాకికేసరి యను పేరివానికి ఆవృత్తాంతము నివేదించిరి. వాఁడును కోపంబు

దీపింప దండుం దోడ్కొనివచ్చెను. వానిభృత్యులలో నొకఁడు రాజును ఆనవాలుపట్టి వానికిం దెలుపఁగా వాఁడు వచ్చి రాజు నకుం బాదానతుఁడై తన్నుం దెల్పుకొనెను రాజు వానిని బుజ్జగించి, కుశల మడిగి యిట్లనియె. 'నా కార్పటికుఁడు అడ విలో దోసకాయ తిని అజగర మైనాఁడు, అతనిని ప్రకృతిస్థుం జేయుటకు ఉపాయ మేమేని చేయుము!' ఈమాటవిని సేనాపతి 'దేవా, తమ యనుచరుఁ డీతఁడు నాకొమరునికి ఆ యజగరమును చూపునుగాక.' అని విన్నపించెను. అంతట నాతనికొమారుఁడు బేతాళునితోఁ గూడ నాకడకు వచ్చి ఏదో ఒక యోషధిపసరు నాముక్కునం బిడిచి నన్ను యథాప్రకారము మానుషుని గావించెను. అంత మేము మువ్వురము సంతోషంబున రాజుకడ కేఁగితిమి. రాజు పాదానతునికి నాకు ఆ వృత్తాంతము నాన తిచ్చెను.

అంతట సేనాపతి ఏకాకికేసరి రాజును వేఁడుకొని ఆయ నను ఆయనతో మమ్మును తనయింటికిం గొనిపోయెను, అచట వానియింట జోయతలు నిండి కొలుచుచుండిరి. గోడలు ఏనుఁగు దంతములతో నిర్మింపఁబడినవి. ఉన్నతములు, ఇంటికప్పు పులితోలు; అచట స్త్రీలకు వస్త్రములు నెమలిపురులు, వేరు గురివెందగింజల దండలు, ఏనుఁగు మదము నోడికలు పైపూఁ తలు. అచట సేనాపతి పెండ్లాము కస్తూరిగదంబించువలువలు దాల్చినది ముక్తావ్యలంకారవతి రాజునకు స్వయముగా పరి

చర్య లొనర్చెను. అందు జలకంబులాడి యారగించి యారాజు సేనాపతి పడుచువాఁడుగాను అతనికొమరులు ముదుసళ్లుగాను ఉంటం గాంచి ప్రశ్న చేసెను: 'సేనాపతీ, నా కీయాశ్చర్యమును తీర్పుము, నీవు పడుచువాఁడవు, ఈనీపుత్త్రులు ముసలివాండ్రు, ఇది యెట్లు? ఇట్లు రా జడుగఁగా శబరనాయకుఁడు చెప్పం దొడంగెను.

దేవా, ఇది యొక గొప్పకథ, వినవలయునేని వినుము, నేను బ్రాహ్మణుఁడను, నాపేరు చంద్రస్వామి. నేను మున్ను మాయాపురియందు కాఁపుర ముంటిని అట నొకకోఁతి నాదారి కడ్డము నిలిచి నన్నేమియు బాధింపక దీనదృష్టుల నాకు వే ఱొకదారిం జూపుచుండెను. 'ఇది నన్ను కఱవ లేదు, కావున ఇది చూపినమార్గాననే పోదునుగాక, దీని యభిప్రాయ మేమో కనియెదఁగాక.' అని యాలోచించుకొని నేను ఆ రెండవదారినే నడచితిని. ఆక్రోఁతియు నాకు ముందుముందుగా వెనుకకు తిరిగి తిరిగి నన్ను చూచుచు పోవుచుండెను. కొంతదూర మిట్లేఁగి యాక్రోతి యొక నేరెడుఁజెట్టు నెక్కెను. ఆ చెట్టుపైవైపు అంతటను దట్టముగా తీఁగలజీబుగా నుండెను. అందు ఆదుఁ గ్రోఁతి తీవచుట్టలలో ఇఱుకుకొని యుంటం గని అందులకుఁ గదా ఆవానరము నన్నటకుం దెచ్చిన దని యొఱిఁగితిని. అంత నేను చెట్టెక్కి నాగొడ్డటితో ఆతీవచుట్టలను నఱికివైచితిని. అంత చెట్టునుండి వానరియు వానరమును దిగి నేనును దిగఁగా,

రెండును నాపాదములు పట్టుకొన్నవి. అనంతరము, మగక్రోతి అడుక్రోతిని నాపాదములకడనే యుంచి పోయి క్షణములో నొకదివ్యఫలము తెచ్చి నాకిచ్చినది. దానిం బుచ్చుకొని వంట చెఱకుం గొని నేను ఇంటికి పోయి ఆపండు కొంత నేను భక్షించితిని, శేషము భార్య కిచ్చితిని, దానిని భార్య భక్షించినది. దానిం దిన్నంతనే మాకు ఇరువురకును ముదిమియును రోగము లును తొలంగినవి. అనంతరము మాదేశములో కాటకము సంభవించినది. ఆకసపీడచే నందఱుజనులు ఎక్కడెక్కడికో దేశాంతరములకు చెదరిపోయిరి. నేనును క్రమక్రమంబుగా సభార్యుఁడను ఈదేశమునకు వచ్చితిని. ఇచట కాంచనదంష్ట్రుం డని బోయదొర యుండెను. నేను కత్తికట్టి యతనిగొలువునం గుదురుకొంటిని వచ్చినదురములయం దెల్ల ముందుపోవువానిని నన్నుం గాంచి కాంచనదంష్ట్రుఁడు మెచ్చి సేనాపతినిగా నభిషే కించినాఁడు. నేనును ఆప్రభువును ఏకభక్తితోఁ గొలుచుచుం టిని. అపుత్రుఁడా యన తనయవసానకాలమున తనరాజ్య మును నాకే యిచ్చెను ఇట నిప్పటికి నేను రెండువేల యేను వందల సంవత్సరము లున్నాను. ఆపండు తిన్న కారణంబున నాకు ఇప్పటికిని ముదిమి రాలేదు.

ఇట్లు తనవృత్తాంతము చెప్పి భిల్లరాజు ఏకాకికేసరి యాశ్చర్యపడుచున్న విక్రమాదిత్యమహారాజుతో వెండియు నిట్లు విన్నవించెను. 'ఆవానరఫలంబుచే నాకు గలిగిన చిరజీ

వితమునకు ఇపుడు పూర్ణఫలము నీపాదములం గొలుచుటయే. కాన, ఓదేవా, మాయింటికి వచ్చుటచే నాయందు ఏయను గ్రహమును చూపితివో ఆయనుగ్రహమునకు ఇప్పుడు పరి తోషము జేర్పుము. నాకు క్షత్త్రియభార్యయందు జనించినది కన్యక యొకతె రూపమున సాటిలేనిది మదనసుందరి యనుపేరిది కలదు. ఆకన్యారత్నము, దేవా, నీకడఁగాక ఉండుచో రాణి ల్లదు. కావున దానిని నీకిచ్చెద, యథావిధిగా పెండ్లికమ్ము, నేను నీదాసుఁడను, రెండులక్షలవిలుకాండ్రు నన్నుం గొలుచు చున్నారు.' ఇట్లాతఁడు వేడుకొనఁగా రాజు అంగీకరించి శుభ లగ్నంబున ఆకన్నియం బరిణయంబాయెను. ఏకాకికేసరి నూఱు లొట్టియలపై ముత్తెములు కస్తూరియు నిండుమోఁతగా నరణ మొసఁగెను. రాజు అచట ఏడుదినములు నిలిచి అనంతరము బోయదండు వెంట రా మదనసుందరిం దోడ్కొని యటనుండి తరలెను.

ఈలోపల రాజును గుఱ్ఱము ఎగవేసికొని పోఁగా దిగు లొందియున్నమాదండుతో ప్రతీహారుఁడు భద్రాయుధుఁ డి ట్లనియె. 'ఏల బెగ్గిలెదరు? మీాదొర త్వరగానే వచ్చును. దివ్య ప్రభావుని కాయనకు ఏమియు చెట్ట గలుగదు. ఏమి! మఱచి తిరా? ఆయన యొంటరిగా పాతాళమునకుం బోయి సురూప యను నాగకన్యను వివాహమై మరలి వచ్చుటను? ఆవీరుఁడు గంధర్వలోకమున కరిగి గంధర్వరాజుకూఁతును తారావళిని

కొనిరా లేదా!' భద్రాయుధుండు పల్కినయామాటలకు వా
రందఱును ఊరడిల్లి అడవిమొగంబున రాజుదారిం గనుపెట్టుచు
విడిసియుండిరి. స్పష్టమయిన వారిని బోయదండుతోఁ గూడ
మదనసుందరి పోవుచుండఁగా, గుఱ్ఱ మెక్కి రాజు యథేచ్ఛము
గా భేతాళుఁడును దానును వెంటరా మున్ను గన్నయాయొంటి
గానిం గన వేడుక మెయి అనునుపటియడవినే ప్రవేశించెను.
ప్రవేశింపఁగానే ఆవరాహము ఎదుట నగపడెను. దానిం జూచి
నంతనే రాజు అయిదుబాణములం బఱిమార్చెను. భేతాళుఁడు
పరువునం బోయి దానిదేహమును చింపఁగా అందునుండి సొబగుఁ
డొకపురుషుఁడు వెలువడెను. రాజాశ్చర్యపడి ఎవరవు నీ వని
యడుగునంతలో నచటికి నడగొండవంటి యొక మదపుటేనుఁగు
వచ్చెను. ఆవన్యగజమును రాజు ఒక్కకోలనే ఆయువు
పట్టునం గొట్టి నేలం గూల్చెను. భేతాళుఁడు దానికళేబరమును
చింపఁగా అందునుండి దివ్యుఁ డొకపురుషుఁడును సర్వాంగ
సుందరి యొకస్త్రీయు వెలువడిరి. వృత్తాంత మడుగనుండిన
రాజుతో ఒంటిగానిదేహమునుండి వెలువడిన పురుషుఁడు తన
వృత్తాంతము నిట్లని చెప్పందొడంగెను — 'రాజా, మావృత్తాం
తము చెప్పెదను వినుము. మేము మిరుపురమును దేవకుమారు
లము, ఇతనిపేరు భద్రుఁడు, నాపేరు శుభుఁడు. మేము మిరుపురము
త్రిమ్మరుచు నొకప్పుడు ధ్యానస్థుని కణ్వమహామునిం గాంచి,
క్రీడార్థము గజసూకరరూపములం గైకొని తెలివిలేక ఆమునిని

భయపెట్టితిమి అంత నాముహర్షి అడవియందు అట్లే గజసూకరములముగా సంచరించుచుండునట్లు శపించి, విక్రమాదిత్య భూపాలుని చే మడియునట్లు శాపాంతము నియమించెను. ఇవ్విధమున మేము మునిశాపమున గజసూరకముల మైతిమి, ఇపుడు నీచే శాపము క్తినొందితిమి. మాకథ యిది. ఈచెలువ తన కథను తానే చెప్పుకొనునుగాక. నీవు ఈపందిని మెడయందును, ఏనుఁగును వీపునను తాఁకుము, ఇవి నీకు కత్తియు కేడెంబును దివ్యములయినవి యగును.' ఇట్లు పలికి రెండవవానితోఁగూడ నాతఁడు దివ్యమొగంబాయెను. రాజు చేతితో తాఁకఁగా పందియు నేనుంగును కత్తియు కేడెంబు నయినవి.

అనంతర మాస్త్రీని రాజు అడుగఁగా ఆమె తనవృత్తాంతము నిట్లుచెప్పెను. నేను ఉజ్జయినిలో ధనదత్తుఁడనువణిక్పతికి భార్యను; నేను మేడమీఁద నిద్రించి యుండఁగా ఈయేనుఁగు వచ్చి నన్ను మ్రింగి యిటకుం దెచ్చినది. అపుడు దీనియందు పురుషుఁడు లేఁడు, ఇపుడు దీనికడుపుం జీల్పఁగా అందునుండి నాతోఁగూడ వెలువడినాఁడు.' ఇట్లు విన్నపించుకొన్న యాదీనురాలిని మహారాజు, 'భయపడకు, నిన్ను నీయింట నీభర్తతో నేను చేర్చెదను, భయము లేకుండ నారాణివాసముతోఁగూడఁ జనుము.' అని యోదార్చి, వేలుమార్గమునం జనుచున్న తన రాణివాసముకడకు బేతాళునిచేత ఆమెను చేర్పించెను. బేతాళుఁడు మరలివచ్చినంతట మాకు ఆకస్మికముగా ఆయ్యడవిలో

గొప్పపరివారముతో నిరువురు రాజకన్య లగపడిరి. నన్ను పంపి రాజు వారిమహత్తరులను రావించి 'ఎవ రీకన్యలు, ఎటనుండి ఎట కేఁగుచున్నారు?' అని యడిగెను.

మహత్తరు లి ట్లనిరి. సకలసంపదలకును ఆటపట్టు కటాహ మని ద్వీపము కలదు. అందు గుణసాగరుఁ డని యన్వర్థనాముఁడు రాజు కలఁడు. ఆయనకు పట్టపుదేవియందు గుణవతి యను పేరి తనయ జనించెను. ఆకన్య సృజించిన బ్రహ్మదేవునికి తనరూప ముచే వెఱఁగు గొల్పునది. ఆకన్యకు సప్తద్వీపేశ్వరుఁడు పతి యగు నని సిద్ధులు ఆదేశించిరి అంత తండ్రి మంత్రులతో ఆలో చించి 'విక్రమాదిత్యదేవుఁడే నాకన్యకు తగినవరుఁడు ఆతనిం బెండ్లియాడునట్లుగా ఈకన్యను ఆతనికడకే పంపెదను.' అని నిశ్చయించుకొని ఆమెను పరివారముతోను ధనముతోను సముద్రమందు ఓడనెక్కించి తరలించెను. సువర్ణద్వీపముకడకు రాఁగా ఆయోడను దైవవశంబున రాజకన్యాతత్పరివారసమే తముగా మత్స్య మొకటి మ్రింగెను. విధిగతియుండబోలె పోటు వచ్చి ఆ పెనుమీనును ఆద్వీపంపుగట్టునకుం గొనివచ్చి యటుం ద్రోచెను. అట నిఱుకుకొని మహామత్స్యము వశము తప్పి పడి యుండెను. దానిం గన్నమాత్రాన జనులు నానాయుధములు కైకొని పఱతెంచి వచ్చి చంపి దానికడుపుం జీల్చిరి. అందు నుండి జనపూర్ణ మయినయాగొప్పయోడ వెలువడియెను. ఆయాశ్చర్యమును విని అచటిరాజు చూడవచ్చెను. చంద్రలేఖ

రుఁడను పేరివాఁడా రాజు గుణసాగరభూపతికి బావమఱఁది వీడ
లోనిజనులవలన వృత్తాంత మెఱింగి గుణవతిని తనమేనఁగోడలి
నిగా గ్రహించి తనయింటికిని గొనిపోయి పండువు గావించెను.
మఱునాఁడు ఆరాజు తనకూఁతును చంద్రవతిని మున్ను తాను
విక్రమాదిత్యమహారాజున కీయ సంకల్పించుకొన్నదానిని గుణ
వతితోఁగూడ మహావిభవసమేతముగా ఓడ యెక్కించి మంచి
ముహూర్తంబునం బంపెను. వారే ఈకన్యలిరువురును సము
ద్రమును దాఁటి యిటకు వచ్చిరి, మేము వారి పరిజనులము.
ఇక్కడికి వచ్చినంత మమ్ము గొప్పసూకరవారణములు రెండు అడ్డ
గించినవి. అంతట మేమిట్లు మొఱవెట్టితిమి. 'ఈకన్యలిరువురును
విక్రమాదిత్యదేవుని స్వయముగా వరించి వచ్చి యున్నారు;
కావున నోలోకపాలకులారా, ఆతనిధర్మముచే మీరు వీరిని
రక్షింపుఁడు.' ఆ మొఱ విని యా క్రోడకుంజరములు స్పష్ట
వాక్కున మాతో 'భయపడకుఁడు, ఆరాజును వేఱొకన్న
పిమ్మట మీకు భయ మెక్కడిది ! ఇచటకే వచ్చియున్న యా
రాజును మీరు ఇపుడే కాంచెదరు.' అని పలికి ఇటనుండి
ఎటకో పోయినవి. ఇది మావృత్తాంతము

ఇట్లని మహత్తరులు పలుకఁగా, నేను, దేవీ, ఆరాజు
ఈతఁడే యని వచించితిని. అంతట వారు మహారాజునకు
పాదపతితులై ఆకన్యలను గుణవతీచంద్రవతులను సమర్పించిరి.
రాజు వేతాళునిచేత ఆకన్యల నిరువురను మదనసుందరికడకు

ఆమెతోఁ గూడఁ జనుదెంచునట్లుగా పంపెను. క్షణములో
వేతాళుఁడు ఆపని నెఱవేర్చి రాఁగా, మా యిరువుర
తోను, ప్రభువు పైవారిని పోవుచుండెను. మాకు అడవిలో
సూర్యుఁ డస్తమించెను. మృదంగనాదము వినఁబడియెను. 'ఈ
మృదంగనాద మెక్కడిది?' అని రాజడుగఁగా 'దేవా, ఇట
నొక దేవళ మున్నది, దివ్యము, వింతయైనది, విశ్వకర్మ నిర్మించినది.
అచటిది యీమృదంగధ్వని, సంధ్యాప్రేక్షణకముది.' అని వేతా
ళుఁడు చెప్పెను. అంత రాజును నేనును వేతాళుండును కౌతు
కంబున అట కేఁగి గుఱ్ఱమును వెలిం గట్టి లోనికిం బోయితిమి.
అందు గరుడరత్నముం జెక్కి చేసినలింగము అప్పుడే పూజనొంది
నది యుండెను. దానిమ్రోల దేదీప్యమాన దీపసమూహముతో
ప్రేక్షణీయకము జరుగుచుండెను. అట దివ్యరూపలు వరాంగ
నలు గానగాంధర్వయుక్తము లగునాల్గువిధములవాద్యములతో
చాలసేపు నృత్యము సల్పిరి. ప్రేత్యము సమాప్తి కాఁగా నట
మే మొకయాశ్చర్యముం గంటిమి; ఏమనఁగా ఆనర్తకీగణమెల్ల
స్తంభములలోని బొమ్మలయందు ప్రవేశించి మాయమైనది.
గాయకులును వాదకాదులును, చిత్తరువులందలి ప్రతిమలలో
లయ మొందిరి. దానిం గని రాజు ఆశ్చర్యపడుచుండఁగా వేతా
ళుఁడు 'ప్రభూ, ఇది విశ్వకర్మ చేసిన యక్షయదివ్యమాయ,
సదా ఇరుసంజలయందును ఇది జరుగుచుండును.' అని విన్న
వించెను. అంత మేము అటనే లోనతిరుగుచు ఒక్కెడ సవిశేష

రూపశాలినిని ఒకకంబపుబొమ్మను గంటిమి. దానిం గన్న మాత్రాన రాజు దానిలావణ్యమునకు మోహ మొంది శూన్యుఁడు స్తబ్ధుఁడు నై క్షణము తానును కంబమునం జెక్కిన వానివోలెఁ నుండెను. 'ఈ రూపముతోడి యంగనామణిని పడివను కానవేని, నా కీరాజ్య మేల, ఈజీవిత మేల?' అని రాజు పల్కెను. 'ప్రభూ, నీకు దుర్లభము కాదు, కళింగ రాజునకు కళింగ సేన యని కూఁతురు కలదు. ఆమెం గని రూపకారుఁడు వర్ధమానపురము వాఁడు ఆరూపమును ఘటించు తలంపున ఈబొమ్మను చేసినాఁడు. కాన, ప్రభూ, ఉజ్జయినికిం బోయి కళింగ రాజును అడుగ నంపి గాని విక్రమము చేతఁ గాని ఆకన్యం గైకొమ్ము. అని వేతాళుఁడు చెప్పెను. రాజు అందుల కంగీకరించెను.

అంతట మేము ఆరాత్రి యటం గడపి తఱువాత తరలి నడుచుచు, ఒక యశోకవృక్షము క్రింద నిద్దరు పురుషులను గంటిమి. వారు భవ్యాకృతులు రాజుం గని లేచి ప్రణమిల్లిరి. 'మీ రెవరు? ఏల యరణ్యమున నున్నారు?' అని రాజు డుగఁగా, 'దేవా, వినుము నేఁ జెప్పెదను.' అని వారిలో నొకఁడు ఇట్లనియె. నేను ఉజ్జయినిలో ధనదత్తుఁ డను వేరివణిక్పుత్త్రుఁడను. ఒకప్పుడు నేను మేడమీఁద భార్యతోఁ గూడ నిద్రించితిని. వేకువను మేల్కాని చూచినంత నాభార్య లేదు, మేడలోను లేదు, తోఁటలలోను లేదు. దానిచిత్తము నావిషయమై

మాటను లేదు. అందులకు అది చేసిన శపథ మొకటి యు
న్నది. ఏ మన, 'నేను పతివ్రతనుగానే యుంటినేని, ఇది వా
డదు.' అని అదినాకు పూదండ నిచ్చియున్నది. అది వాడ
కయ యున్నది. కాన ప్రాణేశ్వరి ఎటకేఁగినదో, భూతా
దికము లేవేని హరించినవో యెఱుంగను, ఇట్లు తలపోయుచు,
వెదకుచు, ఏడ్చుచు, బిగ్గరగా పేర్కొనుచు, మొఱవెట్టుచు,
విరహాగ్నికి మండుచు నేను భోజనము మాని యుంటిని.
బంధువులు ఓదార్పఁగా, కొంచెము భుజించి అప్పటినుండి
బ్రాహ్మణభోజనములు సేయించుచు దేవాలయంబున నెలకొని
యుంటిని. ఒకప్పుడు అటకు బడలినవాఁడు ఈ బ్రాహ్మణుఁడు
నాకడకు వచ్చినాఁడు. నేను ఈయనను స్నానభోజనములచే
నుపచరించి సేవదేర్చితిని. భోజనానంతరము ఎక్కడివాఁడవు
నీ వని నే నడుగఁగా, ఈయన తాను కాశికడ నొకపల్లెటూరి
వాఁడ నని చెప్పెను. ఈయనతో నాభృత్యులు నాదుఃఖమును
చెప్పిరి; అంత నీయన నాతో 'మిత్త్రుఁడా, ఏమి నీవు ప్రయ
త్నము మాని యిట్లు శోకించుచున్నావు? దుష్ప్రాపమయి
నను ఉద్యోగికి సులువుగా దొరకును; కావున మిత్త్రుఁడా, లే
లెమ్ము, నేను నీకు చెలికాఁడనుగా, నీభార్యను వెదకుద
మురా?' అనియెను. 'ఎట్లు వెదకుదము? ఏ దిక్కునఁ బోయి
నదో, అదియేని తెలియదే.' అని నేను బదులాడఁగా, నాతో
వెండియుం బ్రీతితో నీయన పలికినాఁడు,—ఇట్లు చెప్పను,

పూర్వము కేసటుఁ డనువాఁడు భార్యను రూపవతి యనుదానిం
గోలుపోయి మరలం గలయు నుపాయము లేక యుండియు
గలసెను. ఆకథను వినుము..

పూర్వము పాటలీపురమందు ధనవంతుఁ డగు నొక
బ్రాహ్మణునికి కేసటుఁ డని కొమరుఁడు కామునిమీఱిన రూపు
వాఁడు యౌవనవంతుఁడు ఉండెను. ఆతఁడు తనకుం దగిన
భార్యను సంపాదించుకొనఁగోరి తల్లిదండ్రులతోఁ జెప్పక తీర్థ
సేవామిషమున నానా దేశములు భ్రమించుచుండెను. ఒకప్పుడు
నర్మదాతీరమునం బోవుచు నాతఁడు ఆవారిని పెండ్లికి తరలి
పోవుచున్నవారి గొప్పగుంపును గాంచెను. ఆగుంపులో ముసలి
బ్రాహ్మణుఁ డొకఁడు దూరమునుండి కేసటునిఁ గని చీలివచ్చి
పలుకరించి ఏకాంతమున ప్రణయపూర్వకముగా నిట్లు చెప్ప
కొనెను. 'అయ్యా, నీవలన నే నొక కార్యము వేఁడుచున్నాను.
అది నీకు లీలామాత్రము నాకుబూత్రము దానను మహోప
కారముపూర్ణమగును. చేసెదవేని చెప్పెదను.' కేసటుఁ డనియె;
'అయ్యా, నాకు శక్యమేని, తప్పక చేసెదను, నీకు ఉపకార
మగుఁగాక' అంతట ముసలి బ్రాహ్మణుఁడు 'పుత్త్రా, వినుము, నా
కుమారుఁ డొకఁ డున్నాఁడు, సురూపులలో నీవెట్లు అగ్రగణ్యుఁ
డవో అట్లు వాఁడు కురూపులలో అగ్రగణ్యుఁడు, నల్లనివాఁడు
నోటినిండ పండ్లు, చప్పిముక్కు, కాచరలోచనములు, పెద్ద
కడుపు, దొడ్డికాళ్లు, చేటచెవులు. అట్టి నాతనయునికై నేను

స్నేహవశంబున సుందరుఁ డని వర్ణించి రత్నదత్తుఁ డను బ్రాహ్మణుని కొమారితె నిమ్మని యడిగితిని. ఆపిల్ల రూపమున అద్వితీయ, దానికి రూపవతి యని పేరు సార్థకము, ఈ యిరువురకును ఈదినమే వివాహముహూర్తము. ఇందునిమిత్తమై మేముతరలి వచ్చినారము. నాకుమారుని గన్నచో వియ్యంకుఁడు పిల్ల నియ్యఁడు, మాయీ ప్రయత్నము వృథా యగును. ఇందులకు నే నుపాయ మరయుచుండఁగా నీవు దొరకినాఁడవు. కావున నీవు నోట నొప్పుకొన్న నావాంఛితమును శీఘ్రముగా నెఱవేలుపుము; మాతోఁ గూడ వచ్చి ఆపిల్లను పెండ్లి చేసికొని, నా కొమరుని కిచ్చివేయుము. ఆకన్యకు రూపమున నీవు తగినవాఁడవు.' అని ప్రార్థించెను. కేసటుఁ డంగీకరించెను.

అంత నాతనిం దోడ్కొని పడవ లెక్కి నర్మదను దాఁటి వృద్ధబ్రాహ్మణుఁడు పయనము నడచెను. ఒకయూరిం దటిసి యాతఁడు అనుచరులతోఁ గూడ వెలుపలనే విడిసెను. అప్పుడే మింటితెరువరి సూర్యుఁడును అస్తపర్వతమున విడిసెను. అనంతరము చీఁకటి పర్వఁగా కేసటుఁడు నీరుద్రాగుటకు నీళ్ళ కడకుం బోయెను. అంత నట ఘోరరూపుఁడు రాక్షసుఁ డొకఁడు లేచి 'కేసటుఁడా, తప్పించుకొని యెటకుం బోయె దవు, నిన్ను భక్షించెదను.' అని పల్కెను. నన్ను భక్షింపకుము, నేను బ్రాహ్మణునికి ప్రతిజ్ఞ చేసిన కార్యమును నెఱవేర్చి తప్పకుండ నీకడకు వచ్చెదను.' అని కేసటుఁడు విన్నవించెను.

రాక్షసుఁ డంగీకరించి కేసటుని శపథము చేయించి వదలెను
అతఁడును పెండ్లికొడుకువారిగుంపుం గలసికొనెను

అంతట ముసలిబ్రాహ్మణుఁడు కేసటుని వస్త్రాభరణాంగరాగంబులతోఁ బెండ్లికొడుకుం జేసి తోడ్కొని ఆనగరము ప్రవేశించెను. అచట నానావాద్యములు మ్రోఁగించుచు కేసటుని రత్నదత్తునియింటికి కొనిపోయి పెండ్లియరఁగుపై కూర్చుండఁబెట్టెను. కేసటుఁడు తండ్రిచే మహాధనసమేతముగా నీయఁబడిన వరాననను రూపవతిని యథావిధిగా పెఁడ్లి యాడెను. కిందొరులకుం దుల్యు లయిన యావధూవరులం గాంచి స్త్రీలెల్ల కరము ఆనందించిరి. రూపవతియు తనకు లభించిన యావరుని అంతసుందరుని వీక్షించి సంతోషించెను. ఆమె చెలులును ఆతనింగాంచి మారవికార మొందినవారైరి. అది యెల్లం గాంచి కేసటుఁడు, వగలోను వంతలోను మునింగి యుండెను. ప్రియుఁడాతఁడు రాత్రి పాన్పున చింతాకులుఁడై పెడమొగంబు వెట్టి యుంటం గని రూపవతి తాను అసత్యనిద్ర నభినయించి యుండెను. అర్ధరాత్రంబున నాతఁడు ఆమె నిద్రించిన దని తలంచి వెలువడి తనసత్యముం గాచుటకై రాక్షసునికడకుం బోయెను. పతివ్రతారత్నము రూపవతియు ఆవింత యేమో కనంగోరి ఆతనికిం దెలియనీకయే తానును వెంబడి నేఁగెను. కేసటుఁడు రాఁగాంచి రక్కసుఁడు బళిబళీ, కేసటా, నీవు మహాసత్త్వుఁడ వయ్యావు, నీసత్యము పాలించితివి. నీయూరిని పాటలీ

పుత్త్రమును, నీతండ్రిని దేసటుని, నీవు పవిత్రత నొందించితివి. కావున రా రమ్ము నిన్ను భక్షించెదను' అని హెచ్చరించెను. ఆమాట విని తత్క్షణము సమీపించి రూపవతి 'రక్కసుఁడా, నన్ను భక్షింపుము, ఇతనిని నాపతిని భక్షింతువేని నాగతి యేమి కాను!' అని యడ్డపడెను. 'నీగతి భిక్షాటనము.' అని రక్కసుఁడు పలికెను. 'మహాసత్త్వుఁడా, స్త్రీకి నాకు ఎవరు భిక్ష యిత్తురు!' అని రూపవతి యడిగెను. నీ వడుగుదువేని నీకు భిక్ష ఎవఁ డీయఁడో వానితల నూఱువ్రయ్యలుగా నెగిరి పోవును.' అని రాక్షసుఁడు పలికెను. 'అటయిన నీవే నా కిపుడు భర్తృభిక్ష నొసంగుము.' అని యామె యాచించెను. ఇయ్యకొ రాక్షసుఁడు తల పగిలి కాలధర్మము నొందెను అంతట రూపవతి తనచర్యకు ఆశ్చర్యపడుచున్న కేసటుం దోడ్కొని యింటి కేఁగెను. అంతలో రాత్రియు తుదముట్టెను.

మఱునాఁడు త్వరగా భోజనము గావించి ఆ పెండ్లి వారు వధూవరులం దోడ్కొని తరలి నర్మదాతీరమునకుం బోయిరి అట నావృద్ధవిప్రుఁడు పెండ్లికొమార్తెను రూపవతిని అనుచరసమేతముగా ఓడ యెక్కించి తాను ముఖ్యులతోఁ గూడ వేఱొకనావ యెక్కెను. ఓడవాండ్రను వశపఱుచుకొని ద్రోహచిత్తుఁడు ముసలిబ్రాహ్మణుఁడు కేసటుని ఆభరణాదిక ములు కైకొని వేఱొకనావ నెక్కించెను. అట్లు వృద్ధబ్రాహ్మణుఁడు వధువుతోను పెండ్లివారితోను ఏఱుదాఁటి పోయెను.

నావికులు ముసలి బ్రాహ్మణునివలన ధనము పుచ్చుకొన్నవారు, కేసటుని నడియేట కడుదవ్వు కొనిపోయి అచట మహాప్రవాహంబున ఓడను ఆతనిని విడిచివైచి ఏటిని అడ్డు ఈఁది తమ తావునకుం బోయిరి. ఏటిప్రవాహము తరంగలెగయుచు కేసటుని నావతోఁ గూడం గొనిపోయి వాయువశంబున సముద్రముకొద్దున వైచెను. అట ఆయుశ్శేష ముండుటం జేసి కేసటుఁడు ఊటడిల్లి యిట్లు తలపోసెను. 'అహో ఆ బ్రాహ్మణుఁడు నాకుం జేసిన ప్రత్యుపకారము ఇది! ఆతఁడు నిరర్థమూర్ఖుఁ డని ఆతనివృత్తమే నాకుం జెప్పలేదా, తనకుమారుని భార్యను ఒరునిచే పెండ్లియాడించి తనకుమారునితోఁ గూర్చువాఁడుగదా ఆతఁడు!' ఇట్లుతలపోయుచు బెగ్గడిల్లి యాతఁ డట నున్నంతలో యోగినీచక్రములసంచారముతోఁగూడ రాత్రి వచ్చెను. ఆరేయి నాతఁడు నాలవజామున నిద్ర తెలిసి మింట కోలాహలము విని చూడఁగా నొకపురుషుఁడు సుందరాకారుఁడు మింటనుండి జాఱి యతనియెదుటం బడియెను. పడిన యాతఁడు ప్రకృతిం బొందినతర్వాత కేసటుఁ డాతనిని నీవెవరయ్యా యని యడిగెను. 'నీవెవరవో ముందు నాకుం జెప్పుము అనంతరము, నే నెవరనో నీకుం జెప్పెద.' అని నవీనుఁడు పల్కెను. అంతట కేసటుఁ డాతనికి తనవృత్తాంతమును వర్ణించెను. అంత నాపురుషుఁడు 'అటులేని, నీవు నాకు సమానావస్థుఁడవు,

కావున నావృత్తాంతమును చెప్పెదను, మిత్రమా, వినుము.'
అని యిట్లు వక్కాణించెను.

వేణానదీతీరమున రత్నపుర మను నగరము కలదు. అచటి వాఁడను నేను, ధనికపుత్త్రుఁడను, బ్రాహ్మణుఁడను, గృహస్థుఁడను, నా పేరు కందర్పుఁడు. నేను ఒక రాత్రి నీళ్లకై వేణలో అడుగుపెట్టి జాఱి వడిలోఁ బడి ఆ రాత్రి యెల్ల కడుదవ్వు కొట్టుకొనిపోయి తెల్లవాఱగానే ఆయుశ్శేషవశంబున నీటిదరిని చెట్ల గుబురులో నిలుకుకొంటిని. కొమ్మలు పట్టుకొని గట్టుఎక్కి ఊఱడిల్లి ఆసమీపమున మాతృదేవతల గొప్పదేవళంబుం గాంచి పోయి అందుం జొచ్చితిని. అందులోపల స్ఫురించుచున్న మాతృదేవతలం గాంచి నేను భయము తీఱి నమస్కరించి స్తుతించి యిట్లు విన్నవించితిని. 'ఓదేవతలారా, ఈదీనుని మీరు రక్షింపుఁడు, నే నిపుడు మిమ్ము శరణుఁజొచ్చినాఁడను.' ఇట్లు వేఁడుకొని నదీవేగంపుదెబ్బకుం గలిగిన యలసతచే మెలమెల్లన విశ్రమించితిని. ఆసమయముననే పగలును తుదముట్టెను. అంత నక్షత్రంపుటస్థిమాలలు వైచికొని, వెన్నెలభూతి దాల్చి, తెల్లని నెలపునుకం గేలఁ బూని, రౌద్రి రాత్రి తాపసి ఏఁగుదెంచెను. అంతట ఆమాతృదేవతాగణమధ్యంబునుండి యోగినీసమూహము వెలువడి ఒండొరులతో నిట్లు పల్కెను. ఇపుడు మనము చక్రమేళసార్థము చక్రపురమునకుం బోవలయును. ఘాతుకజంతువులు నిండినయిచ్చోట ఈబ్రాహ్మణునికి రక్షణ యెట్లు! కావున

ఇతనిం గొనిపోయి ఇతనికి మేలుకలుగునట్టియొకచోట నుంపు దము, మరల మనము వచ్చునప్పుడు ఇతనిం దెత్తము, ఇతఁడు మనలను శరణుఁజొచ్చినాఁడుగదా.' ఇట్లు కూడఁ బలికికొని యోగినులు నన్నుం గొనిపోయి అలంకరించి ఒక యూర నొక ధనికబ్రాహ్మణునియింట నుంచి యెటకో పోయిరి. అట నేను పరికింపఁగాఁ గన్యావివాహమునకై పెండ్లియరఁగు సిద్ధమై యుండెను, లగ్నమాసన్నమాయెను, పెండ్లికొడుకువారుమాత్రము రాలేదు. అంత నచట దివ్యరుయినవరవేషముతోనున్న నన్నుం గాంచి 'వీఁడుగో పెండ్లికుమారుఁడు వచ్చినాఁడు.' అని అచటివారెల్లం బల్కిరి. అంతట నన్ను వేదికిం గొనిపోయి కన్యను అలంకృతం దోడితెచ్చి గృహస్థుఁడు బ్రాహ్మణుఁడు ఆకన్యను నాకు యథావిధిగా నొసంగెను. 'ఏమి పుణ్యము! మన సుమనకు తగినవరుఁడు దొరకినాఁడు, దాని సౌందర్యము సఫలమైనది.' అని స్త్రీలు ఒండొరులతో ననుకొనిరి. అట్లచ్చట వివాహమై ఆసుమునతోఁ గూడ మహోపచారంబులచే సుఖకుండనై మేడయందు నేను నిద్రించితిని. అనంతరము నాలవజాము న యోగినులు చక్రమేళకమునుండి వచ్చి తమయుక్తిచేత నన్ను ఎత్తుకొని మింటి కెగసిరి. మింటివారిని వారు పోవుచుండఁగా మఱియొక యోగినీబృందము తారసిల్లి నన్ను హరింపఁ జొచ్చెను. అంత నారెండుగుములకును నానిమిత్తమై పెనుఁ బోరు వాటిల్లెను ఆయల్లకల్లోలమున నేను తొలియోగినుల

చేతినుండి జాఱి యిటం గూలితిని. నాసుమునను ఎక్కడ పెండ్లి
యైతినో ఆనగరము నెఱుంగను. ఇంక నాగతి యిపు డేమి
కానున్నదో ఎఱుంగను. ఇత్తెఱంగున నాకు విధి యిడినదుఃఖ
పరంపర యిపుడు నీసమాగంబునం జేసి సుఖపర్యవసాయి యే
యయినది.

ఇట్లు పలికినకందర్పుని కేసటుఁడు 'మిత్త్రా, భయపడకు,
ఇఁక యోగినులు నిన్నేమియుం జేయఁజాలరు. నాకడ నట్టి
యప్రతిహతశక్తి యున్నది. మన మిరువురముం గలసి తిరుగు
చుందము, విధి మనకు మేలు సేయును.' అని యూఱడించెను.
ఇట్లు వా రొండొరులతో పల్కుకొనుచుండఁగా రాత్రి తుద
ముట్టెను. తెల్లవాఱఁగానే వారు సముద్రమును దాఁటి తరలి
రత్ననది చెంత భీమపురమునకుం బోయిరి. అట వా రానదీతీర
మున అలబలము విని పోయి రెండుగట్లనడుమ నిఱుకుకొని
యున్న మహామత్స్యముం గాంచిరి. అది పోటులో వచ్చి యొడలి
పెంపునం జేసి పాటులో నిఱికికొనినది. దాని నానాయుధము
లతో జనులు మాంసార్థము చీల్చుచుండిరి. అట్లు పాటితమైన
దానికడుపునుండి యొకయంగన వెలువడినది. ఆమెను ఎల్లవారు
వింతపడి చూచుచుండఁగా నామె భయంబున ఒడ్డునం జేరినది.
ఆమెం గాంచి కందర్పుఁడు పరమానందభరితుఁడై కేసటు
నితో 'మిత్త్రమా, ఇదె నేను పెండ్లియాడిన యాసుమన, ఈసుం
దరికి ఈచేఁపకడుపు కాఁపుర మెట్లు కలిగెనో నే నెఱుంగను. విష

యము బయలుపడువఱకు ఇటనే యూరక యుందము.' అని వచించెను. కేసటుఁడును అందులకు వల్లె యన, నిరువురు నట్లే యుండ, అచటిజను లామెను, 'ఎవరవు నీవు? ఇ దేమి?' అని యడిగిరి ఆమె యెట్టకేలకు ఇట్టు లనియె. 'నేను రత్నాకరపురమున జయదత్తుఁ డను బ్రాహ్మణోత్తముని తనయను, నాపేరు సుమన, రాత్రి నన్నొకభవ్యమూర్తి బ్రాహ్మణకుమారుఁడు అనురూపుఁడు పెండ్లియాడినాఁడు. ఆరాత్రియే నే నిద్రితనై యుండఁగా నాపతి యతఁ డెటకో పోయెను. మానాయనయెంత వెదకించినను ఆయన ఎటను దొరకఁడాయెను. అంత నేను తద్విరహాగ్నిశాంతికై ఈచేటం బడితిని, ఈమీను నన్ను మ్రింగినది, విధివశంబున నిట నున్నాను.' ఇట్లామె పలుకఁగా విని జనసంఘమునుండి యజ్ఞస్వామి యను బ్రాహ్మణుఁడు ముందఱికి వచ్చి ఆమెను కవుంగిలించుకొని 'రమ్ము, నాఁట్టీ, నీవు నామేనకోడలవు మీయమ్మకు యజ్ఞస్వామి యని తోఁబుట్టువు కలఁడు.' అనెను. ఆమాట విని సుమన మోమెత్తి అతనిం గాంచి మామ యని యెలుంగి కన్నీళ్లు గురియుచు పాదముల వ్రాలెను. క్షణములో ఏడ్పు మాని 'మామా, నాకు సొద పేర్పుము, అన్యపుత్త్రుం బాసిన నాకు వేఱు గతి లేదు' అని వేఁడుకొనెను, వలదని యెంత చెప్పినను వినదాయెను. ఆమె చిత్తము నట్లు పరీక్షించి నిశ్చయ మెఱింగినవాఁడై కందర్పుఁడు ఆమె యెదుటికి వచ్చెను. అతనిం గాంచి యాధీమతి సుమన ఆనవాలుపట్టి అడుగులం

ద్రెళ్లి యేడ్వం దొడంగెను. లోకులును మామయు అడుగఁగా, అతఁడే తన భర్త యని మనస్విని యుత్తర మిచ్చెను. అంత నెల్లవారును సంతసం బంది యజ్ఞస్వామి యామెను ఆమెపతిని కందర్పుని తన్మిత్త్రుని కేసటుని ముగ్గురను తనయింటికిం గొని పోయెను. అట నాముగ్గురును తమతమ వృత్తాంతములం జెప్పఁగా విని యజ్ఞస్వామి వారిని ప్రీతితో చక్కఁగా నుపచరించెను. కొన్ని దినములు గడచినయనంతరము కేసటుఁడు కందర్పునితో 'వయస్యా, నీ ప్రియభార్య నీకు దొరకినందున నీవు కృతార్థుఁడ వైతివి. కాన నిపుడు నీవు భార్యతోఁగూడ నీరత్నపురమునకుం బొమ్ము. నేను అకృతార్థుఁడను, కాన నాస్వదేశమునకు మరలను, తీర్థయాత్రలే సేయుచు ఈ దేహమును ఉడిగించెద.' అని వచించెను. ఆమాటకు చెంత నున్న యజ్ఞస్వామి ఇట్లనియె.

దిగులుగొని యేల యిట్లు పలికెదవు ? జీవించియున్న సర్వమును పొందవచ్చును. ఇందులకు నిదర్శనముగా కుసుమాయుధుని వృత్తాంతము చెప్పెదను వినుము. చండపుర మను నగరమున దేవస్వామి యని బ్రాహ్మణుఁ డుండెను. ఆయనకు కమలలోచన యనుపేర సాటిలేనిరూపవతి యొకకూఁతురును, కుసుమాయుధుఁ డను పేరి శిష్యుఁడు బ్రాహ్మణకుమారుఁడు ఒకఁడును ఉండిరి. ఆశిష్యుఁడును ఆకన్యయు అన్యోన్యానురక్తులైరి. ఒకనాఁడు తండ్రి యాకన్యను మఱియొకవరుని కీయ

నిశ్చయము చేసికొనఁగా, ఆమె సఖీముఖంబున వెంటనే యాతనికి 'మాయాయన నన్ను మఱియొకని కీయ నంగీకరించినాఁడు, నీవు నాకు పూర్వసంకల్పితభర్తవు కావున నీవు నన్ను ఇంట నుండి యుక్తిగా హరింపుము.' అని వార్త పంపెను. అట్లే కుసుమాయుధుఁడు ఆమెను హరించికొనిపోవుటకై సంకేత మేర్పరించి యట నొక వడితత్తడిని సేవకుని ఉంచెను ఆమె తనయిచ్ఛప్రకారము వచ్చి ఆగుఱ్ఱము నెక్కెను. భృత్యుఁ డామెను కుసుమాయుధునికడకుం గొనిపోక తాను హరించుటకై మఱి యెటకో కొనిపోయెను. ఆరాత్రియే కడుదూరము హరింపఁబడి కమలలోచన వేకువ నొకనగరముం దఱిసి భృత్యుని 'నీదొర నాభర్త యేఁడి? న న్నాతనికడకుం గొనిపోవేమి?' అని యడిగెను. అందుల కాశఠుఁడు విదేశగతను ఏకాకిని నామెను 'నిన్ను నేను పెండ్లి చేసికొనియెదను, ఆతనితో నీ కేమి పని? ఆతఁ డిఁక నెక్కడ?' అనియెను అంత నా ప్రజ్ఞావంతురాలు 'నీవు నాకు అత్యంతము ప్రియుఁడవు నీ వేల యిపుడే వివాహోపకరణములు దెచ్చి నన్నుం బెండ్లి యాడవు?' అని పల్కెను. అందుల కాదుర్మతి యామెను ఊరి యుద్యానవనంబున నుంచి పెండ్లిసంభారములు తెచ్చుటకు బాజారునకుం బోయెను. ఇంతలో నాకన్య ఆతట్టువుపై పలాయితయై ఒకముసలిమాలాకారునియిల్లు సొచ్చి యాతనికి తనవృత్తాంతమును దెల్పుకొనెను. ఆతఁ డామెను సత్కరిం

చెను. ఇంతలో ఆదుష్టభృత్యుఁడు వచ్చి యామె నుద్యాన మునం గానక విముఖుఁడై పోయి, తనదొరను కుసుమా యుధునిం గని యాతఁ డడుగఁగా 'అయ్యా, నీవు కవు డెఱుం గనివాఁడవు, కుటిల స్త్రీలచేఁతలను నీవు కనలే వయితివి. ఆమె తరలి రానే లేదు, నన్ను జనులు గాంచిరి, కొందఱు నన్ను పట్టుకొని గుత్తమును హరించిరి, నేను ఎట్లో దైవవశంబున తప్పించుకొని పలాయితుండ నై యిట కేతెంచితిని.' అని వచించెను. అట్లే యుండును గావలయు నని తలంచి కుసుమా యుధుఁ డూఱకుండెను ఒకప్పుడు కుసుమాయుధుఁడు తండ్రి పంపున పెండిలి కేఁగుచు దారిలో ఆకమలలోచన యున్న పట్టణమునకు వచ్చెను. అట ఆయుద్యానమందే పెండ్లి వా రందఱతోను విడిసి యొంటిం జరించుచున్న కుసుమాయుధుని కమలలోచన కాంచి పోయి తాను ఎవనియింట నుండునో ఆ మాలాకారునితో చెప్పినది. ఆతఁడు వచ్చి కాంచి వృత్తాం తమును దెలిపి కుసుమాయుధుని తనయింటికిం దోడ్కొని పోయెను. ఆముసలిమాలాకారుఁడే వివాహోపకరణములం దేఁగా ఆవధూవరులకు చిరకాంక్షితమైన వివాహము అక్షణమే నెఱవేఱెను అంతం గుసుమాయుధుఁడు ఆదుష్టభృత్యుని దండించి, తనకు వివాహమైనను ఏకన్యను వివాహమాడుటకై తాను తరలి వచ్చినాఁడో కమలలోచనాప్రాప్తికారణ మయిన యా రెండవకన్యనుం గూడ వివాహమై ఇద్దఱు పెండ్లికొమారి

తలతోను సంతోషంబున తనదేశమునకుం బోయెను. ఇట్లే అంగున శుభాత్ములకు ఊహ కందని దైనను సమాగమము కలుగును. అట్లే కేసటుఁడా, నీవును నీప్రియను త్వరలోనే పొందుదువు.

ఇట్లు యజ్ఞస్వామి పలుకఁగా అతనియింటనే కందర్ప సుమనఃకేసటులు కొంతకాల ముండిరి. అనంతరము వారు స్వదేశమునకుం దరలి ఒక కాఱడవింజొచ్చి అందు అడవియేనుఁగు పైకొనఁగా ఆగందరగోళములో ఒండొరుల నెడఁబాసి చెదరి పోయిరి. వారిలో కేసటుఁడు దుఃఖితుఁడై ఒంటరిగా పోవుచు క్రమక్రముముగా కాశి చేరి అట కందర్పుంగలసెను. అంత నత నిం దోడ్కొని కేసటుఁడు తనకావునకు పాటలీపురమునకుం బోయెను. ఇతనిరాకకు తల్లిదండ్రులు కరము సంతోషించిరి. అట మిత్రు లిరువురును కొంతకాల ముండిరి. కేసటుఁడు తల్లిదండ్రులకు కందర్పునివృత్తాంతమువలెను తనరూపవతీ వివాహవృత్తాంతమును వర్ణించెను.

ఈలోపల సుమన ఏనుఁగునకు వెఱచి పలాయితయై అడవిలో లోఁతునకుం బోయెను. అంత నామెకు సూర్యాస్తమయ మాయెను. 'హా! హా! ఆర్యపుత్రా, అయ్యో నాయనా, అయ్యో అమ్మా,' అని చీఁకటి పడినకొలఁదియు ఆమె యేడ్చుచు నొకచో దావాగ్ని గని అందు పడం గడంగెను. ఇంతలో కంధర్పుని నభిమానించిన యాయోగినులు ఆరెండవ

యోగినీచక్రమును జయించి తమకాపురకు దేవళమునకుంబోయి అట తమజ్ఞానప్రభావంబున కందర్పునివృత్తాంతంబును ఆతని భార్య అడవిలో చెదరి యేకాకిని యై యుండుటయు నెఱింగి యిట్లు ఆలోచించుకొనిరి, 'కందర్పుండు మగవాఁడు, ధీరుఁడు, కావున ఎటులేనియు తనమనోరథమును సాధించుకొనును. ఆతనిభార్య అడవిలో నొంటరి యైనది. నిక్కముగా బెగ్గడిల్లి ప్రాణములం గోలుపోవును. కావున నామెను గొనిపోయి రత్నపురంబున కందర్పుని తండ్రికడ వదలుదము. అచట నామె తన సవతితోఁగూడ నుండును' ఇట్లాలోచించుకొని ఆయోగినులు ఆకాన కేఁగి సుముఖంగొనిపోయి రత్నపురంబున వదలిరి. రాత్రి వేగఁగానే సుమన ఆపురంబునం గ్రుమ్మరుచున్నదై జనులు పరువుపరువునం బోవుచు 'అదె కందర్పుఁ డను బ్రాహ్మణుని భార్య పతివ్రత యనంగవతి, పతి మొటకో పోఁగా, వచ్చు నను నాశచేత కొంతకాలము నిరీక్షించినదై, అతఁడు రానందున ఆశయెడలి అగ్నిప్రవేశము సేయునదియై వచ్చియున్నది. అత్తయు మామయు దుఃఖితులు కూడ వచ్చి యున్నారు.' అని చెప్పుకొనుచు నుండఁగా విన్నదై తానును ఆసాదకడకుఁ జని అనంగవతిని 'ఆర్యా, సాహసముసేయకు, నీపతి బ్రతికియున్నాఁడు.' అని నివారించి ఆతనివృత్తాంతమును ఆమూలముగా చెప్పెను. కందర్పుఁడు తన కిచ్చినయుంగరమును చూపెను. అంత నందఱును ఆమెమాట సత్యమని యంగీకరించి సంతో

షించిరి. అంతట కందర్పునితండ్రి సంతుష్టురాలి ననంగవతిని ఆసుమనను ఇద్దఱను సత్కరించి సంతసంబున నింటికిం గొనిపోయెను. ఇంతలో కందర్పుఁడు సుమనను వెదకుటకై దేశములు భ్రమ్మరువాఁడై వలదని వారించుచున్న కేసటునితోఁ జెప్పకయే వెలువడెను. అతఁడు పోయినయనంతరము కేసటుడును రూపవతి లేమిచే దుఃఖితుఁడై తల్లిదండ్రులకెఱిఁగింపకయే యిలు వెడలి ఆమెను వెదకుచు దేశములు భ్రమ్మరుచుండెను కందర్పుఁడు దేశములు తిరుగుచు దైవవశంబున రూపవతిని కేసటుఁడు పెండ్లియాడిన యానగరమునకు వచ్చెను. అచట జనుల కోలాహలమును విని ఒకని నడిగెను. వాఁడు 'అయ్యా, రూపవతి భర్తను కేసటుని గానమిచే దుఃఖితురాలై ప్రాణత్యాగమునకు సమకట్టినది. అందుల కలకల మిది; ఆవృత్తాంతమును వినుము.' అని రూపవతికి సంబంధించినంతవఱకు కేసటోద్వాహమును రాక్షసభంగమును వర్ణించి వెండియు నిట్లనియె.

అయ్యా అనంతరము కేసటుని వంచించి ముసలి బ్రాహ్మణుఁడు రూపవతిని తనకొడుకునకై హరించి పయనమాయెను ఆమెను పెండ్లియాడిన కేసటుఁ డేమాయెనో తెలియరాదు. దారిలో కేసటుని గానక రూపవతి వృద్ధబ్రాహ్మణుని 'ఏమి యిది! యెల్లవారును నడచుచున్నారు, ఆర్యపుత్త్రుఁడు మాత్ర మగపడఁ డేమి?' అని యడిగెను. అందుల కాతఁడు

తనకుమారునిం గానిపించి 'పుత్త్రీ, వీఁడుగో నాకుమారుఁడు నీభర్త, చూచుకొమ్ము. అనెను. అంతట రూపవతి కోపంబు దీపింప నచటి వృద్ధులను 'ఈకురూపుఁ డెట్లు నాభర్త? నన్ను నిన్న పెండ్లియాడిన నాపతిం గాననేని నిక్కముగా ప్రాణము లు వీడెద.' అని పలికి అన్నపానములు మానివేసెను. అంత వృద్ధవిప్రుఁడు రాజభయంబునం జేసి ఆమెను కొనిపోయి పుట్టి నింటికే తండ్రికడకు పంపినాఁడు. అచట నామె వృద్ధవిప్రుని మాయాప్రయోగమును తెలుపఁగా తండ్రి ఖేదపడి 'అమ్మా, నిన్ను పెండ్లియాడినవాఁడు ఎవఁడో ఎట్లు ఎఱుంగ నగును?' అని యడిగెను. 'నాయనా, నాపతి పాటలీపురమువాఁడు, దేసటుఁడను బ్రాహ్మణుని కుమారుఁడు, తనపేరు కేసటుఁడు. ఇట్లని నేను రాక్షసుని మాటవలన నెఱింగితిని.' అని పల్కి యామె తనపతికిని రాక్షసునికిని జరిగినవృత్తాంతమును సంపూ ర్ణముగా వర్ణించెను. అంత నామెతండ్రి పోయి చచ్చిపడియు న్నరక్కసుని గాంచి వచ్చి నమ్మకమై ఆదంపతుల సత్త్వమునకు సంతోషించెను. పతి మరల దొరకు నని ఆశ చెప్పి కొమారి తను ఓదార్చి తండ్రి కేసటుని తండ్రికడకు పాటలీపుత్త్రమునకు వెదక మనుష్యులను బంపెను. వారు పోయి చిరకాలమునకు వచ్చి యి ట్లనిరి "మేము పోయి పాటలీపురంబున దేసటునిం గంటిమి. నీకుమారుఁడు కేసటుఁ డేఁడి అని యడిగితిమి. అంత దేసటుఁడు ఏడ్చుచు, 'అయ్యా, నాకుమారుఁడు కేసటుఁ

డిక్కడ లేఁడు, వాఁడు వచ్చి తనతోఁగూడ వచ్చిన కందర్పుఁడను చెలికాఁడు వెడలిపోఁగా తాను రూపవతీవిరహ కారణంబున మాతోఁ జెప్పకయే పోయినాఁడు.' అని యుత్తర మిచ్చెను విని మేము మరలి యిట కేతెంచితిమి." ఇట్లు వెదకఁబోయినవారు వచ్చి తెల్పఁగా రూపవతి తండ్రితో నాయనా, ఆర్యపుత్త్రుఁడు రాఁడు దొరకఁడు, కావున నేను అగ్నిప్రవేశము చేసెదను. భర్తను బాసి, నాయనా, నేను ఎంతకాలముందును!' అని వాక్రుచ్చెను. ఆమె నిశ్చయమును మార్పను తండ్రి వలనం గాకపోయెను. ఆమె యిపుడు వెడలి వచ్చి అగ్నినుఱుక జతనపడి యున్నది. ఈమె చెలికత్తెలిరువురు తామును అగ్నిప్రవేశము సేయ వచ్చియున్నారు. ఒకతెపేరు శృంగారవతి, రెండవది అనురాగవతి. పూర్వము రూపవతీ వివాహంబున ఈ యిరువురును కేసటునిసొబగుం గాంచి కాముబారింబడి కేసటుని తమకుం బతినిగా సంకల్పించుకొనియుండిరిగదా. ఇందుల కయ్యా యీజనకోలాహలము.—

ఇట్లు ఆపురుషుఁడు తెలుపఁగా కందర్పుఁడు వారిసొదల కడకుం బరువునం బోయి దూరమునుండియే కలకలమును నివారించి వడివడిం దరిసినవాఁడై అట నగ్ని నర్చించుచున్న రూపవతితో 'అమ్మా, ఏల సాహసము చేసెదవు? నీపతి కేసటుఁడు బ్రతికియున్నాఁడు, ఆతఁడు నామిత్త్రుఁడు, నాపేరు కందర్పుఁడు.' అని వచించి ముసలిబ్రాహ్మణుఁడు మాయచేసి

ఓడలలో నెక్కించి కొనిపోవుట మొదలుగా కేసటవృత్తాంత మెల్లను వర్ణించెను. దాన నమ్మకము కుదిరి రూపవతి తానును ఆచెలులును సంతోషించి తండ్రియింటికిం బోయెను. కందర్పుండును రూపవతీజనకుని వేఁడికొలుచు సురక్షితుండై సూపచరితుండై యాతని యింట నిలిచెను. ఇంతలో కేసటుఁడు దేశములు భ్రమ్మరుచు రత్నపురము చేరెను. అటఁగదా కందార్పుని యింట దద్భార్యలిరువురు నున్నారు ఇతఁడు వీథి నేఁగుచుండగా మేడనుండి కందర్పభార్య సుమన చూచి హర్షంబున నత్తమామలలో 'ఆర్యపుత్రుని మిత్త్రుఁడు కేసటుఁడు వీఁడుగో వచ్చినాఁడు, ఈయనవలన నొకవేళ ఆర్యపుత్రునివార్త తెలియును, ఈయనను ఈక్షణమే పోయి తెచ్చి సత్కరింపుఁడు.' అని విన్నవించెను. అట్లే మామ లోనగువారు పోయి వృత్తాంత మావేదించి కేసటునిం దెచ్చిరి. కేసటుఁడును వచ్చి సుమనను గాంచి సంతోషించెను. విశ్రాంతుండై కేసటుఁడు వారడుగఁగా అడవి యేనుఁగు కలగుండు పెట్టుట మొదలుగా కందర్పునియు తనయు చరిత్రమును వక్కాణించెను. అట సత్కృతుండై యతఁడు కొలఁదిదినము లుండఁగా పురుషుఁ డొకఁడు కందర్పునివలననుండి జాబు కొనివచ్చెను. 'కందర్పుని చెలికాఁడు కేసటుఁ డను నాతఁడు ఎచట రూపవతి యను నామెను పెండ్లియాడెనో అచట నిపుడు కందర్పుఁ డున్నాఁడు, రూపవతియు నున్నది.' అని యాజాబు తెచ్చినవాఁడు చెప్పెను.

జాబులోఁ గూడ నట్లే యుండెను. అంతట కందర్పుని తండ్రికి కేసటుఁడు తన రూపవతీ వివాహవృత్తాంతమును వర్ణించెను. అంత నాతండ్రి పండువుచేసి మఱునాఁడు కందర్పునిం దోడి తెచ్చుటకు దూతను, ప్రియం గలసికొనుటకు కేసటుని పంపెను. కేసటుఁడును లేఖహారునితోఁగూడఁ దరలి తన భార్య రూపవతి తండ్రియింట నున్న తావునకుం బోయెను అట కేసటుఁడు సోత్సవను రూపవతిని సంతాప మెడలించు మేఘుఁడు చాతకాంగనంబోలె సంభావించెను. చెలికానిం గందర్పునిం గలసికొని కరము హర్షించెను. రూపవతి ప్రేరేపింపఁగా కేసటుఁడు ఆపూర్వోక్తకన్యలను ఆమెచెలికత్తెల నిరువురను వివాహమాడెను. అనంతరము రూపవతిని, ఆయనురాగవతీ శృంగారవతులను తోడ్కొని కందర్పు నామంత్రించి కేసటుఁడు తన దేశమునకుం బోయెను. కందర్పుండును దూతతోఁగూడ రత్నపురంబునకుం బోయి సుమనోనంగవతులను బంధువులను కలసికొనెను. ఇట్లు తమకాంతలను రూపవతీసుమనలను బొంది తమతమ దేశములకుం బోయి కేసటకందర్పులు భోగములను భవించుచు సుఖముండిరి.

ఇవ్విధమున విరోధి యగువిధి యెడఁబాపిన ధీరసత్త్వులు మరల ప్రియులతో సమాగమ మొంది అవధి తెలియని విషమదుఃఖములను దాఁటి సేమ మొందుదురు. కావున చెలికాఁడా, త్వరగా లేలెమ్ము, పోయి వెదకుదము, నీభార్యయు

నొకవేళ నీకు దొరకును, దైవగతి యెవని కెఱుక ! నేనే మృతిఁజెందినభార్యను మరల సజీవనుగాఁ బొందితిని.—ఇట్లీ మిత్త్రుఁడు ఈకథ చెప్పి నన్ను, ప్రోత్సాహపెట్టి నాతోఁగూడ రాఁగా, నేను తిరుగుచు ఈచోటికి వచ్చి యిట క్రోడగజేంద్రములం గాంచితిని. అందు గజేంద్రము నాప్రియను, అదేమి వింతయో, వెలిఁ గ్రక్కి వెండియు మ్రింగివేయం గాంచితిని. అది మొదలు, ఆయేనుంగును వెదకుచుంటిని, అది గనఁబడ లేదు, నాసుకృతవశంబున ఏలినవారిపాదము లగపడినవి.

ఇట్లావణిక్పుత్త్రుఁడు చెప్పుకొనఁగా విక్రమాదిత్యమహారాజు గజసంహారలబ్ధను ఆతనిభార్యను సుందరాంగిని తెప్పించి యాతని కిచ్చెను. ఈవిచిత్రసమాగమమునకు వా రిరువురు సంతోషాశ్చర్యంబులపాలై ఒకరివృత్తాంతము నొకరితో చెప్పుకొని శ్రీవిషమశీలసార్వభౌముకీర్తిస్తుతిముఖరితవదను లైరి.

---

## ౫౬-వ తరంగము.

అంతట విక్రమాదిత్యమహారాజు ఆవణిక్పుత్త్రునితోఁగూడ నున్నమిత్త్రుని బ్రాహ్మణుని 'ఆర్యా, నీవు మృతి నొందిన భార్యను మరల సజీవనుగాఁ బొందినట్లు వచించితివే, ఆకథ యెట్లో వివరముగాఁ జెప్పుము.' అని యడిగెను. ఆతఁడు కౌతుకమేని విను మని యిట్లు చెప్పఁదొడంగెను.—నేను బ్రహ్మస్థలమునునగ్రహారమువాఁడను, బ్రాహ్మణుఁడను, నాపేరు చంద్ర

స్వామి, నాకు ఇంత రూపవంతురాలు భార్య యున్నది ఒక ప్పుడు నేను మాతండ్రి పంపున పనిమీద గ్రామాంతరము పోయి యుండఁగా భిక్షార్థము కాపాలికుఁ డొకఁడువచ్చి నాభార్యం గాంచెను. వాఁడు గాంచినమాత్రాన నాప్రేయసి జ్వరము వచ్చి మృతి నొందెను. అంతట బంధువులు రాత్రి వేళ శ్మశా నమునకుం గొనిపోయి సొదయం దుంచి నిప్పంటించిరి. సొద ఇంక మండుచుండఁగానే గ్రామమునుండి నేను వచ్చితిని బంధు వులు ఏడ్చుచు జరిగినవృత్తాంతమును నాకుం దెల్పిరి. అంత నేను సొదకడకుం బోయితిని. ఆసమయంబున బుజముపై మంచపుంగోటిని నర్తింపించుచు, డమరుకవాద్యమును మ్రోగిం చుచు నటకు కాపాలికుఁడు వచ్చి సొదపై బూడిద రవంత చల్లెను. దాన రామంట చల్లాఱి అందునుండి అక్షతశరీర నాభార్య లేచెను కాపాలికుఁడు తనసిద్ధిప్రభావంబునం జేసి తనవెంట వచ్చుచున్న నాభార్యను దోడ్కొని త్వరత్వరగా నడచెను. నేనును వెంటనే పోవుచుంటిని. వాఁడు గంగయొడ్డున నొకగుహ కేఁగి అందు మంచపుంగోడు నేలనుంచి సంతోషం బున ఆలోనికన్యక లిరువురతో 'తెచ్చుకొనియు మిమ్ము ఎవతె లేనందున నేను కవయలేదో ఆసుందరి యిదె నాకు హస్త గత మైనది, నాప్రతిజ్ఞ యిప్పటికి నెఱవేఱినది.' అని పలికి నాభార్యను వారికిం గానిపించుచుండఁగా నేను వానిమంచపుం గోటిని గంగలోఁబాఱవైచితి, 'ఓరి కాపాలికుఁడా, నాభార్యను

హరింప నుద్యుక్తుండవు నీవు ఇంక నుండవు.' అని మంచపుం గోటిసిద్ధి గొనఁదలిన యా కాపాలికుని ఆక్షేపించితిని వాఁడును మంచపుంగోటిని వెనకి కానక శరుఁడు పలాయనపరాయణుఁ డాయెను. నేను వింట విసము పూసినకోలం గూర్చి యేసి వానిం బరిమార్చితిని. పాపసిద్ధిసంతోషమునకై శివాగమము నభినయించుపాషండులు మున్నే పతితు లయ్యెను వెండియు నిట్లు పడుదురు. అంతట నేను నాభార్యను ఆకడమకన్నియల నిరువురను తోడ్కొని ఇల్లుసేరితిని. బంధువులెల్ల నాశ్చర్య పడిరి. అచట నాకన్యలు నే నడుగ తమవృత్తాంతము నిట్లు పల్కిరి. 'ఆర్యా, మేము కాశీపురిలో రాజునకును సార్థవా హునికిని తనయలము. నీభార్యను హరించిన సిద్ధియుక్తిచేత నే ఈ కాపాలికుఁడు మమ్ము హరించినాఁడు. అదూషితలము మేము ఇపుడు నీప్రసాదంబున ఈపాపాత్ముని వలననుండి విడు దల నొందితిమి!' ఆవృత్తాంతము విని నేను అమఱునాఁడు వారిని కాశికిం గొనిపోయి బంధువుల కప్పగించి వృత్తాం తముం దెల్పితిని. అటనుండి మరలి వచ్చుచు దారిలో నితని భార్యావియోగిని వణిక్కుమారుని కలసి యిచటికి వచ్చితిని. కాపాలికునిగుహలో దొరకిన మైపూఁతవలన నా దేహమున ఎంతకడిగినను పోక యీసెత్తావి గమగమ వచ్చుచున్నది. ఈతీరున మృతిఁజెంది బ్రతికివచ్చిన నా కాంతను నేను మరల బొందితిని.—

ఇట్లు బ్రాహ్మణుఁడు చెప్పఁగా విని విక్రమాదిత్యమహా రాజు అతనిని ఆవణిక్కుమారుని ఇరువురను సత్కరించి పంపెను, అనంతరము విక్రమాదిత్యుఁడు గుణవతీచంద్రవతీమదన మంజరులను రప్పించి వారితోఁగూడ తనదండుం గలసికొని ఉజ్జయినీనగరమునకుం బోయెను, అచట గుణవతీచంద్రవతు లను వివాహమాయెను. విశ్వకర్మదేవాలయమందు తాను స్తంభమందుఁ గాంచినప్రతిమను స్మరించి ఆప్రతిమయెవతెదో ఆ కన్నియను బడయువాఁడై తెజ్జనకుఁ డగుకళింగసేనరాజుకడకు దూతను పంపుమని ప్రతీహారుని కానతివచ్చెను. ప్రతీహారుఁడు సువిగ్రహుఁ డనువేరిదూతను రాజుమోశ్రిలనేసు దేశము కఱపి పంపెను. దూతయు కళింగదేశమునకుం జని కళింగసేనుని సందర్శించి యథోచిత మిట్లు వక్కాణించెను:—"భూపాలా, నీకు శ్రీవిక్రమాదిత్యమహారా జిట్లు ఆనతిచ్చుచున్నాఁడు; 'నీ వెఱుఁగుదువుగదా, భూమిలో రత్న మేదో అది మమ్ముం జెందవలసినదని, నీకడ కన్యారత్న మున్నది. దానిని మాకు సమ ర్పింపుము, మాప్రసాదంబున నిష్కంటకముగా చిరకాలము రాజ్య మేలుకొమ్ము.' అని." అంత నా రా జిట్లు బదులు పల్కెను. 'ఎవ రీవిక్రమాదిత్యుఁడు మ మ్మి ట్లాజ్ఞాపింపను? మదాంధుఁడు మావలన కన్యను కానిక గోరుచున్నాఁడు, చెనును జామా వీఁడు?' అందులకు దూత వెండియు 'ఓయి కళింగ రాజా, నీవు సేవకుఁడ వయ్యును నీదొరవిషయంబున నిట్లు తీర

ములు పల్కుచున్నాము! ఓరి మూఢుఁడా, ఆతని ప్రతాపాగ్నికి
మిడుతవుగాఁ గోరెదవా ?' అని మాతాళి యటనుండి మరలి
వచ్చి విక్రమాదిత్యమహారాజునకు ఆవృత్తాంతమును నివేదిం
చెను. అంతట విషమశీలుఁడు ససైన్యుఁడై సభూతకేతుండునై
కాళింగునిమీఁదికి దాడివెడలెను. తదీయసేనానాదప్రతిధ్వాని
తంబులై దిక్కులు 'కన్యను తత్క్షణ మిచ్చివేయుము' అని కాళిం
గునికి చెప్పుచున్న ట్లుండెను. ఇట్లు విక్రమాదిత్యుఁడు కళిం
గంబుచేరి యుద్ధసన్నద్ధుని దుర్గస్థుని కళింగసేనుని ముట్టడించి తన
మనంబున 'ఇతనికొమారిత లేక నాకు సుఖము లేదు,
మామను ఈతని నెట్లు పరిమార్తును ! కాన నిందుల కేమేని
యుపాయము చేసెదఁగాక.' అని తలపోసి భేతాళుందోడ్కొని
ఆతనిసిద్ధిచే నలక్షితుఁడై రాత్రి కళింగసేనుఁడు నిద్రించు
చున్నపడుకటిల్లు సొచ్చెను. భేతాళుఁడు కళింగసేనుని నిద్ర లేపి
భీతు నాతని 'ఓరి, విషమశీలునితో పోరాటము పెట్టుకొని
నిద్రించెద వేమిరా ?' అని నవ్వుచు బొబ్బరించెను. కళింగ
రాజు లేచి యవ్విధమున సాహసము నెఱపినవానిని శ్రీ
విక్రమాదిత్యమహారాజును ఘోరభేతాళసంయుతుని గని ఆన
వాలుపట్టి 'ప్రభూ, ఇపుడు నేను నీకు వశ మయితిని, ఏమి
చేయవలయునో ఆజ్ఞ యిమ్ము.' అని భీతుఁడై పాదానతుఁడై
వేఁడుకొనెను. 'ప్రభువ నయిన నావలన నీకు సేమము వలయు
నేని నీకొమారితను కళింగసేనను నా కిమ్ము.' అని విక్ర

మాదిత్యుఁడు ఆనతిచ్చెను. కళింగరా జంగీకరించెను రాజు కృతార్థుఁడై వేతాళునితోఁగూడ తనశిబిరమున కేఁగెను. మఱునాఁడు, దేవీ, మీతాయన కళింగరాజు విషమశీలమహారాజునకు యథావిధిగా విభవోత్తరంబుగా నిన్ను సమర్పించెను! ఈవిధముగా గాఢానురాగముచే ప్రాణము నొగ్గి నిన్ను మహారాజు విధ్యుక్తముగా వివాహమాడెనే గాని శత్రుజిగీషచేతఁ గాదు.—ఇట్లని, ఓసకియలారా, తీర్థసేవి దేవసేనుఁడు చెప్పఁగా విని నేను వనట మానితిని. ఇట్లు, మహారాజు కంబంపుం బ్రతిమం గాంచి నన్ను వివాహమాయెను. ఈమలయవతిని చిత్తరువుం గని వివాహమాయెను. ఈప్రకారము విక్రమాదిత్యవల్లభ కళింగసేన భర్తృప్రభావమును వర్ణించి సఖులనెల్ల సంతోషపెట్టెను. అట్టి యావిక్రమాదిత్యుఁడు ఆభార్యలెల్లరను ఆమలయవతిని గూడి సుఖముండెను.

ఇట్లుండ నొకప్పుడు కృష్ణశక్తి యనువేరి రాజపుత్త్రుఁడొకఁడు జ్ఞాతిపరిభూతుఁడు ఏయూర్గురు రాజపుత్త్రులతోఁగూడ దక్షిణాపథమునుండి వచ్చి విక్రమాదిత్యదేవుని సింహద్వారమున కార్పటికవ్రత మవలంబించి సేవించుచుండెను. రాజు వారించినను వినక పండ్రెండు సంవత్సరములు తానా విధమున రాజుం గొలువవలసినట్లుగా ప్రతిజ్ఞ చేసెను. ఆనిశ్చయంబున అనుచరసమేతముగా కృష్ణశక్తి సింహద్వారంబునకుం గొలుచుచుండఁగా పదునొకండు సంవత్సరములు గడచినవి. పండ్రెండవ

సంవత్సరము రాఁగా ఆతనిభార్య దీర్ఘవిరహాకాతరరాయై దేశాం తరమునుండి ఆతనికి జాబు పంపినది వీరచర్యాగతుఁడై రాజు చాటుననుండి వినుచుండఁగా కృష్ణశక్తి దీపముకడ జాబులోని యీవాక్యమును చదివెను. 'నాథ, నీవు లేనితఱిని, కఠినహృదయురాలనైన నా వేఁడినిడుదయూర్పులు నిరంతరము వెలువడుచున్నవి గాని ప్రాణములుమాత్రము వెలువడవు.' ఇట్లు మాటిమాటికి కార్పటికుఁడు చదువుకొనుచుండ మహారాజు విని నగరు సొచ్చి యిట్లు తలపోసెను. 'ఇతనిభార్య బెగ్గడిల్లియున్నది. ఇతఁడును కార్పటికవ్రతంబునం జేసి కడుం గ్లేశ మొందినాఁడు, ఈపండ్రెండవయేఁడు ముగిసినంత తనకార్యము నెఱవేఱనిచో ప్రాణములు విడుచును, కావున ఇతనివిషయమున నిఁక నేను విలంబము సేయఁగూడదు' ఇట్లాలోచించుకొని రాజు ఆక్షణమే దాసిని పంపి కార్పటికుని రావించి శాసనము వ్రాయించి యిట్లాదేశించెను. 'కల్యాణుఁడా, ఓంకారపీఠమార్గంబున నుత్తరదిశకుం బొమ్ము. అట ఈశాసనంబున నే నిచ్చిన గ్రామము ననుభవింపుము. దానిపేరు ఖండవటకము, అడుగుచుం బోయి దానిం జేరుదువు.' విక్రమాదిత్యుఁడు ఇట్లు ఆదేశించి శాసన మతని కిచ్చెను. కార్పటికుండును తనయనుచరులకుం దెల్పక యారాత్రియే వెడలిపోయెను. 'లజ్జాకర మయినయొకగ్రామము చే నా కిం కేటికిగీమ? అయినను దొరయాజ్ఞను జరుపవలసినది.' అని తలపోయుచు సంతుష్టి లేకయే న

చుచు కృష్ణశక్తి ఓంకారపీఠమార్గంబునం బోయి యరణ్యము సొచ్చి అందు పలువురు కన్నియలు ఆడుకొనుచుండఁగాఁ గాంచి 'ఓకన్యలారా, ఇట నెక్కడనేని ఖండవటక మను గ్రామ మున్న దేమో ఎఱుఁగుదురా?' అని యడిగెను. 'మే మెఱుఁగము, ఇంక ముందటికిం బొమ్ము, ఇచటికి పదియామడలదూరమున మానాయన యున్నాఁడు, ఆయన నడుగుము, ఒకవేళ ఆగ్రామమును ఆయన యెఱింగియున్న నుండవచ్చును.' ఇట్లు వారు పలుకఁగా కార్పటికుఁడు అట్లే పోయి వారితండ్రిని రాక్షసుని భీషణాకారునిం గాంచి 'ఓయి కల్యాణుఁడా, ఇట ఖండవటక మెచటనో చెప్పుము.' అని యడిగెను. రక్కసుఁడు కార్పటికుని ధైర్యముచే మోహితుఁడై యి ట్లనియె. 'అయ్యా, నీ కక్కడ ఏమి పని? అది చిరకాలమునుండి పాడుపడియున్నది. అయినను బోయెద వేని, విను, ఈదారి ముందు రెండుగాఁ జీలును, అందు నీవు ఎడమదారిని బోదువేని ఖండవటకమున ఉన్నత ప్రాకార రమణీయ యగు రాజవీథి కేగుదువు.' రక్కసుఁ డిట్లు పలుకఁగా కృష్ణశక్తి యారాజవీథిం జొచ్చి పాడుపడి భయంకరంబై యున్న యాదివ్యహృద్యనగరముం బ్రవేశించెను. అందు ఏడుప్రాకారములలోపల నున్న రాజమందిరముం బ్రవేశించి, అందు మణి కాంచనమయ మయిన మేలిమేడ నెక్కి, అట రత్నసింహాసనముం గాంచి దానిం గూర్చుండెను. అంతలో బెత్తము కేలం బూని రక్కసుఁడు వచ్చి యాతనిని 'ఓయి మనుష్యుఁడా, ఇట

రాజాసనమున నీవు కూర్చున్నా వేమి?' అని యదలించెను. ఆమాట విని కృష్ణశక్తి తెగువతో 'నేను ఇచట దొరను, మీా రు నాకు పన్నుకట్టు కాఁపులు. మిమ్ము విక్రమాదిత్యదేవుఁడు నాకు శాసనపూర్వకముగా నిచ్చినాఁడు.' అని బదులాడెను. ఉత్తరము విని శాసనమును గని ఆరక్షకుఁడు ఆతని పాదము లకు మ్రొక్కి 'నీవు ఇచట రాజవు, నేను నీప్రతీహారుఁడను. విక్రమాదిత్యదేవునియాజ్ఞకు ఎచటను తిరుగు లేదు.' అని పల్కి ప్రకృతుల నెల్లను రప్పించెను అంతట మంత్రులు వచ్చిరి, రాజ పరివారము వచ్చినది. చతురంగబలముతో ఆనగరము నిండినది. ఎల్లవారివలనను మ్రొక్కు లంది కార్పటికుఁడు రాజోపచార ములతో స్నానాదిక్రియలు నెఱవేర్చెను. అట్లతఁడట రాజై 'అహో, విక్రమాదిత్యమహీపాలునిప్రభావ మేమో అవా ఙ్మనసగోచరముగా నున్నది, ఆప్రభునిగాంభీర్యమహిమ అపూ ర్వముగా నున్నది, ఇట్టియీారాజ్యము నిచ్చి గ్రామ మని వేర్కొనియెఁ గదా!' అని అబ్బురపడి తలపోయుచు రాజ్య మేలుచుండెను. అతనిచెలికాండ్రను విక్రమాదిత్యుఁడు ఉజ్జయి నిలో పోషించుచుండెను. కొన్నిదినముల కనంతరము కార్పటిక రాజు ఉత్కంఠితుఁడై నేనాభరంబున భూమి గ్రక్కదల విక్ర మాదిత్యమహారాజు పాదములకు ప్రణామంబు సేయం దరలి వచ్చెను. వచ్చి పాదానతుఁడైన యాకార్పటికరాజుతో విక్రమాదిత్యుఁడు 'నీకు జాబు వ్రాసినభార్యనిశ్వాసములను

పోయి వారింపుము.' అని హెచ్చరించెను. ఇట్లు రాజు హెచ్చ
రించి పంపఁగా నాతఁ డాశ్చర్యపడి సఖులతోఁ గూడ నిజదేశంబు
నకుం బోయి దాయాదులం దఱిమి చిరోత్కంఠితను భార్యను
ఆనందాంబుధి నోలలార్చి ఉత్కృష్ట మయినరాచసిరి ననుభ
వించు చుండెను.

ఇట్టి యద్భుతచరిత్రనువాఁడు ఆ విక్రమాదిత్యమహా
రాజు ఒకనాఁడు పైకి నిక్కఁబొడుచుకొనియున్న వెండ్రుకల
తోడి యొకబ్రాహ్మణునిం గాంచి 'ఓబ్రాహ్మణుఁడా, నీ వేల
యి ట్లయితివి?' అని యడిగెను. అంత నాబ్రాహ్మణుఁడు మహా
రాజుతో తనవృత్తాంతము నిట్లు వర్ణించెను.— పాటలీపురం
బున మహాగ్నిహోత్రి అగ్నిస్వామి యని బ్రాహ్మణుఁ డుం
డెను, నేను ఆయనపుత్త్రుఁడను దేవస్వామిని. నేను దూరదేశ
మున నొకబ్రాహ్మణకన్యను పెండ్లి యాడి చిన్నపిల్ల యయి
నందున తండ్రియింటనే యుంచితిని. జవ్వని యైనంతట దానిం
దెచ్చుటకు ఒకసేవకునిం దోడ్కొని గుఱ్ఱ మెక్కి మామ
యింటికిం బోయితిని. మామ నన్ను సత్కరించి నాభార్యను
గోడిగ నెక్కించి ఒకచేటికను తోడిచ్చి నాతోఁగూడ పంపె
ను. మేము సగముదారి వచ్చినంతట నాభార్య గోడిగను దిగి
నీరుద్రాగుట కని చెప్పి ఏటియొరకుం బోయెను ఎంతసేపటి
కిని మరలి రానందున, చూచి రమ్మని నాసేవకునిం బంపితిని.
వాఁడును ఎంతసేపటికిని రాకపోఁగా, దానిచేటికను గోడిగం

గావ నిలిపి నేను స్వయముగానే పోయితిని. నేను పోయి చూడఁగా నాభార్య నాసేవకుని భక్షించి అస్థిమాత్రావశిష్టు నిం జేసి రక్తమున దొప్పఁదోఁగుచున్న మోముతో భయంకర ముగా నుండెను. దానిం గని నేను భయపలాయితుండనై గోడిగకడకుం బోఁగా చేటికి గోడిగను భక్షించియుండెను. అంతట నేను పలాయితుండ నైతిని. ఆభయంబునంజేసి నాకు ఈయూర్ధ్వరోమకేశత్వము కలిగినది, భయంబును హృదయము నుండి మాయలేదు. ఇవ్విషయంబున ఏలినవారే నాకు గతి.– ఇట్లాబ్రాహ్మణుఁడు చెప్పుకొనఁగా విక్రమాదిత్యదేవుఁడు తన యానచే నాతనిభయముం బోఁగొట్టెను. 'అహో, సాహసికు రాండ్రకు స్త్రీలకు విశ్వాసము లేదు గదా!' అని రాజు పలుకఁగా నచట నొకమంత్రి యి ట్లనియె.—దేవా, దుర్జాత లయిన స్త్రీలు అట్టివారే; అందుల కీ నిదర్శనమును అగ్నిశర్మ యనుబ్రాహ్మణునికథను ఏలినవారు వినలేదా?

ఈనగరమందే సోమశర్మ యనుబ్రాహ్మణునికి అగ్నిశర్మ యని కుమారుఁడు కలఁడు, ఆతఁడు తల్లిదండ్రులకుఁ బ్రాణస ముఁడు, మూర్ఖుఁడు, ఏవిద్యయు తెలియనివాఁడు. వర్ధమాన పురమున నొక బ్రాహ్మణకన్య నాతఁడు వివాహమాయెను. చిన్న పిల్ల యని దానిని తండ్రి ధనవంతుఁడు పంపక ఇంటనే యుంచు కొనెను. ఆబాలకు యౌవనము వచ్చినంతట అగ్నిశర్మను తల్లి దండ్రులు, 'పుత్త్రా, ఇంకను నీభార్యను కొనిరా వేమి?' అని

హెచ్చరించిరి. ఆమాట విని వారితో చెప్పకయే యా మూర్ఖుఁడు అగ్నిశర్మ ఒంటరిగా భార్యకడకు బయలువెడలెను. ఇట్లు తరలఁగానే వానికి కపింజలము కుడి కేఁగెను, దక్షిణమై నక్క వామమే కూయుచుండెను. ఆమూర్ఖుఁడు అందులకు చల్లగా బ్రదుకుము చల్లగా బ్రదుకు మని దీవించెను. ఆమూర్ఖతకు శకునదేవత అదృశ్యగా నుండి నవ్వెను. వాఁడు మామయింటికి పోయి ప్రవేశించుచుండఁగా కపింజల మెడమ కేఁగెను. శివయు అశివంబు పల్కుచు వామ యాయెను. రెండియు నాతఁడు చల్లగా బ్రదుకు మని దీవించెను అంతట శకునదేవత 'అయ్యో! వీఁ డెంతమూర్ఖుఁడు! అశుభమును శుభమని సంతసించుచున్నాఁడు! అయశుభము సూచించు వానిని దీవించుచున్నాఁడు! పాపము, వీనిప్రాణమును నేను గాచెదఁగాక.' అని తలపోయుచుండఁగా వాఁడు ఇల్లు సొచ్చెను. మామ సంతోషించెను. 'ఏమి, ఒంటరిగా వచ్చితివి!' అని మామయు నితరులును అడుగఁగా 'ఇంట నెవ్వరికిం జెప్పక వచ్చితి' నని యాతఁ డుత్తర మిచ్చెను అనంతరము ఆతనికి యథోచితముగా స్నానభోజనాదికములు గావించిరి, రాత్రి పడుకటింట నాతనికడకు అలంకరించి భార్యను బంపిరి. దారి నడకబడలికచే నాతఁడు మైమఱచి నిద్రపోయెను. అంతట భార్య తనయుపపతిని దొంగను కొఱుత నున్నవానిం గనఁబోయెను. అది వానిదేహముం గవుంగిలింపఁగానే అందుఁ

ప్రవేశించియున్న భూతము దానిముక్కును తెగఁగొఱికెను.
అంత నది భయంబున నింటికిం బఱతెంచి నిద్రితుఁ డగుభర్త.
చెంత ఒఱనుండి వెఱికినకత్తియొకటి పెట్టి బంధువుల కంద
ఱకు వినంబడునట్లుగా 'అయ్యో అయ్యో! చచ్చితిని చచ్చి
తిని! ఇతఁడు నామగఁడు లేచి నిష్కారణముగా నాముక్కుఁ
గోసివైచినాఁడు.' అని యేడ్వసాగెను. అంత బంధువులు వచ్చి
దానిముక్కు తెగియుండుటం గాంచి అగ్నిశర్మను దుడ్డుగుదియ
లతో మోఁదసాగిరి. తెల్లవాఱఁగానే రాజునకదం జెప్పుకొని
రాజాజ్ఞచేత నాతని వధింపుఁ డని నిర్దోషభార్యాద్రోహి యని
చెప్పి తలారుల కప్పగించిరి. తలవరులు వానిని వధ్యభూమికిం
గొనిపోయిరి. అంతట వానిభార్య చేసినరాత్రిచర్యకు సాక్షి
ణిగా నుండినది శకునదేవత యిట్లు తలపోసెను, 'పాపము,
అవశకునఫలము వీని కిది ప్రాప్తించినది, మఱి వీఁడు జీవ జీవ
యని పలికినందులకు వీనిని నేను చావునుండి తప్పించెద.' ఇ
ట్లాలోచించుకొని ఆదేవత మింటనుండి 'ఇతఁడు నిర్దోషుఁడు
బ్రాహ్మణకుమారుఁడు, తలవరులారా ఇతనిం జంపఁ దగదు.
కొఱత నున్న దొంగపండ్ల నడుమ ముక్కు ఇఱుకుకొని
యున్నది పోయి చూడుఁడు.' అని పలికి ఆతనిభార్య రాత్రిచ
ర్యను వెల్లడించెను. అంత తలవరులు పోయి అట్లే యుండుఁ
గాంచి ఆతార్కాణచే ప్రతీహారముఖంబున ఆవృత్తాంతమును
తేని కెఱింగించిరి. తేఁడు అగ్నిశర్మను విడిపించి యింటికిం

ఖంపి, ఆచెడిపను దానిబంధుపులను దండించెను. స్త్రీలు ఇట్టివారు సుమా మహారాజ!— ఇట్లని మంత్రి వచింపఁగా విక్రమాదిత్యమహారాజు అది యట్లే యని యంగీకరించెను.

అంతట నట తేని చెంత నున్న మూలదేవుడు ధూర్త శిఖామణి యిట్టు లనియె. దేవా, కొందఱు చెడిప లున్నారని లోకములో పతివ్రతలే లే రన వచ్చునా! విషవల్లు లున్న వేని మావిళ్ళఁగ లుండవా? నేనే అనుభవించిన యీకథను వినుఁడు. పూర్వము నేను శశితోఁగూడ నాగరకస్థాన మయిన పాటలీపుత్త్రమునకు అందలి నెఱజాణతనముం గనవేఁడి పోయియుంటిని. అట ఊరివెలుపల కొలన నొకముసలిది వస్త్రము లుదుకుకొనుచుండఁగాఁ గాంచి 'ఇచ్చట పాంథు లెట బసచేయుదురు?' అని యడిగితిని. "ఇట జక్కవలు కిద్దువందును, మీలునీటను, తుమ్మెదలు తామరలందును, బసచేయును, పాంథులబస నిందు నేఁ గని యెఱుంగను." అని ముసలిది వక్రోక్తిగా నాకు ఉత్తరము చెప్పెను. నేను వెలవెలఁబోయి శశితోఁగూడ నగరములోనికిం బ్రవేశించితిని. అందు ఒకబాలుఁడు గడపకడగిన్నెలో వేఁడిపరమాన్నము బెట్టుకొని యేడ్చుచుండం గాంచి శశి 'ఎంతమూర్ఖుఁ డీపిల్లవాఁడు, ఎదుట పెట్టియున్న పరమాన్నముచు భుజింపక వృథాగా ఏడ్చుచు శ్రమపడుచున్నాఁడు!' అనియెను. ఆమాట విని ఆబాలుఁడు కన్నులు తుడుచుకొని నవ్వుచు 'మూర్ఖులు మీరు, ఏడ్పువలన నాకు నేమి గుణ

ములు కలవా యెఱుంగరు. పరమాన్నము క్రమముగా చల్లఁ
బడి తీపెక్కును, నాకు శ్లేష్మ క్షయించును. ఏడ్పువలన నాకు
ఇవి గుణములు, నేను మౌర్ఖ్యము చేత ఏడువలేదు, మీరు
గ్రామ్యులు మూర్ఖులు, అభిప్రాయము నెఱుంగ రైతిరి,' అని
బదులు పల్కెను. బాలుఁ డిట్లు వచింపఁగా మా తెలియమికి
మేము లజ్జపడి వింతపడి అటనుండి తొలఁగి ఆవలి కేఁగితిమి.

అట నొకవరకన్య తన పరివారము నేల నుండఁగా
తాను మామిడిచెట్టుపలవ మీఁదం గూర్చుండి మామిడిపండ్లు
కోయుచుండం గాంచి 'ఓకల్యాణీ, మాకును ఒకకొన్ని మామి
డిపండ్లిమ్ము' అని యడిగితిమి. 'మామిడిపండ్లను మీకు వేఁడి
వానిని తినెదరా చల్లనివానిని తినెదరా? అని యాకన్య మమ్ము
నడిగెను. ఆయాశ్చర్యము నెఱుంగఁ గోరి నేను 'ముందుగా
వేఁడిపండ్లను భుజింతుము, అనంతరము చల్లనిపండ్లను' అని
యుత్తర మిచ్చితిని. అంత నాకన్నియ నేలను దుమ్ములో మా
మిడిపండ్లను పడవైచెను. వానిని మేము నోటిగాలితో నూఁది
దుమ్మొదలించి భక్షించితిమి. అంత నాకన్య పరివారసమేతము
గా నవ్వి మాతో 'మొదట మీకు ఆవేఁడిపండ్ల నిచ్చితిని, అవి
వేఁడివి గనుకనే మీరు నోటిగాలితో నూఁది భక్షించితిరి.
ఇప్పుడు చల్లనిపండ్ల నిచ్చెదను, వీనిని మీరు నూఁదరు, వస్త్ర
ము పట్టుఁడు.' అని పలికి మావస్త్రములందు మరల కొన్ని
పండ్లను వైచినది. వానిం బుచ్చుకొని వెలవెలం బోవుచు ఆకా

వునుండి మే మవలి కేఁగితిమి. అట శశిని కడమ సహచరులను ఉద్దేశించి నే నిట్లంటిని. 'ఈపిల్ల నెఱజాణ. దీనిని నేను అవశ్యము పెండ్లియాడవలయును. ఇది చేసిన యపహాసమునకు ఈ ప్రతీకారము చేయనేని సార్థూర్తత యింక నే మున్నది!' ఇట్లు నేను పలుకఁగా వారు దాని తండ్రియిల్లు కనిపట్టిరి. మేము మఱునాఁడు మాఱు వేషమున ఎఱుకపడక అతనియింటికిం బోయితిమి. అట నాకన్నియతండ్రి బ్రాహ్మణుఁడు వేదము పఠించుచుం బోయిన మమ్ముం బిలిచి మీా రెవ రని యడిగెను. 'మేము మాయాపురినుండి విద్యకై యిట కేతెంచితిమి.' అని యుత్తర మొసంగితిమి. ఆబ్రాహ్మణుఁడు ధనికుఁడు మాతో 'అటులేని, ఇటనే ఈనాలుగు మాసములు మాయింట నుండుఁడు, మీారు దూరదేశాగతులు, నాయం దనుగ్రహము సేయుఁడు.' అని వేఁడెను. బ్రాహ్మణోత్తమా, నాలుగుమాసములకడపట మాకోర్కి నెఱవేర్చెదవేని, నీకోరిక నిపుడు మేము నెఱవేర్చెదము.' అని వచించితిమి. 'నాకు వశ్యమయిన వస్తువు నడుగుదురేని, నేను తప్పక యిచ్చెద.' నని యజ్ఞస్వామి యుత్తర మిచ్చెను. అంతట మేము అతనియింటనే నెలకొంటిమి. నాలుగు మాసములు నిండఁగానే 'అయ్యా, మేము పోయెదము, మున్ను మాకు నీవు ఇచ్చెద నని ప్రతిజ్ఞ చేసిన ప్రకారము యిపుడు మే మడుగుదాని నిమ్ము.' యనియడిగితిమి. 'ఏ మడిగెద' రని యాతఁ డడుగఁగా 'మాలో ప్రధానునికి ఈ

కన్యను నీ వీయవలసినది' అని యడిగితిమి. అంత నాబ్రాహ్మ
ణుఁడు తనమాటచే కట్టుపడ్డవాఁడై 'వీరు నన్ను మోసముచేసి
నారు, అయినను ఇందు దోష మేమి? ఈతఁడు గుణవంతుఁడు,'
అని తలపోసి నాకు తనకన్యను యథావిధిగా దానముచేసెను.
రాత్రి, నేను పడుకటింటిలోనవ్వుచు పెండ్లికొమారితతో ఆ వేఁడి
మామిడిపండ్లు చల్లమామిడిపండ్లు నేమయిన జ్ఞప్తియున్నవా?'
అని యడిగితిని. ఆమాట విని ఆనవాలుపట్టి యాసుందరి
నాతో నవ్వుచు 'ఇట్లే గ్రామ్యులు నాగరకులచే మోసపోవు
చుందురు' అనెను. అంతట నేను 'ఓసినాగరకురాలా, సుఖ
ముందుము, గ్రామ్యుఁడను నేను ఇదే ప్రతిజ్ఞాపూర్వకముగా
నిన్ను త్యజించి దూరదేశమున కేఁగెదను.' అని బెదరించితిని.
అందులకు నాభార్యయు 'నిక్కముగా నీకుపుట్టిన నాకొమరుని
చేత నిన్ను కట్టించి యింటికిం దెప్పింతును.' అని ప్రతిజ్ఞ చేసెను.
ఇట్లు మేమొండొరులతో ప్రతిజ్ఞలు పట్టితిమి నాభార్య పెడ
మొగంబుగం బరుండినది. అది నిద్రించినతఱి దానివ్రేల నా
యుంగరమిడి వెలువడి నాసహచరులతోఁ గలసికొని దాని జాణ
తనమును పరీక్షించువాఁడనై నానివాసమయిన యీయుజ్జయినీ
నగరమున కేతెంచితిని.

ఆ బ్రాహ్మణకుమారియు వేకువ మేల్కాంచి నన్నుం
గానక నావేరు చెక్కిన యుంగరమును తనవ్రేలం గాంచి ఆత
ఁడు నన్ను త్యజించిపోయినవాఁడు, ఇంతవఱకు అతని ప్రతిన

నతఁడు నెఱవేర్చుకొన్నాఁడు ; నేనును చింత మాని నాప్రతి జ్ఞను పాలించుకొనవలయును. ఈయుంగరమువ మూలదేవుఁ డని వే రగపడుచున్నది. కావున నిశ్చయముగా మూలదేవుఁ డని ప్రఖ్యాతుఁ డైనధూర్తుఁ డితఁడే. అతఁడు ఉజ్జయినిలో నివసించు నని చెప్పుదురు. కాన యుక్తిగా అచటి కేఁగి నా కోరిక నెఱవేర్చుకొనియెదను.' అని సంకల్పించి, తండ్రితో 'నాయనా నాభర్త నన్ను ఆకస్మికముగా త్యజించి పోయి నాఁడు, ఆతనిం బాసి నే నెట్లు సుఖముండును ! నేను తీర్థ యాత్రలచే ఈపాడుదేహమును అలయించెదను.' అని టక్కు చేసి ఆతఁ డొప్పుకున్నను కడఁకమెయి నొప్పించి అటనుండి ధనపరివార సమేతంబుగా బయలువెడలెను. లోకైకసుందరి యామె క్రమముగాఁబోయి మహావిభవోత్తరం బగుబోగము దానివేషము దాల్చి ఉజ్జయినీనగరము సొచ్చెను. చేయ వలసిన విషయంబుంగూర్చి పరివారమునకు గుట్టుగా ఏర్పాటు చేసి తనకు సుమంగల యని వేరు కైకొనెను. అచట 'కామ రూపదేశమునుండి గణిక సుమంగల వచ్చియున్నది, ఎక్కువ యీవికి భోగింప నలవడునది;' అని భృత్యులచే ప్రసిద్ధి సేయిం చెను. దేవదత్త యను వేరి గణికామతల్లి ఉజ్జయినీపురమునది ఎదురువచ్చి సుమంగలకు రాజార్హమయిన తనమందిర మొకటి ప్రత్యేకముగా బసకై యిచ్చినది. అందున్న యాసుమంగలకు ముందుగా నామిత్త్రము శశి ఖ్యాతి విని తనవలన ఒకరాత్రికి

బాడిగ గొనవలసిన దని భృత్యముఖంబునం దెలిపెను. 'మా మాటచొప్పున ఏకాముకుఁడు నడచుకొనునో ఆకాముకుఁడు మాకడకు వచ్చును, మాకు బాడిగ అక్కఱలేదు, పశుప్రాయులయిన యితర పురుషులతోనుం బనిలేదు' అని ఆభృత్యుని వలననే సుమంగల బదులువార్త పంపఁగా అంగీకరించి శశిరేఖయొంగంబుననే దానియింటికిం బోయెను. అట తొలిద్వారము చేరి తన్నుం దెలుపుకొనెను. ద్వారపాలకుఁడు 'మంచిది మా స్వామిని మాటబడి నడచుకొనుము, నీవు స్నానముచేసియే వచ్చియున్నను, ఇట మరల స్నానము సేయుము, ఒండువగ నీ కిటం బ్రవేశము లేదు. అనెను. శశి స్నానమున కొప్పుకొనెను. అంతట దాసీజనము వచ్చి యాతనికి నూనె యంటి నలుఁగులు పెట్టి చక్కఁగా స్నానమాడించిరి. దానం దొలిజాము గడచిపోయెను. ఇట్లు స్నానమై యాతఁడు రెండవ వాకిటికడ కేఁగఁగా, అట ద్వారపాలకుఁడు 'స్నాన మాడితివి సరియే, మఱి అలంకరించుకొమ్ము.' అనియెను. వల్లె యని శశి పల్కఁగా దాసీజనము వచ్చి రెండవజాము సయితము గడచి పోవువఱకు కైసేత లొనర్చుచుండిరి. శశి మూఁడవద్వారము నకుం బోఁగా ద్వారపాలకులు 'ఆర్యా, భోజనము గావించి లోనికిం బొమ్ము.' అని పల్కిరి. మంచి దని శశి పల్కఁగా, దాసీజనులు నానావిధాహారంబు లతని కొసంగుచు మూఁడవ జాము గడచువఱకు విలంబము గావించిరి. అంతఁ నతఁ డెట్టి

కేలకు నాలవవాకిటికడకుఁ బోఁగా అట ద్వారపాలకుఁడు
'గ్రామ్యకాముకుఁడా, మరలిపో, ఇట చీవాట్లు తినెదవు, గణి
కానవసంగమమునకు నాలవజాముఁటోయి కాలము?' అని బెద
రించెను. మానిసిరూపెత్తినకాలముచేతనుం బోలె వాకిటి
కావలివానిచే నిట్లు తిరస్కారము నొందినవాఁడై విగళితచ్ఛా
యుఁడై కళి వచ్చినదారినే యింటి కేఁగెను.

ఇట్లు సుమంగలానామధారిణియై గణికావేషంబున
నుండి యాబ్రాహ్మణపుత్త్రి ఇతరులను పెక్కురను తన్ను
వలచి వచ్చిన కాముకుల నెల్ల మోసపుచ్చెను. ఆ ప్రతీతి
విని, మహారాజా, కుతూహలంబున నేను దూతం బంపి ఉత్త
రము తెప్పించుకొని రాత్రి చక్కఁగఁ గైసేఁతలు సేసికొని
దానిమందిరమున కేఁగితిని. ద్వారద్వారముకడ నున్నవారిని
ధన మిచ్చి వశపఱుచుకొని త్వరగానే దానిపడుకటింటికడ కేఁగి
తిని. కాలమునకు వచ్చితినిగాన నన్ను అచటి ద్వారపాలకులు
లోనికిం బోనిచ్చిరి నేను లోని కేఁగి నాప్రియం గంటినిగాని,
వేశ్యావేషముచే ఆనవాలు పట్టనేరనైతిని. ఆధూర్త నన్ను
ఆనవాలుపట్టి వేశ్యయ వోలె ఎదురు వచ్చి కొనిపోయి
మంచంబునం గూర్చుండఁ జేసి యుపచరించెను. ఆ లోకైక
సుందరితో ఆరాత్రి గడపి దానియందు నా యనురాగమును
నాటి దానియింటినుండి వెడలనేరనైతిని. అదియు నాయందు
తన యనురక్తిం గట్టి యపుడు నాపజ్జం బాయదాయెను.

అట్లు అచటనే నే నుండ కొన్నిదినంబులకు సుమంగల గర్భిణి యాయెను, చనుమొనలు నల్లఁబాఱెను. అంత నాజాణ ఒక మాయజాబుం గల్పించి నాచేతి కిచ్చి 'నాదార యగు రాజు దీనిని నాకు వ్రాసినాఁడు, చదువుము' అనెను. నేను విప్పి యిట్లు చదివితిని. 'శ్రీకామరూపదేశమునుండి శ్రీమంతుఁడు మానసింహమహీపతి సుమంగల నిట్లు ఆజ్ఞాపించుట. ఏమి అట నింతదీర్ఘకాల ముంటివి? దేశాంతరకుతూహలము మాని శీఘ్రముగా రావలసినది.' నే నిట్లు కమ్మ చదువఁగా సుమంగల నెవ్వలునంబోలె 'నేను పోయెదను, నాపై కినియఁదగదు, పరవతిని గదా.' అని మిష పెట్టి తన పాటలీపుత్త్రమునకుం బోయెను. అనురక్తుఁడ నయ్యును పరాయత్త యని తలంచి నేను దాని ననుగమింప నైతిని.

ప్రియయు పాటలీపుత్త్రము చేరి కాలంబున పుత్త్రునిం గనియెను. ఆశిశువు క్రమముగా నెదిగి సకల కలలను, నేర్చెను, పండ్రెం డేండ్లప్పుడు ఆ బాలుఁడు ఒకనాఁడు బాల్యచాపల్యంబునం జేసి తన యీడువానిని దాసీపుత్త్రుని తీఁగతో కొట్టెను. దెబ్బ తిని ఏడ్చుచు దాసేరకుఁడు కోపంబున 'నీయబ్బ యెవరో తెలియరాదు, నీవు నన్నుఁ గొట్టుచున్నావు, అమ్మ పరదేశముల సంచరింపఁగా ఎట్లో పుట్టినవాఁడవు.' అని దూరెను. అంత నాబాలుఁడు లజ్జితుఁడై యింటి కేఁగి తల్లిని 'అమ్మా, మాయాయన యెవరు? ఎక్కడ నున్నాఁడు?' చెప్పు

మనెను. అంత తన్మాత యాబ్రాహ్మణపుత్త్రి క్షణము చూచి 'సాధ్వీ, నీతండ్రి మూలదేవుఁ డనువాఁడు. నన్ను వదలి ఉజ్జ యినికిం బోయినాఁడు.' అని చెప్పి బాలునికి తనవృత్తాంత మెల్ల వివరించెను. అంతట బాలుఁ డిట్లనియెః—'అమ్మా, అట్లయిన నేను పోయి ఆతనిం గట్టి తెచ్చెదను. నీప్రతిజ్ఞను తుద ముట్టించెదను.' బాలుఁ డిట్లు పల్కి తల్లివలన నా గుర్తులు తెలిసికొని ఈయుజ్జయినికి వచ్చెను.

ఇట నాతఁడు వచ్చినవాఁడై అందు జూదమాడుచున్న నన్ను తల్లిచెప్పిన గుర్తులవలనం గనిపట్టి నేన యని నిశ్చయము చేసికొని, ఇంతలోనివారినెల్ల జూదమాడి గెలువసాగెను. పసిబాలుఁడయ్యును మహాధూర్తుఁ డయి ఎల్లవారిని అబ్బురపుచ్చుచు జూదమున గెలిచినధన మెల్ల యాచకుల కిచ్చివేసెను. ఆబాలుఁడు రాత్రి వచ్చి తనయుక్తిచే నన్ను ఎత్తి దూదిరాశి మీఁద క్షణములో పరుండఁబెట్టి నాక్రింద నుండినమంచమును హరించెను. అనంతరము నేను మేల్కాంచి దూదిరాశిపై నే నుంటం జూచికొని నాక్రిందిమంచముం గానక లజ్జాహాసాశ్చర్యములపా లయితిని. అనంతరము, మహారాజా, నేను మెల్లగా బాజాలునకుం బోయి అటనిటం దిరుగుచు ఆబాలునే ఆమంచమునే అమ్మఁజూపుచుండఁగాఁ గాంచితిని. వానిచెంత కరిగి 'ఈ మంచము నెంతవెల కిచ్చెదవు?' అని బేర మాడితిని. బాలుఁ డిట్లనియె. "ఓయిధూర్తశిరోమణీ, ఈమంచము వెలకు రాదు,

అపూర్వాద్భుతవృత్తాంతవర్ణనకు వచ్చును.' ఆమాట విని నే ని ట్లంటిని.—'అట్లయిన నేను నీకు అద్భుతముం జెప్పెద. నీవు దాని తత్త్వ మెఱింగి సత్యమని యొప్పుకొనవలయును. తత్త్వ మెఱుంగ నేరక నసత్యమని పల్కుదువేని నీవు జారజాతుఁడవుగా నొప్పుకొనవలసినది. మంచమును నాకియ్యవలసినది. ఈనిబం ధన నొప్పెదవేని నీకు విచిత్ర మొకటి చెప్పెదను వినుము పూ ర్వము ఒకానొకభూనాథుని రాష్ట్రమున కాటకము రాఁగా, ఆతఁడు నాగములవాహనముల తుంపురుల పెంపులతో పంది పెండ్లాముమీఁదున సేద్యము నేయించెను, దానం బండినధాన్య ములతో సమృద్ధుఁడై యారాజు జనులకు కలిగినకఱవును తీర్చి లోకపూజితుఁ డాయెను.' ఇట్లు నేను చెప్పఁగానే బాలుఁడు పకపక నవ్వుచు ని ట్లనియె:—'నాగములకు వాహన ములు మేఘములు, పంది పెండ్లాము భూమి, వరాహముగా నవ తరించిన విష్ణువునకు ఆమె ప్రియతమగదా. భూమిలో మేఘో దకముచే ధాన్యము పండెనేని వింతయేమి?' ఇట్లు పలికి ఆబాల ధూర్తుఁడు విస్మయావిష్టుని నన్ను వెండియు 'నీకు నేను ఒక యపూర్వ వృత్తముం జెప్పెద, దానితత్త్వ మెఱింగి సత్య మని యొప్పుకొనియెదవేని, ఈమంచమును నీకిచ్చెదను, తప్పెదు వేని నాకు నీవు దాసుఁడవు గావలయు,' ననియెను. అందు లకు నే నంగీకరించితిని. అంతట బాలధూర్తుఁడు 'ఓయీ ధూర్త

పతీ, ఇందు పూర్వము ఒకబాలుఁడు పుట్టెను, పుట్టినప్పుడే వాఁడు పాదములబరువుచే భూమిని గ్రక్కదలఁజేసెను. అప్పుడే వృద్ధుఁడై లోకాంతరమున పదముంచెను.' అని వాక్రుచ్చెను. బాలుఁ డిట్లు పలుకఁగా అందులతత్త్వ మెఱుంగనేరక 'ఇది యసత్యము, ఇందు కొంచెమేనియు నిజము లేదు ' అని నేనుపరి హసించితిని. అంతట వెండియు నాబాలుఁడు 'ఏమి హరి వామన మూర్తిగా పుట్టినమాత్రాన చరణాక్రాంతయై భూమి యెల్లఁ గ్రక్కదలలేదా? అప్పుడే అతఁడు పెరిఁగి స్వర్లోకమున పద ముంపలేదా? మఱి యోడితివి గదా, ఇఁక నీవు నాకు దాసుఁడవు. మన పందెమునకు ఈబాజాలులో నున్నవా రెల్లరు సాక్షులు. మఱి నే నెటకుఁ బోదునో అటకు నాతోఁకూడ రమ్ము.' అని పచించి ధీరత మెఱయ చేతితో నాబుజముం బట్టుకొనియెను. అచ్చటివా రెల్ల వానిపక్షముగానే సాక్ష్యము చెప్పిరి. అంత నాతఁడు పందెముప్రకారము నన్ను కట్టివేసి తనయనుచరులతో గూడ పాటలీపురమునకు తల్లికడకుం గొనిపోయెను. వాని తల్లియు అట్లువచ్చిన పుత్త్రుంగని నాతో 'ఆర్యపుత్త్రా, నేనును నాప్రతిజ్ఞను నెఱవేర్చితిని, నీకు జనించిన నాకుమారునిచే నిన్ను కట్టించి తెప్పించితిని.' అని పల్కి ఎల్లరయెదుట సాధ్విమణి వృత్తాంతమును వివరించెను. అట్లు తనప్రతిజ్ఞచే కోరిక నెఱవేర్చుకొన్న యాసుందరిని పుత్త్రునిచే లోకనింద తప్పించు

కొన్న వానిని అభినందించి బంధువులెల్ల పండువుం గావించిరి. ఇట్లు నేను కృతార్థుండనై భార్యతోను ఆకుమారునితోను అచ్చట చిరకాలముండి అనంతర మీయుజ్జయినికి వచ్చితిని.— మహారాజా, ఇట్లు భర్తృభక్తలు కులాంగనలు ఈలోకమునం గలరు, ఎల్లస్త్రీలును దురాచారలే అని చెప్పఁగూడదు. ఇట్లు మూలదేవుని యీకథ విని విక్రమాదిత్యుఁడు మంత్రులతోఁ గూడ సంతోషించెను.

ఇట్లామహారాజు ఆశ్చర్యములను చూచుచు వినుచు సద్వీపను సకలమహిని జయించి యేలుచుండెను.

ఇట్లని సంయోగవియోగముల మాటిమాటియున్న విషమశీలునికథను వర్ణించి కణ్వముని సుదనమంచుకావిరహ సమయంబున నాతో వెండియు నిట్లనిరి.—"ఇవ్విధంబున ఊహింపరానివై వియోగంబులును సమాగంబులును ప్రాణికోటికి కలుగుచుండును. కావున నీకును, నరవాహనదత్తుఁడా, త్వరలోనే ప్రియతోడ సమాగమము కలుగును. ధైర్యము దాల్పుము, చిరకాలము భార్యాసచివసమన్వితుండవై విద్యాధరచక్రవర్తిపదము ననుభవింతువు.' కణ్వమహాముని చేసిన యీయుపదేశంబున ఊఱడిల్లి నేను ఆవిరహకాలమును గడపి క్రమముగా భార్యలను విద్యలను విద్యాధరసామ్రాజ్యమునుం బొందితిని. అది యెల్ల వరసుండ యున శంభుని యను గ్రహంబున నాకెట్లు లభించెనో,ముందే మీకు వర్ణితముగదా.

ఇట్లు కశ్యపాశ్రమమున నరవాహనదత్తుఁడు తనకథను చెప్పి మునిజనులను మామను హర్షింపఁజేసెను. వర్షాకాలము నచట పుచ్చి తపోవనగతులను మామను మహర్షులను వీడ్కొని భార్యామంత్రిసమేతుఁడై విమానమెక్కి విద్యాధరసైన్యములతో ఆకాశమును గప్పి వైచుచు తరలి క్షణములో తన నివాసమునకు ఋషభాద్రికింబోయి విద్యాధరేంద్రులనడుమ సామ్రాజ్యభోగ మనుభవించుచు మదనమంచుకాదేవితోడను రత్నప్రభాదిదేవులతోడను ఒకకల్పకాల సుఖముండెను.

ఇట్లు పూర్వము కైలాసంబున పార్వతీదేవికి తత్ప్రార్థితుఁడై పరమేశ్వరుఁడు చెప్పిన యీబృహత్కథను శాపవశంబున భూలోకమున కాత్యాయనాదిరూపంబుల నవతరించిన పుష్పదంతాదులు భూలోకంబునం బ్రకటీకరించినారు. 'నా నోట వెలువడిన యీకథను ఎవరు చదువుదురో ఆదరంబున విందురో జ్ఞప్తి నుంచుకొందురో, వారు పాపముఁలం ద్రోచి కృతార్థులై మేటి విద్యాధరులై నాలోకమున వసింతురు.' అని ఈకథకు పరమేశ్వరుఁడాసమయంబున వర మొసంగెను.

విషమశీలలంబకము సమాప్తము.

---

కథాసరిత్సాగరము సమాప్తము.